# గ్రంథాలయ వనరులు



## సంకలనాభివృద్ధి, నియంత్రణ, సేవాది సమస్యలు

సంపాదకులు

యం. శంకరరెడ్డి

యం. వి. వేణుగోపాల్

సహాయకుడు

లింగాల పాండురంగయ్య




తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

**1988**

# GRANDHALAYA VANARULU
## Sankalanabhivriddhi, Niyantrana, Sevadi Samasyalu

---

ప్రకాశకులు :
**తెలుగు విశ్వవిద్యాలయం**
హైదరాబాదు - 500 004.
తరపున
విశ్వవిద్యాలయ కులసచివులు, శ్రీ టి. డి. ప్రసాదరావు



ప్రతులు : 1000

**వెల : రూ. 35-00**

ప్రచురణ :
**తెలుగు విశ్వవిద్యాలయం**
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు.

# ప్రకాశక విజ్ఞప్తి

గ్రంథాలయాలు కేవలం పుస్తక భాండాగారాలు కావు. మానవ మేధస్సును నిక్షిప్తం చేసిన జ్ఞానమందిరాలు. సరస్వతీ నిలయాలు. సమాచార కేంద్రాలు. జాతి, మత, కుల, వయో, లింగభేదాలు లేకుండా అందరికీ అన్ని వేళలా విజ్ఞానాన్ని అందించే సేవా సంస్థలుగా నేడు పరిగణింపబడుతున్నాయి.

ఇది సమాచార యుగం. విజ్ఞానం వెల్లువలా పెల్లుబుకుతూ దినదిన ప్రవర్ధ మానమవుతున్నది. పెరుగుతున్న విజ్ఞానాన్ని పదిలంగా భద్రపరచి, వలసిన వారికి అందించడంలో గ్రంథాలయాలు నిర్వహిస్తున్న పాత్ర అనన్యసామాన్యం. ముఖ్యంగా విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు పరిశోధకులకు గరిష్టస్థాయిలో ఉపయోగపడుతూ అత్యుత్తమ సేవలనందిస్తున్నాయి.

నేడు ప్రతి రంగంలోను పరిశోధన విస్తృతమవుతున్నది. ఎన్నో నూతన విషయాలు ఆవిష్కరించబడుతున్నాయి. ఒక విషయంలో నిష్ణాతుడైన వ్యక్తి కూడా ఆ విషయానికి సంబంధించిన పరిశోధన ఎంత మేరకు జరిగిందనే విషయాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకోలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అయితే వృద్ధిచెందుతున్న పరిశోధనాంశాలను, సమస్త విజ్ఞానాన్ని, సమాచారాన్ని ఎప్పటికప్పుడు సేకరించి, భద్రపరచి పరిశోధకులకు తదితర చదువరులకు అందించడంలో గ్రంథాలయాలు ముఖ్యసాధనాలుగా ఉపయోగ పడుతున్నాయి.

ఈ విషయాలను దృష్టియందుంచుకొని తెలుగు విశ్వవిద్యాలయం 1987 డిశంబరు 13, 14, 15 తేదీలలో "గ్రంథాలయ వనరులు-సమష్టి సమీకరణ" సదస్సును మొదటిసారిగా తెలుగులో నిర్వహించటం జరిగింది. మూడు రోజుల పాటు జయప్రదంగా నిర్వహించబడిన ఈ సదస్సులో 26 వ్యాసాలు సమర్పించబడినాయి. ఆ వ్యాసాలను పుస్తకరూపంలో ముద్రిస్తే గ్రంథపాలకులకు, గ్రంథాలయశాస్త్రాన్ని అభ్యసించే విద్యార్థులకు, బోధించే అధ్యాపకులకు ఉపయోగకరంగా ఉండగలదని భావించి చేసిన ప్రయత్నమే ఈ సంపుటి. మా ఈ ప్రయత్నం తెలుగు వారి అభిమానాన్ని, ముఖ్యంగా గ్రంథాలయాభిమానుల ఆదరాభిమానాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

టి. డి. ప్రసాదరావు
కులసచివులు
**తెలుగు విశ్వవిద్యాలయం**

# గ్రంథాలయ వనరుల
# సమష్టి సమీకరణ సదస్సు
## (13, 14, 15 డిసెంబరు 1987)

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం
హైదరాబాదు

కార్యాచరణ సంఘం

**ఆచార్య తూమాటి దోణప్ప**
(అధ్యక్షులు)

**యం. శంకర రెడ్డి**
(సమావేశ సంధాత)

డా॥ వి. వి యల్. నరసింహారావు
యం. వి. వేణుగోపాల్
యల్. యస్. రామయ్య
డా॥ వెలగా వెంకటప్పయ్య
కె. శ్రీరామమూర్తి
(సభ్యులు)

# వ్యాసకర్తలు

కనకాచారి, యం.
సహాయ గ్రంథాలయాధికారి
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007,

కామయ్య, పి.
ఉపగ్రంథాలయాధికారి మరియు
గ్రంథాలయ సమాచారశాస్త్ర
శాఖాధిపతి, శ్రీకృష్ణదేవరాయ
విశ్వవిద్యాలయం, అనంతపురం.

గోపీనాథ్, ఆమళ్ళదిన్నె
ఇన్‌చార్జ్ కార్యదర్శి
ప్రథమశ్రేణి గ్రంథపాలకుడు
జిల్లా గ్రంథాలయ సంస్థ,
అనంతపురం-515 001.

నరసింహమూర్తి, జి.
లెక్చరర్
గ్రంథాలయ సమాచారశాస్త్రం
ఎస్.వి.ఇ.ఎస్. ప్రభుత్వ తెలుగు
కళాశాల, విద్యానగర్,
హైదరాబాదు.

నరసింహారావు, వి.వి.ఎల్.
నిర్దేశకులు
ఆంధ్రప్రదేశ్ ప్రాచ్య లిఖిత
భాండాగారం
ఆబిడ్స్, హైదరాబాద్.

నాగిరెడ్డి, వై.
సహాయ గ్రంథాలయాధికారి
హైదరాబాదు విశ్వవిద్యాలయం
గచ్చిబౌలి, హైదరాబాదు.

మూర్తి, టి.ఎ.వి.
గ్రంథాలయాధికారి
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు.

యాదగిరిరెడ్డి, జె.
లెక్చరర్
గ్రంథాలయ, సమాచారశాస్త్ర
విభాగం, ఉస్మానియా
విశ్వవిద్యాలయం, హైదరాబాదు-7

రమణయ్య, కె.
గ్రంథాలయ సహాయకుడు
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్.

రాఘవయ్య, ఆళ్ళ
గ్రంథపాలకుడు,
శాఖాగ్రంథాలయం, బాపట్ల.

రాజు, ఎ.ఎ.ఎన్.
శాఖాధిపతి
గ్రంథాలయ సమాచారశాస్త్రశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

రామచందర్‌రావు, కె.
గ్రంథపాలకుడు
ఎం.వి.ఎస్.ఆర్. ఇంజనీరింగ్
కళాశాల, హైదరాబాదు

రామమూర్తి, గద్దె
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘం
గౌరిపల్లి, మల్లవరం పోస్టు
వయా చాగల్లు,
పశ్చిమగోదావరి జిల్లా.

రామయ్య, యల్.యస్.
గ్రంథాలయాధికారి
ఇంగ్లీషు, ఇతర విదేశీ భాషల
కేంద్రీయ సంస్థ, హైదరాబాదు-7

లక్ష్మణరావు, ఎన్.
రీడర్
గ్రంథాలయ సమాచార
శాస్త్ర విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

విశ్వమోహన్, వి.
లెక్చరర్
గ్రంథాలయ సమాచార
శాస్త్ర విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

వెంకటప్పయ్య, వెలగా
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా.

వేణుగోపాల్, యం.వి.
రీడర్
గ్రంథాలయ సమాచార
శాస్త్ర విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

వ్యాసమూర్తి, పి.
గ్రంథాలయాధికారి
ఐ.డి.యల్. కెమికల్స్
హైదరాబాదు.

శంకరరెడ్డి, యం.
గ్రంథాలయాధికారి
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

శాస్త్రి, యం.వి.
ఆఫీసర్-ఇన్-చార్జ్
విజ్ఞాన సర్వస్వ కేంద్రం
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

సత్యనారాయణ, వి.వి.వి.
సీనియర్ ఇన్‌ఫర్మేషన్ ఆఫీసర్
భారత భారీ విద్యుత్పరికరాలసంస్థ
(పరిశోధన మరియు అభివృద్ధి)
వికాస్‌నగర్, హైదరాబాదు.

సుదర్శనరావు, ఎస్.
లెక్చరర్
గ్రంథాలయ సమాచార
శాస్త్ర విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-500 007

సూర్యదుర్గ, యం.
గ్రంథాలయాధికారి
ఆంధ్ర మహిళాసభ కళాశాల
హైదరాబాదు-500 007

సోమరాజు, పి.
రీడర్
గ్రంథాలయ సమాచార
శాస్త్ర విభాగం,
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్టణం-3

హష్మి, సయ్యద్ ఆలీ
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
కరీంనగర్.

# పరిచయం

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం "గ్రంథాలయ వనరులు-సమష్టి సమీకరణ" అనే విషయం మీద మూడు రోజుల సదస్సును 1987 డిశంబరు 13-15 తేదీలలో నిర్వహించింది. ఈ సదస్సులో 1. పుస్తక సమీకరణ సాధక బాధకాలు, నిర్ణయప్రమాణాలు, 2. సహకార విధానం, వనరుల వినిమయం, 3. వాఙ్మయ నియంత్రణ, వర్గీకరణ, సూచీకరణాది సమస్యలు, జాతీయ వాఙ్మయ సూచి, వాణిజ్యపట్టికలు, తక్కిన ఎంపిక సాధనాలు, సంకలన నిల్వ నిర్వహణలు, 4. యంత్రీకరణ, వివిధ వాఙ్మయ ప్రక్రియలకు గణక యంత్ర అనువర్తనలు, సమస్యలు, 5. ఉపయోక్తల అవసరాలు, గ్రంథాలయ సమాచారాది సేవలు మొదలైన కీలక విషయాల మీద నిశితమైన చర్చలు జరిగాయి. సదస్సుకు అందిన 26 వ్యాసాలు ప్రస్తుత పుస్తక రూపంలో ముద్రించటం జరిగింది. ఈ వ్యాసాలన్ని ఎంతో ప్రామాణికమైన రచనలని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. వ్యాసకర్తలందరు కూడా వృత్తి పాలనలో కావలసినంత అనుభవాల్ని, కౌశలాన్ని గడించిన వారే.

దిగితేగాని లోతు తెలియదన్నట్లు గ్రంథాలయ నిర్వహణలో అనుభవం ఉంటేనేగాని అందలి సాధ్యాసాధ్యాలు ఎరుకపడవు. గ్రంథాలయాలు తమ అవసరాలను తీర్చటమే ముఖ్యమని ఉపయోక్తలు భావించటం సహజమే. గ్రంథాలయాల విధినిర్వహణలో తాము కూడా భాగస్వాములమని, అవసరమైన ప్రేరణను కల్పించటం కూడ తమ బాధ్యత అని వారు గుర్తించినప్పుడు గ్రంథాలయ సేవలు మరింత తృప్తికరంగా పరిణమించగలవు. గ్రంథాలయాల ఉపయోగం అధ్యయనాసక్తుల గురించి చేసిన ఇటీవలి సర్వేక్షణలో అత్యుత్తమ స్థాయి విశ్వవిద్యాలయాల్లో

కూడా అధ్యాపకులు చాలా తక్కువగా పఠిస్తున్నారనే విషయం వెల్లడయింది. ఇది విచారించదగ్గ విషయం.

నాణ్యమైన గ్రంథాలయ సమీకరణలు ఉపయోక్తల అవసరాల వ్యక్తీకరణ వల్లనే సాధ్యం. అలాగే విస్తృతసేవలు, సహకారం, సాంకేతిక అనువర్తనం మొదలైనవి కూడా చదువరుల ఆదరాభిమానాల మూలంగానే మెరుగుపడతాయి. పాశ్చాత్య దేశాల్లో గ్రంథాలయాలు అత్యుత్తమంగా సేవలందించటానికి గ్రంథపాలకుల కంటే కూడా చదువరుల ప్రేరణలే కారణం. అయితే గ్రంథపాలన, సేవావిస్తరణలు, తదితర సమస్యాపరిష్కారాలు గ్రంథాలయ వృత్తిపాలకుల బాధ్యతే. అందువల్ల సేవలందించే వారు, సేవలందుకునేవారు ఇరువురూ బాధ్యులే.

ఈ సదస్సులో గ్రంథాలయ పరమైన వివిధ అంశాలను గురించి సూక్ష్మదృష్టితో పరిశీలించటం ముదావహం. ప్రశంసనీయం.

ఈ ప్రచురణ గ్రంథపాలకులకు, గ్రంథాలయశాస్త్ర విద్యార్థులకే కాకుండా, గ్రంథాలయ ఉపయోక్తలకు కూడా ఎంతో ఉపయుక్తంగా ఉండగలదని నా నమ్మకం. ఆంగ్లంలో అత్యుత్తమ స్థాయికి ఎదిగిన ఈ శాస్త్ర విషయాన్ని అతివిపులంగా, ఎంతో నేర్పుగా తెలుగులో వ్యక్తీకరించటం మరింత గొప్పవిషయం. తెలుగుభాషాభిమానులకు ఇది చక్కటి కానుక. తెలుగు ప్రజల ఆదరాభిమానాలను అందుకోగలదని ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

ఆచార్య తూమాటి దోణప్ప
కులపతి
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు
25-11-1988

# కృతజ్ఞతలు

జాతి సంక్షేమానికి, తెలుగు సంస్కృతి సర్వతోముఖాభివృద్ధి లక్ష్యసాధనకు కంకణం కట్టుకున్న అచంచల కార్య దీక్షాపరులు, తెలుగు వెలుగు, విశ్వవిద్యాలయ కులాధిపతి, రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ డా॥ నందమూరి తారకరామారావుగారు ఈ ప్రచురణ విషయంలో ఆసక్తి కనబరచి ముద్రణకోసం ప్రత్యేక ఆదేశాన్నివ్వటం ప్రశంసనీయం. వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతా సుమాంజలులు.

దక్షులు, అసమాన సాహితీమూర్తులు ఆచార్య తూమాటి దొణప్ప గారి సత్సంకల్పం, ప్రోత్సాహం, కార్యదీక్షలు ప్రేరణలుగా తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం 1987, డిసెంబరు 13 - 15 తేదీలలో నిర్వహించిన సదస్సు ఫలితమే ఈ సంపుటం. సదస్సుకు సంబంధించిన చర్చాంశాలు మొదలుకొని సమావేశాల ఏర్పాటు, నిర్వహణ ప్రచురణా ద్యంతం వారు కావించిన సూచనలు, అందించిన సదుపాయాలు, గ్రంథా లయాలపట్ల వారికున్న అవగాహన, ఆసక్తులకు చక్కని నిదర్శనం. వారి సహృద్భావానికి, సాదరాభిమానాలకు ధన్యవాదాలు.

తెలుగు విశ్వవిద్యాలయ పురోభివృద్ధి పట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తున్న విద్యాశాఖామాత్యులు మాన్యశ్రీ పి. ఇంద్రారెడ్డిగారికి, మా అభ్యర్థనలను మన్నించి సభలకు వచ్చి తమ అమూల్య ప్రసంగాలతో మమ్మలరింపజేసిన సాంస్కృతిక శాఖామాత్యులు మాన్యశ్రీ జె.ఆర్. పుష్పరాజ్ గారికి, రెవెన్యూ శాఖ కార్యదర్శి, సాహితీవేత్త డా॥ జె. బాపు రెడ్డిగారికి, పౌర గ్రంథాలయ సంచాలకులు శ్రీ ఆర్. కృష్ణమూర్తి గారికి మా ప్రత్యేక కృతజ్ఞతాపూర్వక అభివందనలు.

తొలినుండి మా కృషిపట్ల శ్రద్ధవహించి, మమ్మాదరించి ఈ కార్యభారాన్ని సొంతం తనమీద వేసుకొని ప్రచ్ఛన్నంగా ఉంటూ మాకు విజయం సాధించి పెట్టిన సూత్రధారి, తెలుగు విశ్వవిద్యాలయ కులపతి వులు శ్రీ టి.డి. ప్రసాదరావుగారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఎన్నో సాయంవేళలు తమకాలాన్ని వెచ్చించి, తర్జన భర్జనలు చేసి సదస్సుకు జీవం పోయటంతో బాటు రూపురేఖలు దిద్ది సత్తువ చేకూర్చిన కార్యాచరణసంఘ సభ్యులు సర్వశ్రీ వి.వి.యల్. నరసింహా రావు, యం.వి. వేణుగోపాల్, యల్.యస్. రామయ్య, కె. శ్రీరామ మూర్తి, వెలగా వెంకటప్పయ్య గారలకు మా ప్రత్యేక ధన్యవాదాలు. ఈ కార్యసాధనలో వారు కూడా భాగస్వాములే. అందరికీ మా కృతజ్ఞతలు.

తక్కువ వ్యవధిలో అత్యుత్తమ వ్యాసాలను అందజేసి, సదస్సు చర్చలకు జవసత్వాలను చేకూర్చి, సభలను తమ ఆలోచనా కాంతికిరణా లతో నింపిన వ్యాసకర్తలందరికీ వైయక్తికంగా మా అభినందనలు, అభివందనలు.

మా ఆహ్వానాన్ని మన్నించి, సమావేశాలకు హాజరై తమ అనుభవా లను, అమూల్య అభిప్రాయాలను వెలిబుచ్చి సదస్సును గుబాళింప జేసిన ఆహూతులందరికీ వైయక్తికంగా మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

ఈ సదస్సు సందర్భంలో ఉడతాభక్తిగా మేము కావించిన సన్మా నాన్ని స్వీకరించి, మమ్మాశీర్వదించిన గ్రంథాలయోద్యమకర్తలు సర్వశ్రీ దేవులపల్లి రామానుజరావు, వావిలాల గోపాలకృష్ణయ్య, నాగినేనివెంకయ్య, కోదాటి నారాయణరావు, ఆమళ్ళదిన్నె గోపీనాథ్ వారికి మేమెంతో కృతజ్ఞులం.

సదస్సు కార్యనిర్వహణలో ఉత్తర ప్రత్యుత్తరాలు, వెనుచర్యలు, వ్యాసాలకు ప్రతులు తీయటం, సమావేశాల ఏర్పాట్లు తదితర బాధ్యతలను తమవిగా భావించి, సహకరించిన గ్రంథాలయ సిబ్బంది యావన్మందికి ధన్యవాదాలు.

ఈ వ్యాసావళిని నిర్దుష్టంగా ముద్రించి, అందంగా ఘటించి ఏమాత్రం జాప్యం లేకుండా సకాలంలో అందజేసి సహకరించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు వారికి మా ప్రశంసలు.

**యం. శంకరరెడ్డి**
గ్రంథాలయాధికారి
తెలుగు విశ్వవిద్యాలయం

# అంతరాంశాలు

## 2. వాఙ్మయ-భౌతిక నియంత్రణలు



## 3. సహకారం



## 4. సేవలు

డా॥ వెలగా వెంకటప్పయ్య

# మౌలిక వ్యాసం

జాతీయోద్యమ కాలంలో—అంటే—ప్రభుత్వం అండదండలు, ఇతర సాధనా సంపత్తులు లేనప్పుడు తెలుగు జాతిని ప్రభావితంచేసి, తెలుగువారి ఆత్మగౌరవాన్ని పరిరక్షించిన నాటి గ్రంథాలయోద్యమం నేడు ప్రభుత్వ ఆదరణ, శాసనబలం అన్నీ ఉండి కూడా సరియైన ఆశయ విధానం లేకుండ జాతీయాభివృద్ధి కార్యక్రమాల్లో అత్యంతావశ్యకాంశంగా గుర్తింపు పొందలేక—గ్రంథాలయాల్లో సమీకరణావసరం నిర్లక్ష్యించబడి సేవలలో సమన్వయం కొరవడి దేశ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ప్రగతిపై ఏ విధమైన ప్రభావం చూపలేక నిర్జీవమైంది. ఈ వివిధ విషయాలను పునరాలోచించడం, గ్రంథాలయోద్యమానికి జీవంపోయడం, ఆ విధంగా గ్రంథాలయ నిర్వహణా విధానాన్ని మెరుగుపరచి సమర్థ వంతమైన సేవా విధానాన్ని రూపొందించే కార్య సంవిధానాన్ని ఆలోచించడం, ఆ విధిలో పునరంకితం కావడం ఈ సదస్సుకు ప్రధాన లక్ష్యం కావాలి.

గత శతాబ్దంలో విశాలాంధ్రావనిలో ప్రారంభమైన గ్రంథాలయోద్యమం ఈ గడ్డపై వెలసిన అనేక ఉద్యమాలకు బాసటగా నిలిచింది. ఈ దేశంలో వెలసిన ఎన్నో ఉద్యమాలు మొలక ప్రాయంలోనే కాల గర్భంలో కలసిపోగా, ఈ ఉద్యమం నేటికి నిరాఘాటంగా కొనసాగి నూరు వసంతాలు నింపుకుంది. ఇందుకు కారణం మన గ్రంథా-

యోద్యమం ప్రజల ఉద్యమం. రాజాదరంచేత బరోడాలో నెలకొన్న గ్రంథాలయోద్యమం ఆదరణ సన్నగిల్లగానే నీరసపడిపోయింది. మన రాష్ట్రంలో ప్రజా ఉద్యమంగా ప్రారంభమై ప్రజా జీవనాడిని స్పందింప జేస్తున్న ఈ ఉద్యమం అజరామరంగా ఈ భూమిపై ఉంటుంది. ఆంగ్ల భాషా గంధం, ఆంగ్ల సంప్రదాయాల సంపర్కం ఏమాత్రం లేని వ్యగ్రోత్సాహులైన కొందరు యువకులవల్లనే ఈ ఉద్యమం వికసించింది. గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు ఈ ఉద్యమాన్ని స్వయంభువమన్నారు. ఇతర దేశాల్లో గ్రంథాలయోద్యమ లక్ష్యం మానవుని మేధాశక్తిని పెంపొందించడం మాత్రమే. తెలుగునాట వెలసిన గ్రంథాలయోద్యమం వ్యక్తిలో సంపూర్ణమానవత్వాన్ని కాంక్షించింది. అందుకే ఈ ఉద్యమం తెలుగుజాతి జీవన సరళికి సరిపడింది. గ్రామీణ వ్యవస్థలో కీలక పాత్ర వహించింది. గాలి, నీరు, వెలుతురు ఎంతగా ఎల్లవారికీ ఎలా సేవ్యమై ఉన్నవో గ్రంథాలయ సేవ కూడా అంతగా సేవ్యమై ఉండాలని కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు తొలి ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలో ప్రబోధించారు. ఈ ప్రబోధానికి యువతరం ఉత్తేజితమై గ్రంథాలయోద్యమాన్ని వాడవాడలా వ్యాపింపజేసింది.

తెలంగాణా ప్రాంతంలో తెలుగుభాషను, తెలుగు జాతి గౌరవాన్ని నిలబెట్టుకోవడానికి ఈ ఉద్యమం తోడ్పడింది. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు ఆంధ్ర మహాజన సభద్వారా తెలుగువారి సంస్కృతిని పరిరక్షించడానికి నడుం కట్టారు. ఆంధ్రభాషా నిలయాలపేర అనేక గ్రంథాలయాలను స్థాపించి, నడిపించారు. నిజాం రాష్ట్రంలో ఉర్దూను మాతృభాషగా చేసుకోవాలని 'రహబరే దక్కన్'

పత్రిక చేసిన విష ప్రచారాన్ని, గ్రంథాలయాలు స్థాపించరాదనీ, సభలు పెట్టరాదనీ 'గస్తీ నిషాన్-53' ఉత్తర్వును ఈ ఉద్యమం వ్యతిరేకించింది. ప్రభుత్వ దస్త్రంలో ఉన్న తెలుగుభాషను పైకి గుంజవలసిన పనిలేదని నిజాం తాబేదారుల వాదనలను సమూలంగా ఖండించి తెలుగుజాతి ఆత్మ గౌరవాన్ని కాపాడింది, ఇనుమడింపజేసింది. వాస్తవానికి గ్రంథాలయోద్యమం తెలుగు జాతి చరిత్ర చెప్పే నూరేళ్ళ ఉద్యమం.

## గ్రంథాలయ శాసనప్రగతి

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లో పౌర గ్రంథాలయ శాసనాలు అమలులోకి వచ్చాక రాష్ట్రవ్యాప్తంగా జిల్లా గ్రంథాలయ సంస్థలు వెలిశాయి. సంస్థలవరంగా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు, గ్రామ గ్రంథాలయాలు వనరులున్నచోట వెలిశాయి. తెలుగువారందరినీ ఒక పాలన కింద చేర్చిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడటంతో అంతకుముందు అమలులో ఉండిన రెండు గ్రంథాలయ చట్టాలను విలీనంచేసి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టంగా 1960 లో రూపొందించడం జరిగింది. చట్టం వల్ల ఏర్పడిన పౌరగ్రంథాలయాల్లో సమన్వయంలేదు. ఇవి కేవలం ప్రాథమిక సేవలను మాత్రం అందిస్తున్నాయి. సేవాస్థాయిని పెంచే విషయంలో, వ్యవస్థ పునర్నిర్మాణ విషయంలో, సమన్వయ సాధన విషయంలో ప్రభుత్వం నియమించిన ఎక్బోటే కమిటి అనేక సిఫారసులను చేసింది. వీటిని అమలు పరచవలసి ఉంది.

విశ్వవిద్యాలయాల్లోను, కళాశాలల్లోను, తదితర విద్యాలయాల్లోను గ్రంథాలయాల పరిస్థితి దాదాపు ఇలాగే ఉంది. ఒకే విద్యాసంస్థతో

రెండు, మూడు, నాలుగు గ్రంథాలయాలు, అలాగే ఒకే గ్రంథాలయ భవనంలో రెండు మూడు గ్రంథాలయాలు, చక్కని ప్రణాళికా విధానం లేనందున ఈ పరిస్థితి ఏర్పడింది. గ్రంథాలయ వనరులను, సిబ్బందిని సమీకరించి, సేవలను సమన్వయపరచి, గ్రంథాలయ రంగంలో క్రొత్త వెలుగులు తీసుకురావాలి. గ్రంథాలయ సేవను దేశ ఆర్థిక, సామాజిక పురోగతికి దోహదపడేలా తీర్చిదిద్దాలి. కంకరెంట్ లిస్ట్‌లో గ్రంథాలయాలు రాష్ట్రానికి సంబంధించిన విషయమే గనుక రాష్ట్ర ప్రభుత్వం గ్రంథాలయ విధానాన్ని రూపొందించే బాధ్యతను పునఃపరిశీలన చేయవలసి ఉంది. కేంద్ర ప్రభుత్వం అమలు చేస్తున్న "గ్రంథాలయ సమాచార విధానాన్ని" ఇందు నిమిత్తం గమనికలోనికి తీసుకోవడం సముచితం.

## ఆధునిక ధోరణుల అనుసరణ

అరుదైన తెలుగు రాత ప్రతులు, ముద్రిత గ్రంథాలు, పత్రికలు, పత్రాలు మన రాష్ట్రంలోను, ఇతర రాష్ట్రాల్లోను, ఇతర దేశాల్లోనూ కూడా అనేక గ్రంథాలయాల్లో సంస్కారహీనంగా పడిఉన్నాయి. వీటిని లేదా వీటి ప్రతులను సేకరించి, సమీకరించి సంఘటించ వలసిన అవసరం ఉంది. అందుకోసం విశ్వవ్యాప్తంగా తెలుగు సంస్కృతి, చరిత్ర, భాషా సాహిత్యాలపై లభ్యమైన ముద్రితా ముద్రిత పఠన సామగ్రిని సర్వే చేయించి వివరణాత్మక సూచీలను ప్రచురించవలసిఉంది. మూలాలను సేకరించడం సాధ్యపడక పోవచ్చు. కాని జిరాక్స్ ప్రతులు, మైక్రోఫిల్ములు సాధ్యమే. సాధ్యమయ్యే పక్షంలో ఆధునిక ముద్రణ, సంసర్గ, సాంకేతికాలను అనువర్తించి క్రొత్తపుంతలు కూడా త్రొక్కవచ్చు. అటువంటప్పుడు పరిశోధకులు తమశక్తిని, ఓపికను విషయాన్వేషణలో వెచ్చించే బదులు,

ఏమాత్రం కాలయాపనం లేకుండా, వ్యయ ప్రయాసలు లేకుండా సమాచారాన్ని అందుకొని వారి ఆలోచనలను మేధాశక్తిని పరిశోధనవైపు, నూతన ఆవిష్కారాలవైపు మళ్ళించే అవకాశం ఏర్పడగలదు.

అయితే ఇందుకు సరియైన ఆలోచన, కార్యాచరణ రెండూ అవసరం. మన గ్రంథాలయాల్లో మన భాషా వాఙ్మయానికి ప్రాముఖ్యం ఇచ్చినపుడే మన సాంస్కృతిక పురోగతికి అస్కారం ఏర్పడగలదు. సమష్టి సమీకరణ గ్రంథాలయాల్లో నేడు ఎంతైనా అవసరం. ఈ సమీకరణలో పూర్వ ప్రచురణలు, వాటితో బాటు ప్రస్తుత ప్రచురణలు రెండూ ముఖ్యాంశాలే. అలాగే భావి అవసరాలు, ప్రచురణలు కూడా గమనార్హం. ఈ సమీకరణ విషయమైన సమస్యలు కూడా సమాలోచితం కావాలి అలాగే ఆర్థికాంశం, వ్యవస్థీకరణ, నియంత్రీకరణ, వాఙ్మయ పరికరాలు, సాధనాలు తదితర విషయాలు కూడా సమాలోచనం కావాలి.

—(౦)—

యం. వి. వేణుగోపాల్

యం. శంకర రెడ్డి

# ప్రస్తావన

"గ్రంథాలయ వనరులు-సమష్టి సమీకరణ" అనేది అంత తేలిక విషయం కాదు. కార్యరూపంలో ఈ విషయమై ఎన్నో సమస్యలున్నాయి. ఈ సమస్యా పరిష్కారానికి అంతం కూడా కనిపించదు. సాంఘిక సమస్యలు ఎంత క్లిష్టమైనవో గ్రంథాలయ నిర్వహణ కూడా అంత క్లిష్టమైనదే.

పుస్తకాలు ఎంత ప్రశస్తమో, ఎంత అనివార్యమో గ్రంథాలయాలు కూడా అంత ప్రశస్తం. అంత అనివార్యం. నేటి సమాచారయుగంలో గ్రంథాలయ ప్రసక్తికాని, అవసరం కాని ఉండని కార్యకలాపం అంటూ ఏదీ లేదనే చెప్పాలి. ప్రతి కార్య రంగంలో కూడా గ్రంథాలయాలు అత్యవసర ఉపాంగాలుగా, పరిశిష్టాలుగా చోటుచేసుకొంటున్నాయి.

గ్రంథాలయాలు లేకుండ విద్యార్జన, బోధన, పరిశోధన మొదలైనవి ఊహించలేము. శాస్త్ర సాంకేతిక ప్రయోగశాలల్లో కూడా ఫలితాలుండవు. అలాగే పరిపాలనలో, ప్రణాళికా రచనలో, వాణిజ్య వ్యాపారాల్లో—తదితర అన్ని కార్యకలాపాల్లో కూడా గ్రంథాలయ సమాచార ప్రమేయం ఎంతో ఉంది. సాంఘిక పరివర్తన, సామాజిక పరివృద్ధి, ఆర్థిక, సాంకేతిక పురోభివృద్ధి లక్ష్యాల సాధనకు మానవాళి గడించిన, ఇంకా గడిస్తున్న పరిజ్ఞానం తోడు కావాలి. అంటే గ్రంథాల యాలను తోడుచేసుకున్నప్పుడే ఈ ఉద్దేశ్యాలు, కార్యక్రమాలు ఫలిస్తాయి.

అయితే గ్రంథాలయ నిర్వహణ కేవలం ఆయా గ్రంథాలయాలకు (స్థానికంగా) వర్తించే సమస్య మాత్రమే కాదు. పుస్తకాలు, వాటిలో నిక్షిప్తమైన విజ్ఞానం అందరికి సొంతం. పరిజ్ఞానం అపారం. పుస్తకాలు అసంఖ్యాకం. వాటి ఉపయోగం కూడా విస్తారం. ప్రతి గ్రంథాలయం యావత్పుస్తక ప్రపంచాన్ని పోగుచేసి సేవలందించటం అనేది అసాధ్యం, అనూహ్యం. అయితే ఉపయోక్తల అవసరాలు తరచూ స్థానిక గ్రంథాలయాల శక్తి సామర్థ్యాలను, పరిధులను అధిగమిస్తాయి. ఈ కారణంచేతనే మనం సమష్టి వనరుల సమీకరణ అవసరాన్ని గుర్తించటం జరిగింది.

పుస్తక సంకలనం అంతసులభమైన పనికాదు. ఎంతో వ్యయ ప్రయాసలతో కూడిన కార్యక్రమం. వైయక్తిక గ్రంథాలయాల్లో సేవావసరాలకు అనుగుణంగా ఉపయోక్తలను సంతృప్తిపరిచే విధంగా సంకలనాభివృద్ధిని సాధించటం శ్రమతోకూడిన పని. దీనికి నిశిత దృష్టి, దక్షత, అనుభవం, క్రియాశీలత ఉండాలి. సంకలనాభివృద్ధి ఉపయోక్తల అవసరాలను ఒక అభిలషణీయమైన మేరకు ఆదుకునే విధంగా జరగాలి. ఈ అవసరం ప్రతి గ్రంథాలయంలోను కనిపిస్తుంది. అయితే ఈ అభిలషణీయత సంకలన పరిమాణంలోను, సంయోగంలోను (వివిధ విషయాలు, వివిధ మాధ్యాలు) నాణ్యతలోను ఏ విధంగా ప్రస్ఫుటం కావాలి? అనేది ఒక క్లిష్టసమస్య. దీనిని సాధించటానికి ఏ కనీస ప్రమాణంలో ఆర్థిక వనరులు నిర్ణయం కావాలి? అనేది మరొక సమస్య. గ్రంథాలయాలు అన్నీ ఒకే దశలో ఉండవు. అందుచేత శైశవ దశలో ఉన్న గ్రంథాలయాలకు, ఒక పాటిస్థాయికి ఎదిగిన వాటికి, పరిపుష్ట స్థాయికి చేరుకున్నవాటికి ఈ ప్రమాణాల్లో ఏ విధమైన వ్యత్యాసాలను ఎన్నుకోవచ్చును? అనేది ఇంకొక ప్రశ్న.

సంకలనాభివృద్ధి సంబంధమైన ఆర్థిక, సంకలన పరిమాణాది ప్రమాణాలు గ్రంథాలయ అభివృద్ధి దశలను బట్టి వివిధ ప్రాంతాల్లో వివిధ గ్రంథాలయాలకు వేర్వేరు విధాలుగా ఉన్నాయి. అయితే వీటికి తార్కికాధారం తక్కువ. ఎక్కువ మేరకు ఇవి సూచనలు గాను, సిఫారసులుగాను మాత్రమే ఉన్నాయి. అనువర్తనలో పరిపూర్ణమైన ఫలితాలు ఏర్పడగలవన్న నమ్మకం లేదు. అనుభవంలో కూడ ఈ విషయం రుజువైనట్లు లేదు. చాలామట్టుకు కాలం చెల్లినవిగా కూడా కనిపిస్తున్నాయి. ఈ కనీస ఆర్థిక పరిమాణ ప్రమాణాలను అనువర్తించి నంత మాత్రాన సంకలనం అన్ని సందర్భాల్లోను మెరుగ్గా ఉంటుందన డానికి కూడ ఆస్కారం తక్కువ. "ప్రతి చదువరికీ పుస్తకం" అనే సూత్రాన్ని పాటించటంలో సరియైన ఎంపిక విధానం కూడా ప్రధానం. సరియైన పుస్తకాన్ని, సరియైన చదువరికి, సకాలంలో అందించాలి. అంటే, ఉపయోక్తల అవసరం, అభిరుచి ప్రతిఫలించే విధంగా నాణ్యమైన పుస్తకాలను ఎంపిక చేయాలి. పుస్తక నాణ్యత కేవలం విషయాధారం మాత్రమే కాదు. చక్కని భౌతిక స్వరూపం, సౌష్టవం కూడా ఉండాలి. వీలయితే తక్కువ వ్యయంలోనే లభ్యమయ్యేదై ఉండాలి. అయితే ఏదో కొన్ని కనీస ప్రమాణాలు లేకుండ వివిధ కార్యాలను సాధించటంకూడ కష్టమే. ముఖ్యంగా కార్యనిర్వహణలో ఒడుదుడుకులేమున్నాయి? ఎలాంటి లోపాలున్నాయి? మొదలైన విషయపరిశీలనకు, అంచనాలకు ఈ ప్రమాణాలే ఆధారం.

ఇన్ని ఇబ్బందులు పడి సాధించిన పుస్తక సంకలనం అన్ని సందర్భాల్లోను అత్యుత్తమ ఫలితాలను ఇస్తుందా? అనే ప్రశ్నకు సమాధానం పూర్తిగా అవునని చెప్పలేము. ఎందుకంటె అన్ని పుస్తకాలూ ఉపయోగకరంగా పరిణమించవు. ఉపయోక్తల అవసరాలను తీర్చేవిగా ఏర్పడవు. అవసరమైనవి, తరచూ గిరాకి ఉండేవి అన్ని గ్రంథాలయాల్లో చోటుచేసుకోవు. కొంత అసంతృప్తికి తావు ఉండక తప్పదు.

సమష్టి విధానంలో ఈ సమస్యలకు పరిష్కారాన్ని సాధించవచ్చును. అంటే, వివిధ గ్రంథాలయాల్లో ఉండే వనరులకు గరిష్ఠ స్థాయిలో ఉపయోగాన్ని సాధించవచ్చును. స్థానిక గ్రంథాలయాల్లో అవసరాల అగ్ర ప్రాధాన్యతలకు అనువుగా పుస్తక సంకలనాలను చేయటంవల్ల అనవసరం, నిరుపయోగం, కాదగ్గ సంకలనాలకు తావుండదు. వ్యయం పొదుపు అవుతుంది. తరచు అవసరమయ్యేవి, ఎక్కువ గిరాకి ఉండే పుస్తకాలను మాత్రమే సేకరించవచ్చును. సంకలన నాణ్యత కూడా పెరుగుతుంది. ఒక గ్రంథాలయంలో అత్యల్ప ప్రాధాన్యత గల విషయం మరొక గ్రంథాలయంలో అత్యంత ప్రాధాన్యతగల విషయంగా ఉండటంచేత పరస్పరం అందించుకోవటం, సహకరించుకోవటం సాధ్యం.

ఇదివరకు వివరించినట్లు వివిధ లభ్యప్రమాణాలను వైయక్తిక గ్రంథాలయాల్లో అనువర్తించటం ఒక ఎత్తయితే, సమష్టి విధానాల్లో అనువర్తించటం మరొక ఎత్తు. వివరంగా చెప్పాలంటే ఈ ప్రమాణాలు అన్ని వైయక్తిక గ్రంథాలయాలకు అనుసరణీయాలుగా ఉన్నాయనటం వివాదస్పదమైనట్లే సమష్టి విధానంలో ఏపాటి ప్రమాణాలు సూచింపబడ్డాయి? అమలులో ఉన్నాయి? అనేది కూడా వివాదాస్పదమే. చాలవరకు స్థానిక నిర్ణయాల మీద, గ్రంథపాలకుల అనుభవం మీద ఆధారపడిన ఈ ప్రమాణాలకు ప్రత్యామ్నాయ రూపకల్పన, నిర్దేశాలు చేయటం సమంజసమేమో !

వాఙ్మయ నియంత్రణాలోపముండి, ఎంపిక సాధనాలు (సూచీలు, సమీక్షలు, ప్రకటనలు మొదలైనవి) కొరవడినప్పుడు ఈ కార్యక్రమం అంత ప్రశంసనీయంగా, సులువుగా నిర్వర్తించటం సాధ్యం కానిపని. పుస్తక పంపిణీ నిర్బంధాలు, రవాణా అసౌకర్యాలు, విఫణి సమస్యలు మొదలైన అంశాలు కూడా సంకలనాభివృద్ధికి అవరోధాలు. స్థానికావసరాలకు ప్రాముఖ్యం మెండుగా ఉండే గ్రంథాలయాలకు, ముఖ్యంగా మన

వంటి దేశాల్లో ప్రాంతీయభాషల్లో పుస్తకాలను సమీకరించే గ్రంథాలయాలకు ఇది మరింత ప్రయాసతో కూడిన పని

సేకరించిన పుస్తకాలకు గ్రంథాలయాల్లో వాఙ్మయ భౌతిక నియంత్రణలు చేకూర్చటంకూడ ముఖ్య విషయమే. వాఙ్మయ నియంత్రణ కోసం వర్గీకరణ, సూచీకరణ, అనుక్రమణికరణ, మొదలైన ప్రక్రియలను నిర్వర్తించాలంటే—ముఖ్యంగా, జాతీయ భాషలకు అనువైన పథకాలు, కల్పాలు, విషయశీర్షిక పట్టికలు తప్పనిసరి. వీటిలోపం కూడా ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న సమస్యల్లో ప్రధానాంశంగా పేర్కొనాలి. అంతర్జాతీయ ప్రమాణాల పరిధిలో జాతీయ స్థాయిలోనే కాకుండా భాషావర్గ—స్థానిక అవసరాలకు సరియైన వర్గీకరణ పథకాలు, సూచీకరణ నియమావళులు, విషయశీర్షిక పట్టికలు, పదకోశాలు తదితర పరికరాలు' వ్యక్తినామ పరిష్కారాలు రూపొందించటం జరగాలి.

దేశీయ, విదేశీయ సాహిత్యాలను (ప్రచురణలను) సమీకరించి దేశవ్యాప్తంగా ఉపయోక్తల అందుబాటుకు తీసుకురావటానికి ఒక జాతీయ గ్రంథాలయ విధానం ఏర్పడాలి. గత ఒకటి రెండు దశాబ్దాలుగా చేస్తూ వచ్చిన ఈ సూచన ఇటీవలి కాలంలో ప్రభుత్వం గుర్తింపు పొందటం హర్షణీయం. ఈ ప్రకారం ప్రతి పాఠశాలలోను, ప్రతి కళాశాలలోను గ్రంథాలయం ఏర్పాటు కావాలి. విద్యాసంబంధమైన అన్ని గ్రంథాలయాలు కూడా సంఘటితం కావాలి. గ్రంథాలయ ఉద్యమం బలపడటానికి ప్రతి రాష్ట్రంలోనూ, ప్రతి కేంద్రపాలిత ప్రాంతంలోను పౌర గ్రంథాలయ చట్టాలు అమల్లోకి రావాలి. ఈ విధంగా ఏర్పాటైన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాలు కూడా సమిష్టిగా సంఘటితం కావాలి. కేంద్ర - రాష్ట్ర విద్య ఆదాయవ్యయాల్లో కనీసం 6నుండి 10 శాతం ఈ గ్రంథాలయాలకు కేటాయించటం జరగాలి. ఇంతేకాకుండా గ్రామీణ గ్రంథాలయాలు, బాల గ్రంథాలయాలు, అల్పసంఖ్య వర్గాలకు, గిరిజన తదితర పత్యేక వర్గాలకు

గ్రంథాలయాలు స్వచ్ఛంద ప్రాతిపదిక మీద స్థాపనం సూచించటమైంది. బాల గ్రంథాలయాల్లో NCERT ప్రచురణలు, పౌర గ్రంథాలయాల్లో సార్వత్రిక విద్యాలయాల విద్యా బోధనకు అనువుగా ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయ ప్రచురణలను లభ్యపరచాలని పేర్కొనటం జరిగింది. సౌష్ఠవమైన జాతీయ గ్రంథాలయ విధానరూప నిర్మితిలో కలకత్తా జాతీయ గ్రంథాలయం అగ్ర సంస్థగా ఏర్పాటు కావాలని కూడా చెప్పటమైంది. ఇందుకోసం 1976 నాటి జాతీయ గ్రంథాలయ శాసనానికి సవరణలు చేయాలని కూడా సూచించటమైంది. ఈ జాతీయ గ్రంథాలయ విధానాన్ని అమలుచేయటం కోసం జాతీయ గ్రంథాలయ సమాచార విధానంపై ఒక కమిషన్ నియామకం గురించి పార్లమెంటులో ఒక చట్టాన్ని రూపొందించే ప్రయత్నం కేంద్ర సాంస్కృతికశాఖ వారి పరిశీలనలో ఉండటం గమనార్హం.

జాతీయ గ్రంథాలయ విధానంలో దేశవ్యాప్తంగా గ్రంథాలయ సమాచారాది సేవా కార్యక్రమానికి సంబంధించిన ప్రతి మౌలికాంశం కూడా పరిగణనకు రావాలి. సాధారణ గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు, పెద్ద పెద్ద పౌర గ్రంథాలయాలు, రాష్ట్ర—కేంద్ర గ్రంథాలయాలు, జాతీయ గ్రంథాలయాలు, సమాచార కేంద్రాలు, సమాచార విశ్లేషణ కేంద్రాలు, అలాగే అభిలేఖన కేంద్రాలు, రాత ప్రతుల గ్రంథాలయాలు, పురావస్తుశాలలు కూడా సంఘటితం కావాలి. ఇప్పుడిప్పుడే రూపుదిద్దుకుంటున్న మన జాతీయశాస్త్ర సాంకేతిక సమాచార విధానానికి (NISSAT), ఈ జాతీయ గ్రంథాలయ విధానానికి మధ్య సమన్వయం ఏర్పడాలి.

జాతీయ గ్రంథాలయం, పుస్తక ధరావతు సంబంధమైన చట్టాల సవరణల గురించి చేసిన సూచనలు కూడా తగిన పరిష్కారాలు పొందాల్సిన అవసరం ఉంది. అభివృద్ధి చెందిన దేశాల్లోవలె మన

దేశంలో కూడా ఒకే జాతీయ గ్రంథాలయం అని కాకుండా వివిధ క్షేత్రాలకు, వివిధ అవసరాలకు ఆసరాగా వివిధ జాతీయ గ్రంథాలయాలు ఏర్పడుతున్న ధోరణి మరింతగా వ్యాప్తి చెందాలి. ప్రస్తుతం వైద్యం, వ్యవసాయం, శాస్త్రం రంగాల్లో ఉండే జాతీయ గ్రంథాలయాలే కాకుండా ఇతర క్షేత్రాల్లో (ఉదా॥ సాంఘిక శాస్త్రాలు, చరిత్ర, సంగీతం మొదలైన కళలు, భాషా సాహిత్యాలు) కూడా మరికొన్ని జాతీయ గ్రంథాలయాలు స్థాపించి నిర్వహించాలి. వీటి నిర్వహణ కేంద్రీకృతం కానీ, వికేంద్రీకృతం కానీ కావచ్చును. ఇది ఎలా ఉన్నప్పటికీ ఈ వివిధ జాతీయ గ్రంథాలయాలకు, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు, ప్రత్యేక గ్రంథాలయాలకు సరిపడే విధంగా విదేశీయ ప్రచురణల సమష్టి సమీకరణ విధానం కూడా ఆలోచించవలసిన అవసరం ఉంది.

దేశంలో ఈ ప్రాంతం ఆ ప్రాంతం అనకుండా కలుపు కోలుగా గ్రంథాలయ సేవలు సాధించటం సహకార విధానం ముఖ్యోద్దేశ్యం. కేవలం కొన్ని మాద్యాలకు, కొన్ని ప్రాంతాలకు సాంప్రదాయ పద్ధతిలో సమీకృత (ముద్రిత) సూచీలను తయారుచేసుకొని అంతర్ గ్రంథాలయ అరువు విధానాన్ని ఇంతో అంతో పాటించటంవల్లనే సహకారం ఏర్పడదు. అవసరాలు తీరవు. గ్రంథాలయ సంకలనాల్లో అస్తవ్యస్తాలు, నిరుప యోగాలు సమసిపోవు. ఖర్చుల్లో పొదుపు లేర్పడవు. వాఙ్మయ నియంత్ర ణలో, అంటే వర్గీకరణలో, సూచీకరణ దత్తాంశ ఉత్పాదనలో, తదితర కార్యసాధనల్లో కూడా అనుగుణ్యత, ప్రామాణ్యతలు ఏర్పడవు. సిబ్బంది కాలం కూడా ఆదాకాదు. ఇవన్నీ సాధించటానికి సమష్టి విధానం - ముఖ్యంగా సాంకేతిక అనువర్తనలో వలకట్టులను (**Net Works**) రూపొందించాలి. కంప్యూటర్, టెలికమ్యూనికేషన్ సౌకర్యాలు వాడితే తప్ప దీనికి ఆస్కారం తక్కువ. అంటే, హార్డ్‌వేర్‌తో బాటు సాఫ్ట్‌వేర్ సాధనావకాశాలు తోడుకావాలి. కంప్యూటర్—టెలికమ్యూనికేషన్

పారిశ్రామికరంగాల్లో మనం ఆశించినంతగా ప్రగతిని సాధించామనే చెప్పాలి. సాఫ్ట్‌వేర్ కౌశలంలో కూడా ఏమాత్రం కొరతలేదు. పోతే, గ్రంథాలయ రంగంలో తగిన ప్రోత్సాహం, శిక్షణావకాశాలు ఏర్పరిస్తే 21 వ శతాబ్దిని సునాయాసంగా అందుకోగలం. మన లక్ష్యానికి సోపానం ఏర్పరచుకోగలం.

ఈ సాంకేతిక అనువర్తనం 21 వ శతాబ్దిని అందుకొని ప్రశంసనీయ స్థాయికి ఎదగాలంటే అంచెలవారీగా పురోగమించాలి. ముందుగా స్థానిక వలకట్టులు ప్రయోగం కావాలి. ఈ అనుభవం క్రమంగా సవిస్తర విధానాలకు మార్గం కావాలి. ఈ ధోరణిలో ఒకటి రెండు దశాబ్దాల కాలంలోనే పరిపూర్ణ జాతీయ స్థాయిని అందుకోవటం వీలవుతుంది.

సమష్టి విధానంలో గ్రంథాలయాల మధ్య వాఙ్మయ నియంత్రణతో బాటు వాఙ్మయ లబ్ధికూడా సులభ సాధ్యమవుతుంది. అయితే వాఙ్మయ వివరణ, విశ్లేషణలు ఎంతో నిశితంగా, విపులంగా చేయవలసి ఉంటుంది. ఈ సమష్టి విధానాలు రెండు రకాలు.

(1) వాఙ్మయ ఉపయుక్తాలు (**bibliographic utilities**)

(2) వాఙ్మయ సేవలు (**bibliographic services**).

ఈ రెండు విధాలను కూడా మనం రూపొందించుకోవచ్చు. గ్రంథాలయాల్లో సాంప్రదాయబద్ధమైన కార్డు సూచీలే కాకుండా ముద్రిత సూచీలు, సూక్ష్మ సూచీలను కూడ వాడి ఉపయోక్తలకు అధిక సేవలం దించవచ్చును. సమష్టి కార్యక్రమానికి పరిమితమైన స్థానిక గ్రంథాలయాల యావత్‌వనరులకే కాకుండా జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లోకూడా వివిధ దత్తాంశపీఠాలను సంప్రదించి సమాచారాన్ని పునస్సాధించవచ్చును:

ఇక సేవా విషయాలు. సామాన్యంగా ప్రతీ గ్రంథాలయం కూడా సమీకరణ, నిల్వ, నిర్వహణ, సంసర్గం అనే లక్ష్యాలను స్థూల కార్య క్రమాలుగా చేపడుతుంది.సమీకరణలో కేవలం ముద్రితవస్తువులే సమస్తం అనే ధోరణి ప్రస్తుతానికి సరిపోదు. పఠన సామగ్రి ఎన్నోరకాలు. సామాన్య ముద్రితపుస్తకాలు ఆచూకీగ్రంథాలు, పత్రికలు, సదస్సు సమావేశాది కార్యక్రమాల ప్రచురణలు, పరిశోధనా నివేదికలు, ప్రామాణికాలు, తదితర వాణిజ్యసాహిత్యాలు అని ఎన్నోరకాలు. ఇవి కాకుండా మానపటాలు, భౌగోళికాలు, ప్రతిరూపాలు, నమూనాలు, కళాకృతులు, తదితర పురావస్తువులు, రాతప్రతులు, అభిలేఖనా వస్తువులు, యంత్రపఠనీయాలు, సూక్ష్మరూపాలు, దృశ్యశ్రవ్యాలు మొదలైన పుస్తకేతర వస్తువులు, కూడా ఉన్నాయి. మాధ్యమవిషయంగానే కాకుండ విషయవ్యక్తీకరణలో కూడా భేదాలను సూచిస్తాయి. వీటి అవసరం, ఉపయోగం, పఠనా విధాలు కూడా గ్రంథాలయాల్లో ఆయా సందర్భాలకు అనుగుణంగా ఉంటాయి. ఈ విధమైన వ్యత్యాస వివరణలతోబాటు గ్రంథాలయాల్లో సేకరించే పఠనాసామగ్రి ప్రథమస్థాయి, ద్వితీయస్థాయి, తృతీయస్థాయి ప్రచురణలని కూడా పరస్పర విభేద్యాలుగా ఉన్నాయి. ద్వితీయ, తృతీయస్థాయి ప్రచురణలు ప్రథమస్థాయి ప్రచురణలకు దారితీసేవి (ఉదా॥ అనుక్రమణికలు, సార సంగ్రహాలు, సమీక్షలు, వార్షికాలు).

గ్రంథాలయాల్లో వీటిని ఎంపిక చేయటం, సమీకరించటం, భద్ర పర్చటం, సంసర్గ పర్చటం అన్నీ కూడా సమస్యలే. ఈ సమస్యా ప్రస్తావన ఇదివరకే చేయడమైంది. చెప్పవలసిన విషయమేమిటంటే—సేవార్థులకు గ్రంథాలయాలు అందించే సేవలు వీటి మీదే ఆధారపడతాయి. అరువు సేవలు, ఆచూకీ సేవలు, సంహా సంప్రదింపు సేవలు, వాఙ్మయ సేవలు, అనుక్రమణిక, సార సంగ్రహాలు, అనువాదం, సాహిత్యాన్వేషణ, పునరుత్పత్తి లేదా జెరిటెక్స్, ఫ్యాక్సిమిలీ మొదలైన పుస్తకసరఫరా

సేవలు సామాన్యంగా ప్రతి గ్రంథాలయంలోను ఎంతో కొంత మేరకు అందించటం విధిగా జరిగేవని. వీటి నాణ్యత సంకలన సమృద్ధి, ఇతర సంకలనాల అందుబాటు, వాఙ్మయ నియంత్రణ, సాంకేతిక సౌలభ్యం, సిబ్బంది కౌశలం మొదలైన విషయాలనుబట్టి ఉంటుంది. సమాజంలో గ్రంథాలయ ప్రాశస్త్యం గుర్తించబడి గ్రంథాలయాల అవసరాలు పెరిగి నప్పుడే ఈ సేవలకు విలువ, వైశిష్ట్యం అనేవి ఏర్పడతాయి. ఏ విధంగా చూచినా గ్రంథాలయం ఒక జాతీయ సంపద. అందుచేత దీని బాధ్యత ప్రభుత్వమే కాకుండా, (గ్రంథాలయాల నుండి ఏ మాత్రమైన ప్రయో జనం పొందగలిగిన) ప్రతి పౌరుడు కూడా వహించాలి.

గ్రంథాలయాల్లో దేశీయ, విదేశీయ ప్రచురణలు రెండూ అవసరమే. అందుకని విదేశీయ ప్రచురణలు అధిక ప్రతుల్లో కొని దేశ మంతటా నింపటం కేవలం విదేశీమారక ద్రవ్యం వృధా చేయటం అవుతుంది. అందుచేత ఈ విషయంలో శ్రద్ధ కావాలి. దేశ ఆర్థిక, సామాజిక, శాస్త్రసాంకేతిక రంగాల్లో ప్రగతిని సాధించటానికి ఎంతవరకు ఇవి దోహదపడతాయో అంతవరకే వీటిని ఎంపికచేయటం, సమీకరిం చటం జరగాలి. ఇది జాతీయ గ్రంథాలయ విధానంలో మౌలిక విషయం.

ఒక దేశంలో స్థిరంగా నెలకొని నిర్దిష్ట మార్గంలో పురోగమించే సాంస్కృతిక, నాగరిక జీవన వైఖరులు పుస్తక రూపాల్లో ప్రకటితమవు తాయి. అయితే, ఇందుకు తగిన ప్రోత్సాహం కూడా ఉండాలి. గ్రంథాలయ సేవాదృష్టిరీత్యా జాతీయ ప్రచురణల్లో, అంటే మన పరిజ్ఞాన పరిధిలో, లోటుపాటులెటువంటివి? ఏ మాత్రం? అనేది తెలుసు కోవటం, తెలియచెప్పటం గ్రంథపాలకుల బాధ్యత. ఈ లోటుపాట్లను సరిదిద్దటం, పరిశోధనలను పెంచటం, ప్రచురణలను ప్రోత్సహించటం, ఆ విధంగా దేశీయ పరిజ్ఞాన పరిమాణంలో (విధానంలో) అంతరాలు,

లోటుపాట్లు సరిదిద్దటం సమాజం బాధ్యత. సామాన్యంగా ప్రభుత్వాలు, వివిధ సంస్థలు ఈ విషయంలో శ్రద్ధ వహించటం మనకందరికీ తెలిసిన విషయమే. మనదేశంలో కూడా రచనలను ప్రోత్సహించటం కోసం కేంద్ర. రాష్ట్ర ప్రభుత్వాలు, పరిశ్రమలు, సాహిత్య తదితర సంస్థలు కొన్ని ప్రోత్సాహ పథకాలు, సహాయక విరాళాలు, బహుమానాలు అందిస్తున్నాయి. గ్రంథాలయాలు ప్రత్యక్షంగా ఈ విధమైన దోహద కృత్యాలను నిర్వహించలేవు. నిర్వహించవలసిన అవసరం కూడాలేదు. అయితే ప్రోత్సాహం కల్పించవచ్చును.

—(o)—

యం. శంకర రెడ్డి

# 1. 1 భాషా గ్రంథాలయాలు పుస్తక సమీకరణ సమస్యలు

గ్రంథాలయాల చరిత్ర ఎంతో పురాతనమైనది. మానవుడు చదవడం, రాయడం నేర్చినప్పటినుండి గ్రంథాలయాలు వాడుకలోకి వచ్చాయి. మానవ విజ్ఞానం, అవగాహన పెంపొందించటానికి గ్రంథాలయాలు తోడ్పడతాయి. ఆబాలగోపాలం తమ విజ్ఞాన సముపార్జనకు గ్రంథాలయాలపై ఆధారపడటం సర్వసామాన్యం. వివిధ రకాలైన గ్రంథాలయాలు ఆయా చదువరుల అవసరాలకనుగుణంగా రూపొందించబడతాయి. పౌర గ్రంథాలయాలు, విశ్వవిద్యాలయ, కళాశాల, పాఠశాల గ్రంథాలయాలు, విశేష గ్రంథాలయాలు, బాలగ్రంథాలయాలు మొదలైనవి గ్రంథాలయాల్లోని రకాలు. ఇవి వాటి పేర్లకు అనుగుణంగా చదువరులకు సేవలను అందిస్తాయి. ఏ భాషలోనైనా ఏ విషయంలోనైనా పరిశోధన జరపడానికి గ్రంథాలయాలు మాత్రమే చేయూతనిస్తాయి. సమకాలీన విషయాలపై గ్రంథాలు, పురాతన విషయాలకు సంబంధించిన గ్రంథాలు, రాబోయే అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన నివేదికలు, సిద్ధాంత వ్యాసాలు మొదలైన వివిధ ప్రచురణలు మనకు గ్రంథాలయాల్లో లభిస్తాయి. గ్రంథాలయాల సేవా లక్ష్యాలను, స్వభావాలనుబట్టి మనం ఈ ప్రచురణలను చేకూర్చుకోగలం.

సాధారణంగా పౌర గ్రంథాలయాలు అన్ని రకాల చదువరులకు ఉపయోగపడతాయి. ఏ విషయంలోనైనా ప్రాథమిక పరిజ్ఞానాన్ని

సంపాదించడానికి ఈ గ్రంథాలయాలే ఆధారం. అయితే ఉన్నత పరిశోధనకు ఇందలి వనరులు అంతగా ఉపయోగపడవు. అలాగే బాల గ్రంథాలయాలు బాలల మనోవికాసానికి మాత్రమే దోహదం చేస్తాయి. కళాశాల, పాఠశాలల్లోని గ్రంథాలయాల్లో సాధారణంగా పాఠ్యాంశాలకు సంబంధించిన పుస్తకాలు లభిస్తాయి. ఒక్క విశేష గ్రంథాలయాలు మాత్రం విషయ సంబంధమైన పరిశోధనలకు అనుకూలంగా ఉంటాయి. ఇవి కేవలం ఒక విషయానికి కాని, కొన్ని అనుబంధ విషయాలకుగాని సంబంధించిన సంస్థలకు చెంది ఉంటాయి. అందుచేత ఆ సంస్థల అవసరాలను తీర్చటానికి ఈ గ్రంథాలయాలు నిర్దేశింపబడతాయి. భాషా గ్రంథాలయాలు, సాంకేతిక, వైజ్ఞానిక శాస్త్ర గ్రంథాలయాలు, సాంఘిక ఆర్థికశాస్త్ర గ్రంథాలయాలు, పారిశ్రామిక పరిశోధనలు, వైజ్ఞానిక పరిశోధనలు జరిపడానికి అనువుగా ఉండే గ్రంథాలయాలు మొదలైన వాటిని విశేష గ్రంథాలయాలనవచ్చును. వీటిలో పుస్తక సేకరణ పద్ధతులు నియంత్రణ పద్ధతులు, చదువరులకందించే సేవలు ఒక ప్రత్యేకతను కలిగి ఉంటాయి. వీటిలోని సిబ్బంది కూడ ప్రత్యేక శిక్షణను కలిగి ఉండటం అవసరం. గ్రంథాలయాల సిబ్బంది తమ గ్రంథాలయ సంపదను గురించి క్షుణ్ణంగా అవగాహనను కలిగి ఉండాలి. ఏ విషయంపై సమాచారం ఏ గ్రంథంలో లభిస్తుంది? ఏ గ్రంథం ఏయే విషయాలపై సమాచారం అందించగలదు? అనే విషయాలను ఈ గ్రంథాలయ సిబ్బంది తమ చదువరులకు తెలియజేయగల సామర్థ్యం కలిగి ఉండాలి. ఈ విశేష గ్రంథాలయాల్లో పుస్తక సేకరణ ఎన్నో సమస్యలతోకూడుకున్న పని. సరియైన పుస్తకాలను సంగ్రహించటానికి సదా కృషిచేయవలసి ఉంటుంది. ఈ వ్యాసంలో భాషా గ్రంథాలయాల్లో పుస్తక సేకరణ, వ్యవస్థీకరణ, నియంత్రణ కార్యక్రమాలు ఎలా నిర్వహించాలి? అందుకు కావలసిన వనరులను ఎలా సమకూర్చుకోవాలి? అందులో ఉత్పన్నమయ్యే సమస్యలు ఏమిటి? అనే అంశాలను వివరించటానికి ప్రయత్నం జరిగింది.

## భాషా గ్రంథాలయాల స్వరూప స్వభావాలు

పేరుకు తగినట్లు భాషా గ్రంథాలయాలు సాహిత్యానికి, సారస్వత విషయాలకు, ఒక భాషకుగాని, కొన్ని సమకాలీన భాషలకుగాని సంబంధించిన విషయాల్లో పరిశోధన చేయటానికి, విజ్ఞానాన్ని పెంపొందించటానికి వీలుకలిగించే పుస్తకాల నిలయాలు. ఒక భాషలో సాహిత్య సారస్వత ప్రక్రియలు, పురాణ. ఇతిహాస, చారిత్రిక, కళాసంపదలు, సాంఘిక జీవనం, భాషా ప్రభావం మొదలైన విషయాలను కూలంకషంగా చర్చించిన ప్రచురణలు ఈ గ్రంథాలయాల్లో ఉంటాయి. ఇందులో ఏ విషయంలోనైనా సవివరంగా పరిశోధన జరపటానికి అవసరమయ్యే పుస్తక సామగ్రి లభిస్తుంది. భాషలో వున్న వేర్వేరు పరిభాషలు, ఉచ్చారణలు, మాండలికాలు, గ్రామ్యాలు దేశ్యాలు, ఛందస్సు, అలంకారం, వ్యాకరణం, గద్య పద్య రూపాలు, తదితర సాహిత్య సంబంధమైన ప్రచురణలను ఈ గ్రంథాలయాలు సేకరించాలి. ఈ విషయాలపై వివిధ పుస్తకరూపాలు, పరిశోధనా సామగ్రి, ఉద్గ్రంథాలు, సదస్సు నివేదికలు, ఉపన్యాసాలు, సిద్ధాంత వ్యాసాలు మొదలైన వాటిని సేకరించడం ఈ గ్రంథాలయ సిబ్బంది ముఖ్య బాధ్యత. భాషాబోధన – శిక్షణలకు సంబంధించిన గ్రంథాలు, భాషను ఆదరించిన మహానుభావుల చరిత్రలు, వారి సేవలు, రచనలు, భాషకు సంబంధించిన పుట్టుపూర్వోత్తరాలు దాని వివిధ రూపాంతరాలు, ఈ చరిత్రను తెలియజేసే గ్రంథాలు ఉండాలి. స్థూలంగా చెప్పాలంటే భాషా గ్రంథాలయాలు భాషకు సంబంధించిన అన్ని విషయాలపై గ్రంథ సమీకరణ చేయాలి.

## గ్రంథ సమీకరణ

పైన ఉదహరించిన విషయాల్లో గ్రంథ సేకరణ జరగాలంటే భాషా గ్రంథాలయాలకు ఒక నిర్దిష్ట సమీకరణ విధానం అవసరం. ఏ విషయాలపై గ్రంథసేకరణ చేయాలి? ఏ రకమైన చదువరులకు సేవలు

ఉద్దేశించబడ్డాయి? ఏ స్థాయి చదువరులు ఈ గ్రంథాలయాన్ని ఉపయోగించుకుంటారు? అనే అంశాలను ముందుగా నిర్ణయించాలి. దీనికి ఒక విధానం, దానితోబాటు అనుకూలమైన ఆర్థిక ప్రమాణాల అనువర్తనం కూడా నిర్ణయం కావాలి.

ఒక సంస్థలోని గ్రంథాలయానికి ఆ సంస్థ సాలుసరి వ్యయంలో కనీసం 10 శాతం గ్రంథాలయానికి వెచ్చించాలి. ఈ 10 శాతంలో 6 శాతం సిబ్బందికి, 4 శాతం గ్రంథ సమీకరణకు కేటాయించడం అనేది సామాన్యంగా కనిపించే ఆర్థిక ప్రమాణం. అయితే ఆర్థిక వనరులు అంతగా సమకూరని కారణముచేత ఎక్కువ గ్రంథాలయాలు ఈ ప్రమాణాన్ని అమలుచేయలేకపోతున్నాయి. అయినప్పటికీ ఒక నిర్దిష్ట పద్ధతిలో గ్రంథ సేకరణ విధానాన్ని రూపొందించడం తప్పదు. మూల సంస్థలోని వేర్వేరు విభాగాల్లో జరిగే కార్యక్రమాలను దృష్టిలో ఉంచుకొని దానికి అనుగుణంగా గ్రంథాలయవార్షిక వ్యయ మొత్తాన్ని నిర్ణయించి, అందులో గ్రంథ సేకరణకు కావలసిన వ్యయాన్ని కేటాయించాలి. ఈ కార్యక్రమం గ్రంథాలయాధికారి ఆయా విభాగాధిపతులతో సంప్రదించి నిర్ణయించవచ్చును. గ్రంథ సేకరణ విషయంలో వివిధ గ్రంథాలయాల్లో వివిధ పద్ధతులు అమలులో ఉన్నాయి. పరిశోధనలకు సంబంధించిన గ్రంథాలు, వ్యాసాలు, నివేదికలు సంగ్రహించటానికి సామాన్యంగా ప్రస్తుతం అమలులో ఉన్న పద్ధతులు అంతగా సహకరించవు. అందుచేత కొన్ని నూతన పద్ధతులను అనుసరించవలసిన అవసరం ఉంది. ప్రపంచంలో నిరవధికంగా సాగి విస్తరిస్తున్న పరిజ్ఞానాన్ని ఈ వివిధ గ్రంథాలే ముందుగా తెలియజేస్తాయి. ఈ విధమైన గ్రంథ సేకరణకు సామాన్యంగా వాణిజ్య సంస్థలకంటే కూడా ఆయా ప్రచురణ కర్తలైన సంస్థలతో సంబంధాన్ని ఏర్పరచుకోవడంద్వారా ప్రచురణ వివరాల సమాచారాన్ని, ఎప్పటికప్పుడు తెలుసుకొని కొనుగోలుచేయడం సులభం.

## గ్రంథసేకరణ పద్ధతులు

1. పుస్తక ప్రచురణ కర్తలు విక్రేతలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవడం, ఆ విధంగా వారికి గ్రంథాలయ అవసరాలను తెలియజేయడం.
2. సాహిత్య, సారస్వత, భాషా సంబంధమైన సంస్థలతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకోవటం, సభ్యత్వం పొందడం.
3. స్థాయీ ఉత్తర్వులు (**Standing Orders**)
4. పుస్తక సమీక్షలను ఆధారం చేసుకోవటం.
5. సదస్సులు, సమావేశాల ప్రకటనలను ఆధారంచేసుకొని అట్టి ప్రచురణలకు స్థాయీ ఉత్తర్వులను జారీచేయటం.
6. ఆయా విభాగ అధిపతులనుండి, తదితర చదువరులనుండి వారి వారి విషయాలకు సంబంధించిన పుస్తక సంగ్రహణానికి అవసరమయ్యే సలహాలు పొందటం, సంప్రదింపులు చేయటం.

భాషా పరిశోధక సంస్థలతో సంబంధాలు ఏర్పరచుకోవడం, ఆ సంస్థల విలాసవివరాలను సేకరించి తగిన జాబితాలను తయారుచేసుకోవడం జరగాలి. తద్వారా ఆ సంస్థల నుండి వెలువడే ప్రచురణల గురించి సమాచారాన్ని పొందవచ్చును. అవసరమైతే కొన్ని ముఖ్యమైన సంస్థలలో సభ్యత్వాన్ని పొందితే ఈ సమాచార సేకరణ ఇంకా అనుకూలమవుతుంది. పుస్తక ప్రచురణ కర్తల, పుస్తక విక్రేతల ప్రకటనలను ఆధారంచేసుకొని కావలసిన గ్రంథాలను ఎంపికచేసి సేకరించవచ్చును. ఈ కార్యం ఇంకా అనుకూలంగా జరగాలంటే గ్రంథాలయం తనకు కావలసిన విషయాలను స్పష్టంచేసి, దానికి సంబంధించిన పుస్తకాల ప్రకటన వివరాలను అందుకొనవచ్చును. ఈ ప్రకటన పత్రాలను ఆయా శాఖాధిపతులకు పంపి వారి సలహాలను పొందవచ్చును.

శాఖాధిపతులు మాత్రమే ఒక గ్రంథం ఆ సంస్థకు అవసరమాలేదా అని చెప్పగలరు. దీనివలన శాఖాధిపతులకు కూడ బహుళ ప్రయోజనం ఉంది. తమ గ్రంథాలయంలో ఏయే పుస్తకాలు వస్తున్నాయి? తమశాఖలకు, సంబంధించి ఏయే పుస్తకాలు నూతనంగా ప్రచురించ బడుతున్నాయి? అని తెలుసికోవటానికి వీలేర్పడుతుంది. తమ గ్రంథాలయ సంపదను వృద్ధిపర్చటంలో తమకు కూడ భాగమున్నదనే సంతృప్తి కలుగుతుంది.

అన్ని గ్రంథాలయాలు అన్ని పుస్తకాలను సేకరించడం కష్టం. ఒక పుస్తకం అచ్చయిందో లేదో తెలుసుకొని ఆ తరువాత దానిని సేకరించే పద్ధతి శ్రమతోకూడిన పని. అంతేగాక ఈ పద్ధతి అంత ప్రయోజనకరం కూడా కాదు. ఈ పద్ధాతిద్వారా అన్ని గ్రంథాలు లభిస్తాయనే నమ్మకం కూడా లేదు. ఈ పద్ధతిలో జరిగే జాప్యంవల్ల పుస్తకాలు చెల్లిపోయి లభ్యం కాకపోవచ్చును. అందుచేత స్థాయీ ఉత్తర్వులద్వారా ఈ పరిస్థితిని అధిగమించవచ్చును. ఈ పద్ధతిలో గ్రంథాలయం దానికి సంబంధించిన విషయంలో కృషిచేసే సంస్థలకు, ప్రచురణకర్తలకు స్థాయీ ఉత్తర్వులు చేయాలి. దీని ఆధారంగా ఆ సంస్థలుగాని, ప్రచురణ కర్తలుగాని, తాము ప్రచురించిన పుస్తకాలను వెంట వెంటనే గ్రంథాలయానికి సరఫరా చేయడం జరుగుతుంది. పుస్తక సమీక్షలు గ్రంథసేకరణకు ఎంతగానో సహకరిస్తాయి. వార్తాపత్రికలు, ఇతర పత్రికలు, పుస్తక సమీక్షలను ప్రచురిస్తాయి. ఈ సమీక్షలు ఆయా విషయాల్లో నిష్ణాతులైన వారిచే చేయబడి గ్రంథసేకరణకు ఉపయోగిస్తాయి. అందువల్ల గ్రంథాలయ సిబ్బంది పత్రికలను పరిశీలించి ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలి. తమకు వీలుకానిచో శాఖాధిపతులను సంప్రదించి వారి సహాయ సహకారాలతో పుస్తకాల ఎంపికను నిర్వహించవచ్చును. సాధారణంగా చదువరులు కూడ తమ కవసరమైన పుస్తకాలకు సలహాలివ్వటం పరిపాటి. ఈ సలహాలను పరిశీలించి పుస్తకాలు సేకరణ చేయాలి.

పుస్తకాల తరువాత అతి ముఖ్యమైనవి పఠనాసామాగ్రి పత్రికలు. పత్రికలు సామాన్యంగా పరిశోధనా వ్యాసాలను, నూతన విషయాలను అందజేసే సంసర్గ మాధ్యాలు. అలాగే అవి అతి నూతన మైన సమాచారాన్ని సకాలంలో అందించే ప్రధాన మాధ్యాలు. పత్రికా సేకరణ పుస్తక సేకరణవలే గాక సాలుసరి చందాలతో పొందాలి. నూతన పత్రికల వివరాలు ప్రకటన పత్రాలద్వారా గ్రంథాలయాలకు చేరతాయి. వీటిని ఆధారంగా చేసుకొని పత్రికా సేకరణను నిర్వహించాలి.

పుస్తక సేకరణ కంటే పత్రికా సేకరణ క్లిష్టమైన కార్యం. సరఫరాలో అంతరాయాలు తరచు ఏర్పడడంచేత ఈ విషయమైన వెను చర్యలు, ఉత్తరప్రత్యుత్తరాలు కార్యాభారాన్ని కల్గించడం, అలాగే వాటి వ్యవస్థీకరణ, నియంత్రీకరణ, తదాధారమైన అనుక్రమణిక సంక్షేప, అనువాద, పునరుత్పత్తి సేవల విషయంలో కూడా అవసరమైన చర్యలను ఒక క్రమపద్ధతిలో చేయాలి.

పైన ఉదహరించిన రీతిలో భాషా గ్రంథాలయాలకు కావలసిన పుస్తక సేకరణను జరుపవచ్చును.

## ఉపసంహారం

ఒక గ్రంథాలయం ఔన్నత్యం అది సాధించిన పుస్తక సంపదపై ఆధారపడి ఉంటుంది. అంటే కేవలం పరిమాణమేగాకుండా పుస్తక నాణ్యత కూడ ముఖ్యం. విషయ సంగ్రహణం మరింత ముఖ్యం. అలాగే గ్రంథాలయం వల్ల మాతృసంస్థకు ఏ మాత్రం ప్రయోజనం ఏర్పడుతున్నది? అనేది అంతకంటేముఖ్యం. పుస్తకసేకరణలో గల శ్రద్ధాసక్తులు గ్రంథాలయ సంపద ద్వారా విశదమౌతాయి. ఏ విధమైన గ్రంథాలు సేకరిస్తున్నాం? అవి చదువరుల అవసరాలకు ఎంత ఉపయోగపడుతున్నాయి? అనే అంశాలను సదా దృష్టిలో పెట్టుకొని పుస్తక సమీకరణ చేయాలి. అప్పుడే గ్రంథాలయ ప్రాథమిక సూత్రాలలో ఒకటైన "ప్రతి చదువరికి పుస్తకం" అనే సూత్ర ఉద్దేశ్యాన్ని సాధించటం వీలవుతుంది.

—(o)—

డా॥ వి. వి. యల్. నరసింహారావు

# 1. 2 అముద్రిత గ్రంథ సేకరణ సమస్యలు

ఈ సదస్సు కేవలం తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం అభివృద్ధికోసమే ఉద్దేశించింది కాదు. భారతదేశంలోని గ్రంథాలయాలన్నిటి అభివృద్ధిని ఆకాంక్షిస్తూ ఏర్పరచిన సదస్సు. ఇందులో ప్రయోజనకరంగా వెలువడే సూచనలూ, నిర్ణయాలు తెలుగు విశ్వవిద్యాలయానికి కూడా ఉపకరిస్తే ముదావహం.

ఈ సదస్సు సమావేశాల ప్రధానలక్ష్యం భారతీయ గ్రంథాలయాల వనరుల ప్రస్తుత పరిస్థితిని సమీక్షించి, వీటిని ఏకోన్ముఖం చెయ్యటం ద్వారా సమష్టి ప్రయోజనం ఎట్లా సాధ్యమవుతుందో సూచించడమే. ఈ దృష్టితోనే-గ్రంథ సేకరణ, సహకారం-వనరుల పంపకం, సేకరణలో వాఙ్మయ నియంత్రణ పద్ధతులు, వర్గీకరణ-సూచీకరణ ప్రక్రియల్లో ఎదురయ్యే సమస్యలు, యంత్ర పరికరాల వాడుక, సిబ్బంది సమస్యలు, వివిధ వాఙ్మయ పరికరాలు, గ్రంథాలయాలు సామాజికమైన సాధారణ సేవ లందించటమే కాక కవిపండిత పరిశోధక విద్యావేత్తలకు కూడా ఉపయోగించేటట్లు విశిష్ట సేవలందించటం-అనే ప్రధానాంశాలు సదస్సులో ప్రసక్త విషయాలైనాయి.

గ్రంథాలంటే-ముద్రిత రచనలు, రాత ప్రతులు, పత్రికాదులు మొదలైనవి. అముద్రిత రచనల సేకరణ సమస్యలు ముద్రిత రచనల సేకరణసమస్యల కంటే భిన్నంగా ఉంటాయి. వాటిని ప్రత్యేక దృష్టితో పరిశీలించవలసిన అవసరముంది.

ఒక సమస్యకు పరిష్కారమార్గాలు పరిశీలించేటప్పుడు అందుకు సంబంధించిన పూర్వచరిత్ర అనావశ్యకంగా విపులీకరించక అవసరమైనంతవరకే ప్రస్తావించటం సబబు. చరిత్ర విపులీకరణవల్ల సమయం చాలకపోవచ్చు. ఉదాహరణకు రాత ప్రతుల సేకరణ ఎప్పుడు ప్రారంభమైందో ఎటువంటి ఫలితాలు సాధించబడినాయో తెలుసుకోదగిన అంశమే. వీటి సేకరణ చరిత్రలో శాస్త్రీయ పద్ధతులకు అంకురార్పణ క్రీ.శ. 1774 లో ఈస్టిండియా కంపెనీ సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తుల్లో ఒకరైన సర్ రాబర్ట్ చాంబర్స్‌తో ఆరంభమైనదనీ - అతని బుద్ధిలో పరిమళించిన సంస్కృత గ్రంథాలరాత ప్రతుల మహాగ్రంథాలయం నిర్మాణాసక్తి అందుకు మూలకారణమనీ చెపితే చాలు. తరువాత రంగంలో అడుగు పెట్టిన వారు కల్నల్ మెకంజీ, సర్ చార్లెస్ ఫిలిప్‌బ్రౌన్, ప్రొ॥ ఫిక్‌ఫర్ట్, బర్నెల్, శేషగిరిశాస్త్రి మొదలైనవారు. అంతకుముందే 1798లో తంజావూరు సింహాసనం అధిష్ఠించిన మహారాజా శెర్ఫోజి, 1917 ప్రాచ్యా పరిశోధన సంస్థ స్థాపించిన భండార్కర్ గణనీయులు.

బొబ్బిలి రాజా మొ॥ కొందరు సంస్థానాధిపతులు ప్రాచీన గ్రంథ సేకరణలోనే కాక తగిన గ్రంథాలయాలకు వాటిని బహూకరించటంలో కూడా ప్రత్యేకత గడించారు. ప్రభుత్వ యంత్రాంగం లేకుండా వైయక్తికాసక్తితో చేసిన గ్రంథసేకరణ అభినంద పాత్రమైనది.

రాత ప్రతుల సేకరణలో ఎదురయ్యే సమస్యలు రెండు. మొదటిది గ్రంథాలెక్కడెక్కడున్నాయో తెలుసుకోవటం. రెండోది వాటిని ఎట్లా సేకరించాలో నిర్ణయించి సేకరించటం. సేకరించిన తరువాత శిథిల ప్రతులకు చికిత్స జరిపి, వాటిని పరిరక్షించటం వేరే సమస్య. అది సేకరణ పరిధిలోకిరాదు. కనుక ఇక్కడ అప్రసక్తం.

ప్రభుత్వ పర్యవేక్షణలో ఇంతవరకు జరిగిన వార్షిక సర్వేక్షణ నివేదికలు సంప్రదింపటం, కొత్తగా సర్వేచెయ్యవలసిన ప్రదేశాలన్ను

గుర్తించి సర్వే కార్యక్రమం రూపొందించటం - ఇది ప్రభుత్వ పరిధిలో జరుగుతున్నది. ఇందుకు ప్రైవేట్ సంస్థల సహాయం, వ్యక్తుల సహాయం కూడా ప్రభుత్వం స్వీకరిస్తుంది. వ్యక్తులకు అందుబాటులో లేని సాధన సామగ్రి ప్రభుత్వం ద్వారా అందుకోవచ్చు.

రాత ప్రతులలో ప్రాచీనమైన తాళపత్ర గ్రంథాల విషయంలో రెండు ఇబ్బందులు ఎదురౌతున్నాయి. మొదటిది ఈ గ్రంథాలు చాలా పవిత్రమైనవనే భావంతో వీటిని పూజా మందిరాల్లోనిక్షేపించి అర్ఘ్యపాద్యాదులర్పించే సందర్భాలున్నాయి. వాటిని బయటకు తీయించి గ్రంథ నామాదికం తెలుసుకోవటం, నిర్ణయించటం కష్టమౌతుంది. మొత్తం మీద ఎట్లాగో నచ్చచెప్పి అటువంటి గ్రంథాలకు కనీసం మైక్రోఫిల్ములైన తీసుకోవటానికి వీరి నంగీకరింప చెయ్యవచ్చు. రెండో విధమైన ఇబ్బంది ప్రళయాంతకమైనది. చాలాకాలంగా ఆ గ్రంథాలు అట్లా ఇంట్లో ఉండటంవల్ల కుటుంబానికి ఏదో అరిష్టమొస్తుందని ఏ పుణ్యాత్ముడో దుర్బోధచెయ్యటంవల్ల - హఠాత్తుగా ఏ అర్ధరాత్రివేళో ఎవ్వరూ చూడకుండా వాటిని తీసుకుపోయి నీళ్ళున్న ఏ కోనేటిలోనో, పాడుబడ్డ వాటిలోనో పడవేసి రావటం. ఈ రకంగా ఎంతో అమూల్య గ్రంథజాలం అంతరించిపోయింది. దీన్ని నిరోధించటానికి మారుమూల గ్రామాల్లో కొంత ప్రబోధాత్మకమైన ప్రచారం అవసర మనిపిస్తుంది ఈ ప్రచారం నూతన గ్రంథ సేకరణకు కూడా ఉపకరిస్తుంది. ప్రచారం కేవలం ఉపన్యాసాలద్వారానే కాక డాక్యుమెంటరీ ఫిల్ముల ప్రదర్శన ద్వారా చెయ్యటం ఎక్కువ ఫలితాలనిస్తుంది. ఇది మన ప్రాచీన గ్రంథాల సంగతి.

ఇవికాక ఇతర దేశాల్లోనే ఉండిపోయి ఇంతవరకు తరలించబడకుండా ఉండి పోయిన భారతీయ ప్రాచీన గ్రంథాలు చాల ఉన్నాయి. మూల గ్రంథాలు అసాధ్యమైతే కనీసం వాటి ప్రతులైన సంపాదించుకో

వలసిన అవసరం ఎంతైనా ఉంది. పీటికి ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించుకోవలసి ఉంది.

ఇంతవరకు చెప్పింది రాత ప్రతుల ముచ్చట. ఇక ముద్రిత గ్రంథాల సేకరణ సంగతి.

నేడు ప్రపంచలోని గ్రంథాలయాల్లో ముద్రిత గ్రంథ భాండాగా రాల సంఖ్య రాతప్రతుల గ్రంథాలయాల సంఖ్య కంటె వేల రెట్లు ఎక్కువనేది అందరికీ తెలిసిన విషయమే. గ్రంథాలయమంటే ముద్రిత భాండాగారమే జ్ఞప్తికి వస్తుంది. గ్రంథాలయం లేని గ్రామాన్ని చాలా వెనకబడిన గ్రామంగా భావిస్తున్నాం. ఉన్న గ్రంథాలయాలను వృద్ధి చెయ్యటం కూడా ముఖ్యవిషయమే. గ్రంథాల సేకరణ ముఖ్యాతి ముఖ్యం. ఈ విషయమై భారత దేశంలో మనమెదుర్కొనే సమస్యలెటు వంటివి ? నిర్దుష్టమైన నిర్ణయ ప్రమాణాలేమయినా ఉన్నాయా ? ఆర్థికపర మైన వనరుల పరిస్థితి ఎటువంటిది ? ఈ విషయాలు ఈ సమావేశంలో పరిశీలించవలసిఉంది.

గ్రంథాలయాల్లో గ్రంథసేకరణకు నేడు కాన వస్తున్న పద్ధతులు ప్రధానంగా నాలుగు 1. కొనుగోలు పద్ధతి 2. వినిమయ పద్ధతి 3. బహూకరణ పద్ధతి 4. సభ్యత్వ పద్ధతి.

వీటిని గూర్చి శ్రీ కృషన్ కుమార్ వంటి వారు 'లైబ్రరీ మాన్యు వల్' వంటి గ్రంథాలలో పేర్కొన్నారు. గ్రంథ ప్రచురణ సంస్థలు బాగా అందుబాటులో లేకపోవటం, ఆర్డరు పంపగానే గ్రంథాలు అందజే యలేక పోవటం, ఇతర దేశాల నుంచివచ్చే పుస్తకాలైతే ఇంకా జాగుకా వటం, ఆ దేశాలకు మనదేశానికి పరస్పర అవగాహన సరిగా లేకపోవటం, జాతీయస్థాయిలో తయారుచేసిన గ్రంథ పట్టికలు లభ్యం కాకపోవటం, ఉన్న గ్రంథాలయ నిధులు సకాలంలో అందకపోవటం, రాజకీయ కారణాల

వల్ల కూడా కొన్ని ప్రచురణలు అందుబాటులో లేకపోవటం, రచయితే దురదృష్టవశాత్తు ఈ దేశంలో ప్రచురణ కర్త, పంపిణీదారు అవతారం ఎత్తవలసిరావటం - మొదలైన ఎన్నో కారణాలవల్ల గ్రంథ సేకరణ చురుకుగా జరగటంలేదు. ఈ అడ్డంకులు తొలగించడానికి కృషి జరగాలి. ఇందుకు న్యూఢిల్లీలోని "గుడ్ ఆఫీసెస్ కమిటీ" విధించిన నిబంధనలు పాటించటం అమ్మకం దారులకు కొంత ప్రయోజన కరంగా ఉండ వచ్చును.

గ్రంథాలయ సాంకేతిక విభాగంలో అందరికీ బయటకు కనిపించని అతి ప్రధానమైన అంశం గ్రంథాల సేకరణ. ఒక్కో ప్రదేశంలో ఒక్కో విధమైన గ్రంథాలయాలు నెలకొల్పుతుంటారు. ఉదాహరణకు విశ్వవిద్యాలయంలోని ప్రత్యేక పరిశోధనాశాఖకు సంబంధించిన గ్రంథాలయం, రెవెన్యూ మండలంలో స్థాపించే గ్రంథాలయంకంటే ఎంతో భిన్నంగా ఉంటుంది. తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయంలో ప్రాచీనమైన తెలుగు కళా సాహిత్య సంస్కృతులను ప్రతిబింబించే గ్రంథాలుంటాయి. తమిళ విశ్వవిద్యాలయంలో తమిళ సంస్కృతిని పెంపొందించే గ్రంథాలే ఎక్కువ ఉన్నాయికదా! గ్రంథ సేకరణకూడా సంస్థ లక్ష్యం మీద ఆధారపడి ఉంటుంది. "నేడుమనం సేకరించే గ్రంథాలు భావి తరాల వారు పరిహసించేవిగా ఉండరాదని" ప్రపంచ వ్యాప్తంగా విజ్ఞులందరూ అంగీకరించిందే (ఆర్. యల్. మిట్టాల్ : లైబ్రరీ అడ్మినిస్ట్రేషన్, పుట. 192).

పబ్లిక్ లైబ్రరీల గ్రంథాల సేకరణలో అనువర్తించే సూత్రాలు వేరుగా ఉంటాయి. విద్య, సమాచారం, కళాప్రీతి, వినోదం, పరిశోధన మొదలైన అన్ని అంశాలపై గ్రంథాలు సేకరించబడతాయి. అన్ని జాతుల అవసరాలు, అన్ని మతాల అవసరాలు, అన్ని వర్గాల అవసరాలు

దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. సేకరణ సూత్రాలు ఎల్లవేళల ఒకే రీతిగా ఉండరాదు. కాలానుగుణంగా, దేశానుగుణంగా మార్పులు తప్పవు.

అనేక విషయాల్లో అభినివేశంగల ప్రాజ్ఞుల సూచనమేరకు గ్రంథాల ఎన్నిక జరగాలి. పుస్తకాలు ఎన్నిక చేసే సంఘాల సభ్యుల నియామకం ఈ దృష్టితో జరగాలి. గ్రంథాలయం ఉన్న స్థలం అక్కడి పరిసరాలు, ప్రజల అభిరుచులు, చదువరుల మనః ప్రవృత్తులు, గ్రంథాలయ సిబ్బంది ఓర్పు నేర్పులు కూడా దృష్టిలో ఉంచుకొని గ్రంథసేకరణ చేయ వలసి ఉంటుంది. సామాన్య ప్రజల అభిరుచులే దృష్టిలో ఉంచుకొని "ఫిక్షన్" మాత్రమే ఎక్కువగా చేరిస్తే సాంస్కృతిక లక్ష్యాలు దెబ్బ తింటాయేమో పరిశీలించాలి.

గ్రంథసేకరణ విభాగం అధికారి బాధ్యతలు చాలా గురుతర మైనవి. నిత్యం వాడకం వల్ల పనికిరాకుండా పోయే అమూల్య గ్రంథాలు చాలా ఉంటాయి. వాటిని ఒక క్రమపద్ధతిలో బాగుచేయించటానికి సాంకేతిక విభాగం ఉన్నా-బాగుచేసే దశదాటిపోయిన గ్రంథాలను వేలంవేసి కొంత సొమ్ము రాబట్టడం, ఆ సొమ్ముతో కూడా కొన్ని నూతన గ్రంథాలు కొనటం జరుగుతుంటుంది. పుస్తకాల ఎన్నికసంఘాలకు తగిన సలహాలు సకాలంలో అందాలి. ముద్రణలోలేని అమూల్య పుస్తకాలు శిథిలమౌతుంటే వాటి మైక్రో ఫిల్మ్ ప్రతులు సిద్ధంచేసి ఉంచాల్సిన అవసరముంటుంది. ప్రచురణ సంస్థల ప్రతినిధులు, అమ్మకందారులు మొదలైన వారితో జరిపే ముఖాముఖి సంభాషణలు - గ్రంథాలయ ప్రయోజనం దృష్టిలో ఉంచుకొని చేయటం మేలు.

## గ్రంథసేకరణ సిబ్బంది

పుస్తకాల సేకరణ అనేది కేవలం ఒక గుమస్తా పనిగా భావించరానిది. బాధ్యతగల అధికారి కర్తవ్యంగా పరిగణించాలి. గ్రంథాలయ సంస్థతో

అనుభవంగల సహాయకులు అతనికితోడుగా ఉండాలి. ఎంత మంది తోడు కావాలనేది గ్రంథాలయం స్థాయినిబట్టి ఉంటుంది "గ్రంథసేకరణ అనేది ఒక కళ. ఒక అపరాధ పరిశోధకుడు, ఒక రాయబారి, ఒక వ్యాపారి - ఈ ముగ్గురి ప్రతిభలు మూర్తీభవించిన గొప్ప కళ అది. అంతేకాదు. ఆకళాకారుడు విద్యావేత్త, మానవతా ప్రియుడు, గ్రంథప్రియుడు అయి ఉండాలి." అంటారు డాక్టరు మిట్టాల్ లాంటి ప్రాజ్ఞులు (లైబ్రరీ ఎడ్మినిష్ట్రేషన్, పుట. 197).

## గ్రంథసేకరణ ఉపకరణాలు

ఉపకరణాలు లేకుండా గ్రంథసేకరణ అసాధ్యం. ఉపకరణ సౌకర్యమంటే అచ్చైన పుస్తకాల పట్టికలు అందుబాటులో ఉండటం. పెద్ద పెద్ద ప్రచురణ సంస్థలు పుస్తకాల పట్టికలు గ్రంథాలయాలకు పంపుతున్నా అన్ని గ్రంథాలయాలకూ అవి అందవు. పత్రికల్లో సమీక్షలు, గ్రంథస్వీకారాలు చూచి గ్రంథాలయాలు పట్టికలు తయారుచేసుకోవటం అంత సులభమైనపనికాదు.

విదేశాల్లో లండన్, న్యూయార్క్, వాషింగ్టన్ మొదలైన పట్టణాల్లో వారం వారం, నెల నెలా పుస్తక పట్టికలను ప్రచురించే ప్రచురణ సంస్థలు శతాబ్ది కిందటినుంచే ఎన్నో ఉన్నాయి. పుస్తకాల పట్టికలు, ప్రకటనలు లభ్యంకాకపోతే సేకరణ కష్టమౌతుంది.

మన దేశంలో ఇంగ్లీషు పుస్తకాల పట్టికలు మాత్రం కలకత్తా, ఢిల్లీ మొదలైన పట్టణాల నుండి దాదాపు అర్ధశతాబ్ది కిందటినుంచే వెలువడుతున్నాయి. అవి వారం వారం కాకపోయినా కనీసం త్రైమాసికంగా వార్షికంగానైనా వెలువడుతున్నందుకు సంతోషం. ఏమైనా గుర్తించబడిన అధికార భాషలన్నింటిలో గ్రంథపట్టికలు విస్తృతంగా లభించాలి. ఈ పట్టికలను సేకరించి, వలసిన సమాచారం అందుబాటులో ఉంచే ప్రకాశక

ప్రతినిధుల సమాఖ్య ఒకటి ఏర్పడటం కూడ అవసరమేననిపిస్తుంది. జాతీయ గ్రంథాలయాలు, రాష్ట్ర గ్రంథాలయాల బుక్స్ రిజిష్ట్రార్లు ప్రచురితమైన ప్రతి గ్రంథం అందుకునే వీలుంది. కనుక ఆయా కార్య కర్తల సహకారం కూడా ఇందుకు ఎంతో ఉపకరిస్తుంది.

పెద్ద గ్రంథాలయాల్లో గ్రంథసేకరణ సమర్థవంతంగా సకాలంలో జరగాలంటే సాంకేతిక సేవావిభాగం ఒకటి ఉండాలనేది అందరూ అంగీకరించిన అంశమే. సేవావిభాగం కొనసాగటమనేది సిబ్బంది సౌకర్యంమీద ఆధారపడి ఉంటుంది. మంజూరైన సిబ్బందికూడ బాధ్యతా యుతంగా పనిచేస్తే కాని పని సానుకూలం కాదు. ఈ సాంకేతిక సేవా విభాగం బాధ్యతలను ఈ కిందివిధంగా వివరించవచ్చును.

1. గ్రంథం ప్రచురించబడి విడుదలైన వెంటనే గ్రంథాలయ చదు వరుల అందుబాటుకు రావాలి.
2. ఒకే విషయం మీద అనేక ప్రచురణలు వెలువడితే వాటిలో ఏ ప్రచురణ ఎక్కువ మంది పఠితలకు ప్రయోజనకరంగా ఉంటుందో నిర్ణయించి దాని ప్రతులు ఎక్కువగా సేకరించాలి.
3. పుస్తకాన్ని చదువరుల అందుబాటుకు అతి స్వల్పకాలంలో తీసుకు రావటానికి అయ్యే ఖర్చుకూడా వీలైనంత తక్కువగా ఉండాలి.
4. గ్రంథం సులభ పద్ధతిలో కొనుగోలు చెయ్యటానికి కొత్తమెళకువలు అన్వేషించాలి. నిత్యనూతనమైన అవసరాలకు అనుగుణంగా కొత్త 'ప్రోగ్రామ్లు' అనుభవపూర్వకంగా రూపొందించుకోవాలి.

గ్రంథసేకరణకు ఆర్థికపరమైన వనరులు, గ్రంథాలు సేకరించే మార్గాలనుగూర్చి ఎంత ఒడుపుగా చెప్పుకొన్నా, సేకరించేందుకు అయ్యే

ఖర్చు భరించేమార్గాలు అంత సులభమైనవికావు. ఇవి ఆర్థికంగా గ్రంథాలయాలకుండే వనరులమీద ఆధారపడి ఉంటాయి. పబ్లిక్ లైబ్రరీలు, జిల్లా గ్రంథాలయాలు, సిటీ గ్రంథాలయాలు, ప్రాంతీయ గ్రంథాలయాలు వీటన్నిటికీ నిర్దిష్టమైన బడ్జెట్ ఉంటుంది. కేటాయింపును బట్టి ఒక్కొయేడు హెచ్చు తగ్గులుండవచ్చు. ఉన్న బడ్జెట్‌లో పుస్తకాల కొనుగోలు కెంత వినియోగిస్తున్నాం? కొనుగోలు సిబ్బందికీ, సేవావిభాగానికి ఎంతెంత వినియోగిస్తున్నాం? సేవా విభాగ సామర్థ్యం ఎంతగా పెంపొందింది? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుకొని బడ్జెట్‌ను ఏటేటా పునః పరిశీలించుకోవాలి. గ్రంథసేకరణ సేవావిభాగం సామర్థ్యం పెంపొందించేందుకు బడ్జెట్ కేటాయింపు అధికం చేయవలసివస్తే తప్పక చెయ్యాలి. ఈ దృష్టితో ప్రత్యేక పర్యవేక్షణ ఆవశ్యకం.

మెట్రోపాలిటన్ లైబ్రరీల్లో కంటే ఈ సమస్య గ్రామీణ గ్రంథాలయాల్లో తీవ్ర తరంగా కనిపిస్తుంది. ఒక్క రెండో గ్రేడ్ గ్రంథపాలకుడే పరిచారక పదవినుంచి, గ్రంథాలయాధికారి హోదావరకు అనేక అవతారాలు ధరించవలసి వస్తుంది. అక్కడి పరిస్థితులు ఆర్థికంగా పెంపొందితే తప్ప అవసరమైన వనరులు ఏర్పడవు. గ్రామీణ గ్రంథాలయాల్లో గ్రంథసేకరణ ఆక్కడి అవసరాలను బట్టి జరగాలి. కర్షకులు, కూలీలు అధిక సంఖ్యలో గ్రంథాలయం వినియోగించుకునే వీలు కలగాలంటే వారి అభిరుచులకు తగిన గ్రంథాలు పత్రికలు, వీడియోలు, టేప్ రికార్డర్లు మొదలైనవి కూడా చేర్చవలసి ఉంటుంది. వీటికయ్యే 'బడ్జెట్' అసాధారణంగా కనిపించినా వీటిని నిర్లక్ష్యం చెయ్యలేము గదా!

## ముగింపు :

రాత ప్రతుల గ్రంథాలయాలు, ముద్రిత ప్రతుల గ్రంథాలయాలు రెండూ ఈ సదస్సులో పరిశీలనార్హాలే. ఈ రెండు విధాల గ్రంథా

లయాలకు గ్రంథ సేకరణ సమస్యలు భిన్నంగా ఉండవచ్చు. జాతీయ సంస్కృతి వికాసానికి ఉభయ విధాలైన గ్రంథాలయాల అభివృద్ధి అవశ్యమే.

రాత ప్రతుల సేకరణ కోసం జరిపే సర్వేక్షణలో ఆధునిక పరికరాలైన డాక్యుమెంటరీ ఫిల్ముల ప్రదర్శన మొదలైన సాధనాలు కూడా ప్రయోజనకరంగా ఉంటాయి.

ముద్రిత గ్రంథ సేకరణ కోసం కొత్త గ్రంథాల పట్టికలు వారం వారం గ్రంథాలయాలకు అందుతుండాలి. ఇందుకు ప్రకాశక ప్రతి నిధుల సమాఖ్య ఒకటి ఏర్పడటం మేలు. గ్రంథ సేకరణలో సేవా విభాగం సిబ్బందిని, పరికరాలను సమర్థవంతంగా వినియోగించుకోవలసిన అవసరం ఉంది. ఇందుకోసం అవసరమైతే వార్షిక నిధులు ప్రత్యేకంగా కేటాయించుకోవలసిన అవసరం కూడా ఉంది.

గ్రంథ సేకరణ అధికారి బాధ్యతలు గురుతరమైనవి. పట్టణ ప్రాంతం గ్రంథాలయాలకంటే గ్రామీణ ప్రాంతాల్లోని గ్రంథాలయాల్లో అక్కడి అవసరాలకు అనుగుణంగా వీడియో మొదలైన సాంకేతిక పరి కరాలుకూడా సమకూర్చుకోవచ్చు. వీటికయ్యే వ్యయం అనివార్యంగా భావించాలి. గ్రంథ సేకరణ సక్రమంగా, సమర్థవంతంగా జరిగిన నాడే గ్రంథాలయాల అభివృద్ధి జరిగినట్లు. సాంస్కృతిక విజ్ఞానాభివృద్ధికి గ్రంథాలయాలకంటే విశిష్టమైన సాధనం వేరొకటిలేదని తెలుసుగదా!

—(o)—

డా॥ పి. కామయ్య

# 1. 3 గ్రంథాలయ ఆర్థిక ప్రమాణాలు

ధనమే ప్రధానమనే నేటి ప్రపంచంలో ఏ పని కూడా తగిన ఆర్థిక స్తోమత లేనిదే విజయవంతం కానేరదు. సాంఘిక ప్రయోజనాల కోసం ఏర్పడిన సంస్థల నిర్వహణకు, వాటి లక్ష్య సాధనకు కూడా డబ్బు తప్పని సరి. అవి పరిశ్రమలు, వ్యాపారం, పరిపాలన మొదలైన కార్యకలాపాలు మాత్రమే కానవసరం లేదు. సాంస్కృతిక, విద్య, వైజ్ఞానిక సేవా సంస్థలైన గ్రంథాలయాలు కూడా ఇంతే. తగిన ఆర్థిక వనరులు సమకూరనప్పుడు అవి తమ లక్ష్యాలను సాధించలేవు; వాటి విధినిర్వహణకు, అవి చేపట్టే కార్యకలాపాలకు సాంఘిక ప్రయోజనం చేకూరదు. ఎందుచేతనంటే విద్యా రంగంలో వలె గ్రంథాలయ కార్య కలాపాలు కూడా వ్యయ ప్రయాసలతో కూడిన విషయం. పెట్టుబడి, వ్యయం తప్ప ఆదాయం, లాభం అనే ప్రసక్తి లేదు. వీటి ప్రభావం ఎంతో కాలం తర్వాత కానీ కనిపించదు. పౌర గ్రంథాలయం, విద్యా సంస్థ గ్రంథాలయం, ప్రత్యేక గ్రంథాలయం, చిన్నది, పెద్దది అనే తేడా లేకుండా ప్రతి గ్రంథాలయం కూడా చదువరుల కవసరమైన పఠన సామగ్రిని, సమాచారాన్ని సేకరించి ఎప్పటికప్పుడు (సకాలంలో), ఏ మాత్రం కాలయాపనం లేకుండా అందించడం ప్రధాన విధిగా నెర వేర్చడం జరుగుతుంది. ఇది సక్రమమైన వ్యవస్థిత రూపంలోనే సాధ్యం. బృంద కార్యకలాపం. గ్రంథ సేకరణ, తద్వ్యవస్థీకరణ – నియంత్రణా పరమైన వాఙ్మయ – సమాచారాది సేవలు కావించడానికి సిబ్బంది, సామగ్రి, వ్యవస్థ మొదలైనవి ఉండాలి. తగిన పెట్టుబడి లేనిదే ఫలితం ఉండదు. లక్ష్యం సిద్ధించదు.

గ్రంథాలయాల ఆర్థిక సదుపాయాలు వాటి వ్యవస్థా విధానాన్ని అనుసరించి సమకూరుతాయి. సామాన్యంగా మూల సంస్థలే ఆయా గ్రంథాలయాల ఆర్థికావసరాలను నిర్ణయించి, ఆర్థిక విధానాన్ని రూపొందించి ఆ విధంగా అవసరమున్నంతమేరకు ద్రవ్యాన్ని సమకూరుస్తాయి. మన దేశంలో గ్రంథాలయాల వనరులు, ఆదాయమూలాలు, విధానాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

## విద్యాసంస్థల గ్రంథాలయాలు

కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను, పరిశోధనా కేంద్రాల్లోను, తదితర విద్యా సంబంధమైన సంస్థల్లోను నిర్వహించబడే గ్రంథాలయాలకు సామాన్యంగా యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ అందించే అనుదానాలు, మూల సంస్థలు కావించే కేటాయింపులు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ విరాళాలు ప్రధాన ఆదాయాలుగా చెప్పవచ్చును.

## పౌర గ్రంథాలయాలు

గ్రంథాలయ శిస్తు, రాష్ట్ర ప్రభుత్వ మంజూరులు, రాజారామ మోహన్‌రాయ్ గ్రంథాలయ నిధి విరాళాలు, కేంద్ర విరాళాలు పౌర గ్రంథాలయాలకు ఆర్థిక వనరులను చేకూరుస్తాయి.

## ప్రత్యేక గ్రంథాలయాలు

మూల సంస్థల కేటాయింపులు, కేంద్ర ప్రభుత్వ విరాళాలు, కొన్ని సందర్భాల్లో (విశ్వవిద్యాలయాలుగా గుర్తించబడ్డ సంస్థల గ్రంథాలయాలకు) యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ అనుదానాలు ఈ రకం గ్రంథాలయాలకు ఆర్థికవనరులను సమకూరుస్తాయి

ఇవిగాక, గ్రంథాలయాభిమానులిచ్చే విరాళాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు అందించే ఆర్థిక సహాయాలు, కొన్ని సందర్భాల్లో అంతర్జాతీయ

ద్రవ్య సహాయాలు, మొదలైన వాటిని కూడా పేర్కొనవచ్చును. ఇదంతా ఆదాయ విషయం. ఇంత కంటే ముఖ్యం వ్యయ విషయం. ఈ విధంగా అందే ఆర్థిక సంపత్తులు ఈ గ్రంథాలయాలకు సరిపోతాయా? నిత్యంపెరిగే ధరలను తట్టుకోవడం ఏ విధంగా సాధ్యం? గ్రంథాలయాల్లో ఎదురయ్యే వ్యయాంశాలేమిటి? వాటి కేటాయింపులు ఏ విధంగా ఉంటాయి? ఉండాలి? ఏ విధంగా (కనీస) ఆర్థిక ప్రమాణాల అవసరం గుర్తించాలి? ఈ కనీస ఆర్థిక ప్రమాణాలను రూపొందించడం ఎలా? అనే విషయాలను కూడా ఆలోచించవలసి ఉంది.

## గ్రంథాలయ వ్యయాంశాలు

నార్మన్ హిగమ్ అభిప్రాయం ప్రకారం గ్రంథాలయ ఉద్దేశ్యాలను అభిలషణీయంగా సాధించడానికి, చదువరుల అవసరాల మేరకు పుస్తక సంకలనాన్ని సంతృప్తికరమైన ప్రమాణంలో క్రమబద్ధంగా కొనసాగించడానికి, అవసరమైన సామాగ్రి సన్నాహాలను పెంపొందించుకొని వర్తన సామాగ్రిని వ్యవస్థీకరించటానికి, సిబ్బంది నియామక నిర్వహణానికి, వాఙ్మయ - సమాచారాది సేవలనభివృద్ధి పరచటానికి ధనమవసరం. ఇది స్థూల వివరణ. ఈ ప్రకారం గ్రంథాలయాల్లో సర్వసామాన్యంగా కనిపించే వ్యయ శీర్షికలు ముఖ్యంగా మూడు. అవి (1) సంకలన క్రమాభివృద్ధి; (2) వాఙ్మయ ప్రక్రియలు (వ్యవస్థీకరణ, నియంత్రణలు), సేవలు; (3) సిబ్బంది నియామకం, పోషణ.

వీటి తర్వీళ్ళను ఈ కింది విధంగా వివరించ వచ్చును.

1. సిబ్బంది వేతనాలు;
2. సంకలనాభివృద్ధి
   (పుస్తకాలు, పత్రికలు, పుస్తకేతర వస్తువులు మొదలగువాని కొనుగోలు);

3. పఠన సామగ్రి పరిరక్షణ, బైండింగ్, నిర్వహణలు;
4. ఆసనాది సామగ్రి, సాధన సామగ్రి;
5. యంత్రాలు, ఉపకరణలు;
6. లేఖనాది సామగ్రి;
7. తపాలా తదితర సకలవిధ ఖర్చులు;
8. భవన నిర్వహణ, మరమ్మత్తులు, విస్తరణ;
9. ఇతరాలు.

వీటిలో కొన్ని ఏటేటా అవసరమయ్యే ఖర్చులు (ఆవర్తన వ్యయాలు), మరికొన్ని అప్పుడప్పుడు ఎదురయ్యే ఖర్చులు (అనావర్తన వ్యయాలు).

## ఆవర్తన వ్యయం

ఆవర్తన వ్యయ శీర్షికలు ముఖ్యంగా (1) వేతనాలు; (2) పుస్తక సంపాదన; (3) పత్రికల చందా; (4) పుస్తకేతర పఠన సామగ్రి కొనుగోలు; (5) లేఖనాది సామగ్రి, తపాల తదితర చిల్లర ఖర్చులు (సాహిత్య, సాంస్కృతిక కార్యకలాపాలు, పుస్తక ప్రదర్శనలు, సదస్సులు, సమావేశాలు మొదలైన వాటికయ్యే ఖర్చులు)

## అనావర్తన వ్యయం

ఈ శీర్షిక కింద (1) ఆసన, సాధనాది సామగ్రి; (2) యంత్రాలు, ఉపకరణలు; (3) భవన మరమ్మత్తులు, విస్తరణ, నిర్వహణ, సదుపాయాలు మొదలైన ఖర్చులను పేర్కొనవచ్చును.

ఈ వివిధ వ్యయాల అవసరాలు, పరిమాణాలు, నిర్ణయ ప్రమాణాలు మొదలైన విషయాలు గ్రంథాలయ ఆయ - వ్యయ పట్టిక

తయారీలో ఏ విధమైన సమస్యలను కలిగిస్తాయనే విషయాలను కూడా ఆలోచించడం అవసరం.

## వేతనాలు

గ్రంథాలయ వ్యయాంశ శీర్షికల్లో ఇది ప్రధానాంశం. గ్రంథ సేకరణకు, సేకరించిన గ్రంథాలకు ఉపయోగాన్ని చేకూర్చటానికి, అందుకోసం వాటిని వ్యవస్థీకరించటానికి అర్హులు, సమర్థవంతులైన సిబ్బంది కావాలి. గ్రంథాలయ స్వభావాన్ని, పరిమాణాన్ని, ఆశయాలను, సేవలను, ప్రక్రియలను, భావి కార్యకలాపాలను గమనికలోనికి తీసుకొని వివిధ సిబ్బంది వర్గాల అవసరాన్ని కొన్ని కనీస ప్రమాణాల మేరకు నిర్ణయించటం జరగాలి. వేతన వ్యయాలను సిబ్బంది పరిమాణ అంచనా ఆధారంగా నిర్ణయించాలి. స్థిర సిబ్బంది జీత భత్యాలు, వేతనంలో పెంపు, సెలవు జీతాలు, భవిష్యనిధి, విరమణ లాభాలు, ఉపకార వేతనాలు, తాత్కాలిక సిబ్బంది వేతన వ్యయాలు గణనలోకి రావాలి. ఈ పద్ధతిలో వేతన వ్యయం మొత్తాన్ని సూచించాలి.

## పఠన సామగ్రి

గ్రంథాలయాల్లో అందించే వాఙ్మయ సమాచార సేవలకు పుస్తకాలు, పత్రికలు, పుస్తకేతర వస్తువులు మూలాధారం. ఒకప్పుడు పుస్తకాలు ప్రధానాంశాలుగా ఉండేవి. కానీ, నేడు పత్రికలకు అగ్రప్రాధాన్యత వచ్చింది. కారణం— ఇవి ప్రాథమిక ప్రచురణలు కావడం చేత నూతన పరిశోధనా విషయాలను, తాజా పరిజ్ఞానాన్ని, సమాచారాన్ని ఎప్పటికప్పుడు పుస్తకాల కంటె ముందుగా అందిస్తాయి. విద్యా సంస్థల గ్రంథాలయాల్లోను, ప్రత్యేక గ్రంథాలయాల్లోను, పత్రికల అవసరమే ఎక్కువ. వీటి చందాల కయ్యే వ్యయం పుస్తకాల కంటే అధికం. పుస్తకాలు, పత్రికలు కాకుండా ఎన్నో రకాల పుస్తకేతర వస్తువులు కూడా గ్రంథా

లయాల్లో క్రమంగా చోటు చేసుకుంటున్నాయి. వీటి అవసరాలు కూడా నానాటికి ఎక్కువకావడం గమనించదగ్గ విషయం. ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల దృష్ట్యా ఒక కనీస సంపాదన ప్రమాణాన్ని అనుసరించి వీటి అవసరాలను నిర్ణయించి అందుకయ్యే వార్షిక వ్యయ అంచనాలను వేయాలి.

## నిర్వహణ, సంరక్షణ

"ఉపయోగం కోసం పుస్తకాలు" అనే సూత్రాన్ని అమలుచేయడానికి వివిధరకాల సంకలనాలను వ్యవస్థీకరించి, వర్గీకరణ, సూచీకరణ, అనుక్రమణీకరణ మొదలైన వాఙ్మయ ప్రక్రియలను కావించడానికి, ఆ విధంగా పఠన సామగ్రిని ఉపయోగం కోసం సిద్ధపరచడానికి, వాటిని భద్రపరచి సంరక్షించడానికి, అట్టలూడి చిరిగి శిథిలమయిన పుస్తకాలను, పత్రికలను మరమ్మత్తు, బైండు చేయడానికి కొంత వ్యయాన్ని కేటాయించాలి. ఈ వ్యయ నిర్ణయం సమస్యాత్మకమే. వార్షిక పఠన సామగ్రి కొనుగోలుకయ్యే వ్యయంలో కొంత శాతం ప్రకారం లేదా ప్రతి పుస్తకానికి ఇంత వ్యయమని కాని నిర్ణయించడం సమంజసం.

## లేఖనాది సామగ్రి, తపాలా

ఇవి నిర్వహణ సంబంధమైన ఖర్చులు. గ్రంథాలయ కార్య నిర్వహణలో నిత్యం అవసరమయ్యే ఉత్తర ప్రత్యుత్తరాలు, ప్రకటనలు తదితర కార్యకలాపాల్లో కార్యాలయ సామగ్రి, లేఖనాది సామగ్రి, అలాగే తంతి తపాలాలు, వాటికోసం అయ్యే ఖర్చులు తప్పనిసరిగా ఉంటాయి. గ్రంథాలయ అవసరాలు, కార్యవిధులు, సాధన సామగ్రి అవసరాలు, పూర్వానుభవం ఆధారంగా నిర్ణయించి అందుకయ్యే వ్యయాన్ని కూడా అంచనా వేయాలి.

## చిల్లర ఖర్చులు

పైన వివరించిన ఖర్చులతో పాటు దైనందిన కార్యనిర్వహణలో మరికొన్ని రకాల ఖర్చులెదురవుతాయి. ఇవి విక్రయదారులు పంపించే పుస్తకాల పార్శిళ్ళను విడిపించడానికి, హమాలీలకు, కూలీలకు అయ్యే ఖర్చులు, కార్యార్థం అక్కడికి ఇక్కడికి తిరగటానికోసం అవసరమయ్యే వాహన కిరాయిలు, మరమ్మత్తులు, భవన నిర్వహణలో ఏర్పడే ఖర్చులు (సబ్బు, ఫినాయిల్, చీపురులు) మొదలైనవిగా ఉంటాయి.

ఇవన్నీ ఆవర్తన వ్యయాంశాలు. అనావర్తన వ్యయాంశాలు కూడా ఉంటాయి. అవి ఈ కింద వివరించబడ్డాయి.

## ఆసనాదిసామగ్రి

గ్రంథాలయానికి కొనుగోలు చేసే వివిధ పఠన సామగ్రిని సక్రమంగా వ్యవస్థీకరించి, భద్రపరచి నిల్వచేయటానికి సొరుగులు, బీరువాలు, అవసరం. పుస్తక సంకలనం పెరిగే కొలది వీటి అవసరాలు కూడా పెరుగుతాయి. అందుచేత సంకలనాభివృద్ధికి అనువుగా వీటి అవసరాలను అంచనా వేసి అందుకవసరమయ్యే ద్రవ్యాన్ని నిర్ణయించాలి. వీటితో పాటు సూచీ పేటికలు, కార్డెక్స్‌లు మొదలైన సామగ్రి కూడా కొనుగోలు చేయడం తరచూ అవసరమవుతుంది. అలాగే సిబ్బందికి తమ పనులను సులభంగా నిర్వర్తించటానికి బల్లలు, కుర్చీలు, బీరువాలు మొదలైన వాటి అవసరం కూడా క్రమంగా ఎక్కువకావడం తటస్థిస్తుంది. గ్రంథాలయం అభివృద్ధి చెందే సంస్థ కాబట్టి ఉపయోక్తల సంఖ్య కూడా విరివి చెందడం, వారి సదుపాయాలకోసం అసనాది సామాగ్రిని తరచూ అదనంగా కల్పించటం తప్పనసరి. ఈ విధమైన ఖర్చులను అప్పుడప్పుడు అంచనా వేసి వ్యయాన్ని నిర్ణయించాలి.

## యంత్రాలు, ఉపకరణాలు

ప్రతి కార్య రంగంలోను శాస్త్రీయత ప్రధానాంశం. అందుచేత గ్రంథాలయ నిర్వహణలో కొంతైనా కొంత యంత్రసామగ్రి అవసరం ఏర్పడటం సహజం. ఈ విధంగా సమకూర్చుకోవలసిన యంత్ర సామగ్రులలో టైపురైటరు, డూప్లికేటర్, ఫోటో కాపీయింగ్ మెషిన్, కార్డు డూప్లికేటర్, వాక్యూమ్ క్లీనర్, బైండింగ్ యంత్రపరికరాలు, మైక్రో ఫిల్మ్ కెమెరాలు, రీడర్లు, ప్రొజెక్టర్లు, క్యాసెట్ రికార్డర్లు మొదలైన వాటితో బాటు కంప్యూటర్ల వాడకం కూడా సహజమైన అవసరాలుగా ఏర్పడుతున్నాయి. గ్రంథాలయ పరిమాణం, లక్ష్యం, సేవా ప్రణాళిక మొదలైన వాటిని దృష్టిలో పెట్టుకొని ఈ వివిధ యంత్ర పరికరాల అవసరాన్ని గుర్తించి వాటి కొనుగోలు కయ్యే ఖర్చులను నిర్ణయించాలి. వీటి నిర్వహణ కయ్యే ఖర్చులు ఆవర్తన వ్యయంలో చూపించాలి.

## భవనం

గ్రంథాలయం నిత్య నూతనంగా పరివృద్ధిచెందే సజీవసంస్థ. కాలక్రమంలో గ్రంథాలయ పఠన సామగ్రి విస్తరణకు అనువుగా సిబ్బంది వృద్ధి కావటం, సేవార్థుల సంఖ్య అభివృద్ధి చెందటమే కాకుండా గ్రంథాలయ సేవలు విస్తరించటం, నిర్వహణలో నూతనంగా శాఖలు ఏర్పడటం జరుగుతుంది. అందుచేత భవనం కూడా విస్తరించాలి. ఈ విస్తరణలో వివిధ కార్యక్రమాలకు, సేవలకు అవసరమయ్యే విధంగా గ్రంథాలయ భవనాన్ని విస్తరింప జేయడం, అలాగే భవిష్యత్తులో చేపట్టదలచిన కార్యకలాపాలకు అస్కారమేర్పరచటం తప్పనిసరి. అంటే ఇందుకోసమని ప్రణాళికలను రూపొందించడం, అందుకయ్యే ఖర్చును నిర్ణయించడం జరగాలి.

## ఆర్థిక ప్రమాణాలు

ఇంతవరకు కావించిన వ్యయాలకు కొన్ని తార్కిక ప్రమాణాలు ఉన్నప్పుడే ఆర్థిక అంచనాలకు వాస్తవికత ఏర్పడుతుంది. సామాన్యంగా మూల సంస్థలు ఖర్చు చేసే మొత్తంలో కొంత శాతాన్ని గ్రంథాలయాలకు కేటాయించడం సబబైన పద్ధతిగా కనిపిస్తుంది. అయితే, ఈ కేటాయింపు ఏ ప్రమాణంలో ఉండాలి అనేది ముఖ్య విషయం. ఈ విషయమై వివిధ అభిప్రాయాలున్నాయి.

సిన్హా కమిటీ (1958) చేసిన సూచన ప్రకారం పౌర గ్రంథాలయాల నిర్వహణ కోసం రాష్ట్ర ప్రభుత్వం 6 పైసలు గ్రంథాలయ శిస్తును అమలుపరచడం, కేంద్ర ప్రభుత్వం అందుకు సమానమైన ఆర్థిక నిధులను సమకూర్చడం, అలాగే రాష్ట్ర ప్రభుత్వం కూడా తత్సమాన మైన ఆర్థిక నిధులను అందించడం జరగాలి. క్రమేపీ (25 సంవత్సరాల కాలంలో) ఈ నిధులను మూడింతలుగా వృద్ధి చేయడం సబబని కూడా సూచించడమైంది.

రంగనాథన్ సూచన ప్రకారం—మొత్తం బడ్జెట్ నుండి 10 శాతం, విద్యాశాఖ బడ్జెట్ నుండి 6 శాతం సొమ్మును రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలనుండి గ్రంథాలయాలకు సంక్రమించాలి.

రాధాకృష్ణన్ కమీషన్ కూడా ఈ ధోరణిలోనే విశ్వవిద్యాలయ గ్రంథాలయ ఆర్థిక విషయమై కొన్ని సూచనలు చేయడం జరిగింది. విశ్వవిద్యాలయం బడ్జెట్‌లో 6.25 శాతం కానీ లేదా ప్రతి విద్యార్థికి రూ॥ 40/-ల వంతున, అలాగే ప్రతి ఉపాధ్యాయునికి మరికొంత ఖర్చు పెట్టాలని సూచన చేయడం జరిగింది.

1966లో కొఠారి కమీషన్ కూడా 6.25 శాతం నుండి 10 శాతం వరకు కేటాయింపు చేయడం సరియని సిఫారసు చేసింది. పై విధంగానే

ప్రతి విద్యార్థికి రూ॥ 25/- చొప్పున, ప్రతి ఉపాధ్యాయునికి రూ॥ 300/-ల చొ॥న నిధులను సమకూర్చడం ప్రత్యామ్నాయ సూచనగా సిఫారసు చేయడమైంది.

1959తో వెలువడిన యు.జి.సి. కమిటీ రిపోర్టు ప్రకారం ప్రతి విద్యార్థికి రూ॥ 15/-ల చొ॥న ప్రతి ఉపాధ్యాయునికి రూ॥ 200/-ల చొ॥న వ్యయాన్ని నిర్ణయించవలసిందని సూచించడమైంది. గ్రంథాలయాని కయ్యే మొత్తం ఖర్చులో 4/5 భాగాన్ని యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్, మిగిలిన 1/5 భాగాన్ని రాష్ట్ర ప్రభుత్వం భరించాలని కూడా సిఫారసు చేయడం జరిగింది.

బ్రిటిష్ విశ్వవిద్యాలయ గ్రంథాలయాల సంబంధమై 1967 పేరి కమిటీ, మొత్తంలో 6 శాతం గ్రంథాలయాలకు కేటాయించాలని నిర్ణయించింది.

ఈ వివిధ నిర్ణయాలు, సిఫారసులు కాలం చెల్లించినవి. అంతే గాకుండ వీటికి సరియైన తార్కిక ప్రమాణాలు కూడా లేవు. చాలావరకు ఈ సిఫారసులు సంకలన నిమిత్తం చేయవలసిన ఖర్చుల విషయాన్నే ప్రస్తావిస్తున్నాయి. సామాన్యంగా గ్రంథాలయ ఆదాయ వ్యయాల నిర్ణయం అన్ని అంశాలను కూడా గణనలోకి తీసుకోవాలి.

అవసరాలను బట్టి, ధరలను బట్టి, అనుభవాన్ని బట్టి నిర్ణయించడం జరగాలి. అలాగే ఏ శీర్షికకు ఏ ప్రమాణంలో వ్యయాన్ని నిర్ణయించాలనేది కూడా ముఖ్యం. ఈ విషయమై అనుభవజ్ఞులైన గ్రంథాలయ శాస్త్రజ్ఞుల సూచనలను పరిశీలించడం అవసరం.

## పౌర గ్రంథాలయ బడ్జెట్

1950లో రంగనాథన్ గ్రంథాలయం మొత్తం బడ్జెట్‌లో 50 శాతం సిబ్బందికి, మిగతా 50 శాతం సంకలనాభివృద్ధికి, తదితరాలకు ఖర్చు చేయడం సబబని సూచించారు. 1957లో నియామకమైన సిన్హా కమిటీ కూడా దీనిని ఆమోదించింది. 1957లో వెలువడిన అమెరికన్ లైబ్రరీ డైరెక్టరీ ప్రకారం 70 శాతం సిబ్బంది వేతనాలకు, 15.7 శాతం పఠన సామగ్రికి, 14.3 శాతం ఇతర ఖర్చులకు కేటాయించబడింది.

ఈ రెండు సూచనలకు పూర్వం 1932లో బి.యం. హెడికార్ ఈ కింది విధమైన కేటాయింపును సూచించారు. ఆ ప్రకారం వేతనాలకు 44 శాతం; పుస్తకాలకు 17 శాతం; పత్రికలు మొదలైన వాటికి 4 శాతం; బైండింగ్‌కు 6.7 శాతం; అద్దెలు, అప్పులు మొదలైనవి 8.2 శాతం; ఇతర ఖర్చులకు 20 శాతం.

కానీ, పేకీ కమిటి రిపోర్టు ననుసరించి ఈ సూచనలను సవరించడం జరిగింది. ఆ ప్రకారం సిబ్బందికి 50 శాతం; పుస్తకాలకు 30 శాతం; ఇతరాలు 20 శాతం; (ఇందులో పుస్తకాలకు కేటాయించిన 30 శాతంలో 23.75 శాతం గ్రంథాలకు, 2.5 శాతం పత్రికలకు, 3.75 శాతం బైండింగ్‌కు విభజించడం జరిగింది.)

మిట్టల్ సూచన ప్రకారం వేతనాలకు 50 శాతం; పుస్తకాలకు 20 శాతం; పత్రికలకు 5 శాతం; బైండింగ్‌కు 5శాతం; విద్యుచ్ఛక్తి ఖర్చులు 2 శాతం; అద్దె, భీమా, మొదలైన వాటికి 5 శాతం; లేఖనాది సామగ్రి తదితరాలకు 13 శాతం పౌరగ్రంథాలయాల బడ్జెట్ కేటాయింపు ప్రమాణంగా చెప్పవచ్చును.

## విద్యాలయ గ్రంథాలయ బడ్జెట్

గ్రంథాలయం స్వభావాన్ని బట్టి వ్యయవిధానం నిర్ణయించడం జరుగుతుంది. అందుచేత కళాశాల గ్రంథాలయాలకు, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు కూడా వేర్వేరు విధాలుగా వ్యయ ప్రమాణాలను సూచించడమైంది. 1959లో యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ నియమించిన లైబ్రరీ కమిటీ నివేదికలో విశ్వవిద్యాలయ గ్రంథాలయం మొత్తం నిధిలో 50 శాతం సిబ్బందికి, మిగతా 50 శాతం పుస్తకాలు, పత్రికలు, ఇతర అంశాలకు కేటాయించవలసిందిగా సూచించింది.

1965లో రంగనాథన్, **Academic Library system - Fourth Plan Period** అనే వ్యాసంలో 50 శాతం సిబ్బంది ఖర్చులకు, 40 శాతం పఠన సామగ్రి కొనుగోలుకు, 10 శాతం బైండింగ్ తదితర ఖర్చులకు విభజించారు.

జేమ్స్ థామస్ సిబ్బందికి 50 శాతం; పుస్తక సామగ్రికి 40 శాతం; బైండింగ్‌కు 5 శాతం; ఇతరాలకు 5 శాతం కేటాయించారు.

ఈ సూచనలన్నిటిని క్రోడీకరించి వేతనాలకు 50 శాతం; పుస్తకాలకు 20 శాతం; పత్రికలకు 13 శాతం; బైండింగ్‌కు 7 శాతం; విద్యుచ్ఛక్తి, దీపాలు మొదలైన ఖర్చులకు 3 శాతం; లేఖనాది సామగ్రి, తదితరాలకు 7 శాతం సరియైన ప్రమాణమని మిట్టల్ తన అభిప్రాయాన్ని సూచించారు.

## ఉపసంహారం

విపరీతంగా పెరుగుతున్న పుస్తక ధరలను, పత్రిక చందాలను, అలాగే జీత భత్యాల పెంపుదల మొదలైన అంశాలను దృష్టిలో ఉంచుకొని పై ప్రమాణాలను పునః పరిశీలించినట్లయితే ఇవి అసంతృప్తికరంగా

ఉన్నట్లు విశదమవుతుంది. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ మంజూరు చేసే నిధులను కూడా గమనిస్తే ఈ విషయం మరింత రూఢికాగలదు. మచ్చుకు శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ గ్రంథాలయ నిధి పరిస్థితిని పరిశీలిద్దాం. అయిదవ ప్రణాళికా కాలంలో లభ్యమైన మొత్తం యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ పిరాళం రూ. 50 లక్షలు. ఈ మొత్తంలో గ్రంథాలయానికి 4.4 లక్షల రూపాయలు కేటాయింపడమైంది. ఈ ప్రకారం ఇది 8 శాతం మాత్రమే. ఆరవ ప్రణాళికా కాలంలో గ్రంథాలయానికి కేటాయించిన నిధి మొత్తం విశ్వవిద్యాలయ గ్రాంటులో 6.25 శాతం మాత్రమే. ఇంచుమించు ఇతర విశ్వవిద్యాలయాల గ్రంథాలయాల నిధి విరాళాల విషయం కూడా ఈ విధంగానే కనిపిస్తుంది. ఈ నిధులు కేవలం పఠన సామగ్రి సంకలనానికి మాత్రమే వర్తిస్తాయి. అయినప్పటికీ ఈ నిధులు సరిపోవడం లేదనే అభిప్రాయం కూడా కనిపిస్తుంది.

అనుభవంలో విశదమయ్యే విషయమేమిటంటే—ప్రస్తుత ధరల దృష్ట్యా గ్రంథాలయానికి మొత్తం బడ్జెట్‌లో కనీసం 16.25 శాతమైనా ఉండాలి. ఈ గ్రంథాలయ నిధిని అనుభవం దృష్ట్యా ఈ కింది విధంగా కేటాయించవచ్చును.

| | |
|---|---|
| సిబ్బంది వేతనాలు | 50 శాతం |
| పత్రికలు | 30 శాతం |
| పుస్తకాలు | 10 శాతం |
| ఆచూకీ గ్రంథాలు | 5 శాతం |
| బైండింగ్ | 2 శాతం |
| లేఖనాది సామగ్రి, ఉపకరణాలు | 2 శాతం |
| ఇతర ఖర్చులు | 1 శాతం |

## నమూనా బడ్జెట్ :

పైన వివరించిన కేటాయింపు ప్రకారం ఈ క్రింది నమూనా ఉదహరించడ మైంది.

విశ్వవిద్యాలయ వార్షిక నిధి 1 కోటి రూపాయలైతే గ్రంథాలయ బడ్జెట్ 6.25 శాతం ప్రకారం 16.25 లక్షల రూపాయలు ఉండాలి. ఈ మొత్తం దిగువ చూపించిన విధంగా విభజించడం జరగాలి.

| | | |
|---|---|---|
| సిబ్బంది | 50 శాతం | (రూ. 8,12,500) |
| పత్రికలు | 30 శాతం | (రూ. 4,87,500) |
| పుస్తకాలు | 10 శాతం | (రూ. 1,62,500) |
| ఆచూకీ గ్రంథాలు | 5 శాతం | (రూ. 81,250) |
| బైండింగ్ | 2 శాతం | (రూ. 32,500) |
| లేఖనాది సామగ్రి ఉపకరణలు | 2 శాతం | (రూ. 32,500) |
| ఇతరాలు | 1 శాతం | (రూ. 16,250) |

ఇది కేవలం సూచన మాత్రమే. ప్రతి గ్రంథాలయంలో అనుభవం మేరకు ముందు సంవత్సరం ఖర్చులనాధారంగా తర్వాతి ఏళ్ళను, వాటి వ్యయ ప్రమాణాలను నిర్ణయించడం జరగాలి. అయితే ఇవి ఆమోదయుక్తంగా ఉండటానికి కొన్ని కనీస ప్రమాణాలు జాతీయ స్థాయిలో తప్పనిసరిగా రూపొందించడం జరగాలి. మనం ఉదహరించే ప్రమాణాలు కాలం చెల్లినవి. ప్రస్తుత పరిస్థితులకు సరిపడనివి. ఈ విషయమై వృత్తి పాలకులు తగిన చర్య తీసుకోవడం సమంజసం.

—(o)—

యం. సూర్యదుర్గ

# 1.4 పుస్తక సేకరణ : నిర్ణయ ప్రమాణాలు

గ్రంథాలయం అనగానే మన ఊహలోకి వచ్చేది, అనేకమైన పుస్తకాలు, వాటిని సక్రమంగా అమర్చిన బీరువాలు, ఈ బీరువాలతో నిండిన గది లేదా భవనం. గ్రంథాలయం పవిత్రమైన సరస్వతీ మందిరం అంటే అతిశయోక్తి కాదేమో! ఈ మందిరాన్ని నింపి అలంకరించ టానికి అవసరమయ్యే గ్రంథాల సేకరణ చాలా కష్టమైనపని. వేలాది ప్రచురణ సంస్థలు, పుంఖాను పుంఖంగా వెలువడే రచనల కారణంగా ఈ రోజుల్లో పుస్తక ఎంపిక, సేకరణ, అందుకు కావలసిన ప్రమాణాలు నిర్ణయించటం అంత తేలికపని కాదని నా అభిప్రాయం. పుస్తక సేక రణకు ఆలోచన, విచక్షణ, చదువరులతో పరిచయం మొదలయినవి కావాలి.

గ్రంథాలయాలన్నీ ఒకే తెగకు చెందవు. బాలల గ్రంథాలయాలు, పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, వృత్తివిద్యాసంస్థలు, శాస్త్రపరిశోధనాసంస్థలు, బ్యాంకులు, ఇతర అధికార-అనధికార కార్యా లయాలు, సంస్థలు నిర్వహించే గ్రంథాలయాలు-ఇంకా ఎన్నో విధాలు. ఇవి వేటికవే తమతమ తరహాకు చెందుతాయి. పైనుదహరించిన అన్ని గ్రంథాలయాల్లోను అన్ని రకాల పుస్తకాలను సేకరించవలసిన అవసరం లేదు. బాలల గ్రంథాలయాల్లో బాలల మానసిక వికాసానికి పనికివచ్చే సులభశైలి, పెద్దచ్చు పుస్తకాలకే ప్రాముఖ్యత ఎక్కువ. నీతి కథలు, బొమ్మల పుస్తకాలు పిల్లలకు ఆసక్తిని కలిగిస్తాయి, ప్రేరణను చేకూరు స్తాయి, ఆదర్శాలను పెంపొందిస్తాయి. బాలసాహిత్యరచనకు పిల్లల

మన స్తత్వ అవగాహన ఎంత ముఖ్యమో, బాలసాహిత్య సమీకరణకు కూడా అది అంతే ప్రధానం. మన పాఠశాలల్లోను, కళాశాలల్లోను 90 శాతం పుస్తకాలకే ప్రాధాన్యత హెచ్చు. విద్యార్థులకు ఈ దశ మానసికంగాను, శారీరకంగాను ఎదిగి వ్యక్తిత్వాన్ని సాధించుకొనే ప్రాయం. కనుక ఈ వయస్సులో వారు చదివేది, చూచేది అన్నీ మనస్సుకు హత్తుకొని చెరగని ముద్ర వేస్తాయి. ఈ వయస్సులో మహాత్ముల చరిత్రలు, దేశభక్తిని, ధైర్య సాహసాలను, ఆలోచనాశక్తిని పెంపొందించే రచనలు చదవడం ముఖ్యం. నేటి బాలలే రేపటి పౌరులుకదా! భావి పౌరులకు, నేతలకు కావలసిన పునాది విద్యార్థి దశలోనే ఏర్పడే అవకాశం కలిగించాలి. ఈ దశలో చదువరులకు కావలసిన పుస్తకాలను సేకరించి అందించటంలో గ్రంథాలయాధికారి బాధ్యత ఒకింత ఎక్కువే అని చెప్పాలి. ఈ దశలో విద్యార్థులు చదువ వలసిన పుస్తకాలను ఓర్పుతో పరిశీలించి, అవసరమని పిస్తే కొన్నిసార్లు స్వయంగా చదివి మరీ ఎన్నుకోవాలి. హింసను, అవి నీతిని, దుష్ప్రవర్తనను ప్రోత్సహించే పుస్తకాలను వీరి దరిదాపులకు కూడా రానీయరాదు.

వ్యక్తిత్వసాధనతో బాటు సృజనాత్మక దృష్టి, విషయాన్వేషణ, సత్యనిరూపణ మొదలైన వాటికి తోడ్పడే ఉప పఠనకు కూడా అవకాశం కలిగించాలి. అంటే, స్వయం పఠనకు కూడా ప్రోత్సాహం, సదుపాయం కలిగించాలి. విశ్వవిద్యాలయాలు, పరిశోధనా సంస్థలు నిర్వహించే గ్రంథాలయాలు అపారమైన జ్ఞానసంపదకు నిలయాలు. ఏ విషయాన్ని తీసుకున్నా 'అ' నుండి 'హ' వరకు పూర్తి వివరాన్ని, సంపూర్ణ విజ్ఞానాన్ని అందజేయటానికి ఈ గ్రంథాలయాలు సిద్ధంగా ఉండాలి. ఈ విధ గ్రంథాలయాలను తీర్చిదిద్ది నిర్వహించటం కష్టదాయకమే అయినా ఇది ఆసక్తిదాయకమైన విషయం, బాధ్యత. సమస్త విషయాల మీద ప్రామాణిక రచనలను సేకరించాలి. అరుదైన పుస్తకాలను అత్యుత్తమస్థాయి పుస్త

కాలను, అలాగే అత్యంతోపకర పుస్తకాలను సేకరించి పాఠకులకు అంద చేయటం ఎంతో సంతోషదాయకం. ఉన్నత విద్యా ప్రమాణాలుగల గ్రంథాలను సేకరించటం, వాటిని భద్రపరచి సేవలందించటం ద్వారా గ్రంథాలయాధికారి శ్రద్ధాసక్తులు, ప్రతిభ వ్యక్తమవుతాయి.

వృత్తి విద్యా సంస్థల్లోని గ్రంథాలయాల్లో ఆసంస్థల్లో నేర్పబడే వృత్తి విద్యలకు సంబంధించిన గ్రంథాలకే ఎక్కువ ప్రాధాన్యతనీయాలి. బ్యాంకులు, కార్యాలయాలు మొదలైన వాటికి చెందిన గ్రంథాలయాల్లో కూడా వివిధ శాఖలకు సంబంధించిన పుస్తకాలనే ఎంపిక చేయాలి. ఆయా శాఖల్లో నిష్ణాతులు కావటానికి శిక్షణ అనుభవంతో పాటు విస్తృత గ్రంథపఠనం కూడా ముఖ్యం.. ఈ కార్యాలయాల్లో శ్రమవల్ల కలిగే అల సటను పోగొట్టటానికి తేలిక రచనలు కూడా కొంత అవసరం. ఆ సంస్థల్లో పని చేసే వ్యక్తుల అవసరాల్ని, అభిరుచుల్ని, అక్కడి వాతా వరణాన్ని బట్టి వారికి సేదతీరేలా చేయటానికి సేకరించే పుస్తకాలు వృథా కావు.

జిల్లా గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు, సంచార గ్రంథా లయాలు మొదలైన పౌర గ్రంథాలయాలు అన్ని వర్గాలప్రజలకు అందు బాటులో ఉంటాయి. కనుక ఈ గ్రంథాలయాలకు పుస్తక సేకరణ మరింత విశిష్టంగాను, సంశ్లిష్టంగాను ఉంటుంది. స్థానిక వర్గాల మేళ నానికి అనుగుణంగా వివిధ భాషల్లో, వివిధ విషయాల్లో, వివిధ స్థాయిలలో రకరకాల పుస్తక సేకరణ చేయాలి. ఒక విధంగా పౌర గ్రంథాలయ సంకలన సమీకరణలు గురుతర బాధ్యతలను నిర్దేశిస్తాయి. ఇది సవాలు వంటిది.

అందుచేత పుస్తక సమీకరణ ప్రధానవిధి. కీలకాంశం. రంగ నాథన్ (గ్రంథాలయ పిత) ప్రతిపాదించిన పంచసూత్రాలను అన్వ

యించి చదువరులకోసం ఉపయోగపడే పుస్తకాలనే సేకరించాలి. సద్గ్రంథ పఠనం, సత్సాంగత్యం మొదలైనవి వ్యక్తి అభివృద్ధికి దోహదాలు. శాస్త్ర పరిశోధనా గ్రంథాలయంలో పురాణాలు, బాల గ్రంథాలయంలో నవలలు హాస్యాస్పదం. అదే విధంగా కార్యాలయాల గ్రంథాలయాల్లో పాఠ్య పుస్తకాలు, ప్రతి చదువరికి కావలసిన పుస్తకం అందించడం, సేకరించిన ప్రతి పుస్తకానికి ఒక చదువరిని జత గూర్చటం పుస్తక సేకరణలో ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన సూత్రం. తామర తంపరగా పుస్తక ప్రచురణ జరుగుతున్న ఈ రోజుల్లో ఏ గ్రంథాలయానికి ఏ పుస్తకం అవసరమో నిర్ణయించటం చిక్కే. అందువల్ల పుస్తక సేకరణ, దానికి తగిన ఉద్దేశ్యాలు, విధానం, ప్రమాణాలు మొదలైన విషయాలను గ్రంథాలయాధికారి, గ్రంథాలయ సంఘ సభ్యులతో కలిసి నిర్ణయించటం సబబు.

—(౦)—

వై. నాగిరెడ్డి

డా॥ టి. ఎ. వి. మూర్తి

# 1. 5 పుస్తక సేకరణ: నిర్ణయ ప్రవాహాలు

"అరువదినాల్గు విద్యలు నొక్కచో నేర్వ
దగు నిలయంబు గ్రంథాలయంబు
దరిలేని దుఃఖసాగరముల నీదంగ
ధరణి తుల్యంబు గ్రంథాలయంబు
బుద్ధి మదగ్రగుల్ పూర్వులొసంగిన
ధన నిదానంబు గ్రంథాలయంబు
అజ్ఞాన తిమిర సంహారంబు గావించు
నర్క తేజంబు గ్రంథాలయంబు
యశమె కాయంబు గాగల ప్రాజ్ఞ సుకవి
బృందముల రూపముల ప్రదర్శించి జనుల
గరము సమ్ముదితాత్ములగా నొనర్చు
నట్టి సన్మందిరంబు గ్రంథాలయంబు"

—పాతూరి నాగభూషణం

'ఉపయోగం కోసం పుస్తకాలు' - ఇది నేటి గ్రంథాలయాల ఆదర్శం. ఈ ఆదర్శ సాధనకోసం, చదువరుల విజ్ఞాన సమాచార అవసరాలను ఆదుకోవటం కోసం, ఏర్పాటైన పుస్తక సంకలనాలు, ఆ విధంగా ఏర్పడిన సంస్థలు మాత్రమే గ్రంథాలయాలుగా పేర్కొన బడతాయి.

కానీ, గ్రంథాలయాలు తొలిదశలో కేవలం పుస్తక సామగ్రిని నిల్వచేసి జాగ్రత్తపరచడం మాత్రమే ప్రధాన లక్ష్యంగా ఏర్పడ్డాయి. కాలక్రమంలో వచ్చిన సాంఘిక ప్రభావాలు, పరిణామాలు, దృక్పథాలు కారణంగా అవి సాంఘిక సంస్థలుగా, పఠన మందిరాలుగా మారడం జరిగింది. అంటే సాంస్కృతిక విషయంలో వచ్చిన మార్పు ఇందుకు ప్రధాన కారణం. ఇంతేకాదు—ఒకప్పుడు మట్టిపలకలు, శిలలు, లోహపు రేకులు, పేపిరస్, తాళపత్రాలు మొదలైనవి గ్రంథాలయాల్లో పఠనా వస్తువులు. మానవుని మేధా సంపత్తి వృద్ధి చెందటంతో నేడు కాగితం తదితర వినూతన వస్తు రూపాలెన్నో వచ్చాయి. అలాగే ముద్రణ తదితర సాంకేతికాలు, కంప్యూటర్, టెలికమ్యునికేషన్స్ కూడా పాత పరిస్థితిని మార్చివేశాయి. అందుచేతనే నేడు పఠన సామగ్రిని అందరికీ అందుబాటు లోనికి తీసుకువచ్చి వాటి ఉపయోగాన్ని పెంపొందించడం కూడా సాధ్యమైంది. ఈ కారణం చేతనే నేటి గ్రంథాలయాలు సేవా సంస్థలుగా విజ్ఞాన కేంద్రాలుగా, సాంఘిక సంస్థలుగా రూపుదిద్దుకోవడం జరిగింది.

నేటి గ్రంథాలయాలు ప్రతిమనిషికి ఎన్నో విధాల అవసరమనిపించే విజ్ఞాన సమాచారాలను సేకరించి ఎప్పటికప్పుడు అందించడమే ప్రధాన విధిగా వ్యవహరిస్తున్నాయి. ఇది కూడా కాలప్రభావమే. ఉదా॥ ఒక చదువరి తనకవసరమైన వాఙ్మయ వివరాల కోసం కొన్ని వేల మైళ్ళ దూరంలో ఉండే వాఙ్మయ దత్తాంశ పీఠాలను సరాసరి సంప్రదించటం, ఆ విధంగా విషయాన్ని సేకరించటం సాధ్యం. ఇందుకు ఎక్కువ కాలాన్ని వ్యయపరచ వలసిన అవసరం కూడాలేదు. ఈ సౌకర్యం సమాచార సంసర్గ సాంకేతికాల అనువర్తనం వల్ల వీలైంది.

సామాన్యంగా ప్రతి గ్రంథాలయంలోను ఈ కింద వివరించిన సేవలు ప్రధానంగా నిర్వహించబడతాయి.

1. వాఙ్మయ సేవలు(పుస్తకసేవలు, వాఙ్మయ సూచీల తయారీ మొదలైనవి).
2. ఆచూకీ సేవలు (విచారణలకు సమాధానం, సమాచారం అందించటం, సలహాలివ్వటం మొదలైన వైయక్తిక సేవలు).
3. సారాంశీకరణ సేవలు (మూలపాఠ్యాలకు సంగ్రహరూపాలను తయారుచేయటం.).
4. సాధారణ తాజా సమాచారం, వైయక్తిక సమాచారం మొదలైన అనుక్రమణీకరణ సేవలు.
5. పునరుత్పత్తి సేవలు.
6. సమాచార ప్రాప్తి విషయ నిర్దేశక సేవలు.

ఈ సేవలను సులభంగా అందించడానికి గ్రంథాలయాల్లో సూచీకరణ, వర్గీకరణమొదలైన ప్రక్రియలు నిర్వహిస్తారు. సాంప్రదాయక పద్ధతిలోనే కాకుండా సాంకేతిక పరికరాల అనువర్తనలో, ముఖ్యంగా కంప్యూటర్ వాడకం వల్ల స్థానికంగానే కాకుండా ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో కూడా వివిధ సేవలను అందించటానికి సాధ్యమైంది అయితే ఈ సేవలకు పుస్తక సంకలనాలే ఆలంబనం.

గ్రంథాలయాల్లో పుస్తక సేకరణ విధానాలు, పద్ధతులు తెలుసుకునే ముందు గ్రంథాలయాలు ఎన్ని రకాలు? ఏ గ్రంథాలయాలు ఏ చదువరులకు ఏ విధంగా ఉపయోగపడతాయి? అనికూడా తెలుసుకోవాలి. గ్రంథాలయాలను మూడు రకాలుగా చెప్పవచ్చును : (1) పౌర గ్రంథాలయాలు (Public Libraries) ఇవి జనసామాన్యానికి ఉపయోగించే గ్రంథాలయాలు (2) విద్యా గ్రంథాలయాలు (Academic Libraries) ఇవి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, పరిశోధనకు ఉపయోగించే గ్రంథాలయాలు. (3) ప్రత్యేక గ్రంథాలయాలు (Special Libraries) ఇవి

శాస్త్రజ్ఞులు, పారిశ్రామిక సంస్థలవంటి ప్రత్యేక వర్గాలకు ఉద్దేశించిన గ్రంథాలయాలు.

గ్రంథాలయాలను విభజించినట్లే గ్రంథాలను కూడా వాటిలో చేయబడిన విషయ వ్యక్తీకరణ రూపాన్నిబట్టి మూడు రకాలుగా గ్రోగన్ వర్గీకరించాడు ;

1. ప్రాథమిక స్థాయి గ్రంథాలు (Primary Sources of Infoımation): పత్రికలు (Periodicals), సదస్సుల నివేదికలు (Conference Proceedings), పేటెంట్లు (Patents), ప్రమాణాలు (Standards), సిద్ధాంత వ్యాసాలు (Thes:s), వాణిజ్య సాహిత్యం (Trade Literature) మొదలైనవి ఈ తరగతికి వస్తాయి.

2. ద్వితీయస్థాయి గ్రంథాలు (Secondary Sources of Information): విషయ సూచీలు (Subject Bibliographies), వాఙ్మయ సూచీలు (Bibliographies) సార సంగ్రహాలు (Abstracts), పుస్తకాలు మొదలైనవి ఈ తరగతికి వస్తాయి.

3. తృతీయ స్థాయి గ్రంథాలు (Tertiary Sources of Iıformation) ; విజ్ఞాన సర్వస్వాలు (Encyclopaedias), నిఘంటువులు (Dictionaries) వార్షిక గ్రంథాలు (Year Books), డైరక్టరీలు మొదలైనవి ఈ తరగతికి వస్తాయి.

గ్రంథాలను వాటి ఉపయోగాన్నిబట్టి సాధారణ గ్రంథాలు (General Books), ఆకరాకీ గ్రంథాలు (Reference Books), అని కూడ వ్యవహరించడం సర్వ సాధారణంగా జరుగుతుంది.

ఒక గ్రంథాలయ గొప్పదనం భవనాన్నిబట్టి కాక అందులో భద్రపరచిన గ్రంథాలనుబట్టి, సిబ్బంది అందించే సేవలనుబట్టి నిర్ణయ మవుతుంది. ఆధునిక అవసరాలకు అనుగుణంగా గ్రంథాలయాల్లో పుస్తకాలే కాకుండా రాతప్రతులు, వార్తాపత్రికలు, కరపత్రాలు, మానపటాలు, మైక్రోఫిల్ములు, మైక్రోఫిష్, సౌండ్ రికార్డులు, మాగ్నటిక్ టేపులు, డిస్కులు, మొదలైన వివిధ రకాల పుస్తకేతర సామగ్రి కూడా అవసరం. ఈ అవసరాన్ని పలువురు ప్రముఖులు, దర్యాప్తు సంఘాలు గుర్తించటం జరిగింది.

## గ్రంథ సేకరణ విధానం

ఏ గ్రంథాలయమైనా దాని తరగతినిబట్టి పుస్తక సేకరణా విధానాన్ని అనుసరించాలి. ఒక భాషా ప్రాంత గ్రంథాలయం అదే భాషకు చెందిన పుస్తకాల సేకరణకు ప్రాముఖ్యత నిచ్చినప్పుడే దాని సేవలు ఎక్కువ మందికి ఉపయోగపడ్తాయి. పౌర గ్రంథాలయం సాధారణ పుస్తకాలను, విద్యా గ్రంథాలయాలు పాఠ్య పుస్తకాలను ఎక్కువగా సేకరించాలన్నది ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

ప్రపంచంలో ముద్రితమైన అన్ని గ్రంథాలను అన్ని గ్రంథాలయాలు సేకరించ లేవు. అందుచేత ప్రతి గ్రంథాలయం ఒక నిర్దిష్ట సేకరణా విధానం అనుసరించటం తప్పనిసరి. ఈ సేకరణా విధానంలో గ్రహించవలసిన ముఖ్యాంశాలు కొన్ని ఉన్నాయి. అవి :

1. మాతృసంస్థ ఉద్దేశ్యాలు, కార్యకలాపాలు.
2. భౌగోళిక పరిధి.
3. చదువరులు, వారి అవసరాలు, ఆసక్తి.
4. ఆర్థిక సంపత్తి.

5. నిధులు సమకూర్చే ప్రభుత్వం, ఇతర సంస్థలు వాటి విధానాలు, ఆశయాలు.
6. ద్రవ్యోల్బణం, ద్రవ్యమారకంలో వచ్చే సమస్యలు.
7. అత్యాధునిక ప్రచురణలు.
8. సూచీలు, తదితర వాఙ్మయ పరికరాలు.
9. పుస్తకాల కొనుగోలు విధానాలు.
10. సమీకరించిన పుస్తకాలకు స్థలవసతి, సిబ్బంది, సాధన సామగ్రి.
11. కొత్త పుస్తకాలను కాలయాపనంలేకుండా ఉపయుక్త పరచటం.
12. సమీప గ్రంథాలయాలతో సహకరించటం.

గ్రంథాలయాలు నిర్దిష్ట సేకరణ విధానాన్ని అనుసరించినట్లే పుస్తకాల ఎంపికలో కూడా కొన్ని ప్రామాణిక విధానాలను అనుసరించాలి. అప్పుడే గ్రంథాలయ స్థాపన ముఖ్యోద్దేశ్యం నెరవేరినట్లవుతుంది. ఎంపికలో అనుసరించాల్సిన సూత్రాలు :

1. పక్షపాతరహితంగా పుస్తకాల ఎంపిక జరగాలి.
2. "ప్రతి చదువరికీ పుస్తకం, ప్రతి పుస్తకానికీ చదువరి" అన్నట్లు చదువరులను తృప్తిపరిచే పుస్తకాలనే ఎంపిక చేయాలి. అట్లని అశ్లీల పుస్తకాలను ఎంపిక చేయరాదు.
3. పుస్తకాలు విజ్ఞానాభివృద్ధికి తోడ్పడాలి.
4 పాఠకుల విజ్ఞాన వికాసానికే కాకుండా వారికి మానసిక విశ్రాంతి నిచ్చే పుస్తకాలను కూడా ఎంపిక చేయాలి.
5. పుస్తకాల ఎంపిక ఆయా విషయాల్లో నిష్ణాతుల ద్వారా జరగాలి.
6. ఆర్థికవనరులను దృష్టిలో ఉంచుకొని పేపరు బాక్ ప్రచురణ కానీ, లైబ్రరీ ప్రచురణ కానీ ఎంపిక చేయాలి.

7. అత్యాధునిక సంస్కరణ (Latest Edition) లనే ఎంచుకోవాలి.
8. ఆచూకీ పుస్తకాల ఎంపికలో గ్రంథాలయాధికారి ప్రముఖ పాత్ర వహించాలి.
9. ప్రభుత్వ ప్రచురణలను ఎంచుకోవాలి.

## గ్రంథ సేకరణ పద్ధతులు

ఏ గ్రంథాలయమైనా పుస్తక సేకరణ పద్ధతులు ఒకే విధంగా ఉంటాయి:

(1) సరాసరి ప్రచురణ కర్తలనుండి సేకరణ (Direct ordering) పుస్తకాల ఎంపిక పూర్తి అయిన తర్వాత ఆ పుస్తకాలు గ్రంథాలయంలో ఉన్నవి లేనిది చూచి, లేని వాటికోసం ప్రచురణకర్తలను లేదా ప్రతినిధులను సరఫరా చేయమని కోరడం. ఈ పద్ధతిలో కొన్ని ఇబ్బందులున్నాయి:

1. గ్రంథాలయాలు కోరిన వెంటనే పుస్తకాలు లభ్యం కాకపోవడం.
2. ప్రచురణకర్తలు కాలయాపనం చేయడం.
3. రవాణా సౌకర్యాలు సరిగా లేక సేకరణలో జాప్యం జరగడం.
4. రవాణాలో పుస్తకాలు పాడవటం.
5. రవాణా ఛార్జీలు ఒక్కొక్కప్పుడు గ్రంథాలయాలే భరించాల్సి రావడం.
6. ధరలలో తేడాలు రావటం.
7. ద్రవ్యమార్పిడిలో వ్యత్యాసాలు రావడం.
8. ఉత్తర ప్రత్యుత్తరాలకు కాలం వృథా కావటం.
9. ఒక పుస్తకానికి బదులుమరొక పుస్తకం సరఫరా కావటం.

2) ఆమోదవిధానం (Approval Method) :

ఈ పద్ధతిలో పుస్తకాలను ఎంపిక కర్తలు, గ్రంథాలయాధికారులు స్వయంగా పరీక్షిస్తారు గాబట్టి మొదటి విధానంలోని ఇబ్బందులు ఉండవు.

3) పుస్తక ప్రదర్శనలు (Book Exhibition Method) :

పుస్తక విక్రేతలు, ప్రచురణకర్తలు నిర్వహించే పుస్తక ప్రదర్శనలను ఆధారం చేసుకొని ఎంపిక చేసుకోవడం.

4) బ్లాంకెట్ ఉత్తర్వు (Blanket order) :

ఒక ప్రచురణకర్త ఒక ఒప్పందం మేరకు తను ప్రచురించే పుస్తకాలను యథావిధిగా గ్రంథాలయానికి సరఫరా చేయటం.

5) స్థాయీ ఉత్తర్వు (Standing order) :

వార్షికాలు, ధారావాహికలు, బహుళసంపుటాలు మొదలైన ప్రచురణలు ఒకే ఉత్తర్వు మీద క్రమంగా సరఫరా కావటం.

6) మార్పిడి విధానం (Exchange Method) :

రెండు గ్రంథాలయాలు పరస్పరం వాటి ప్రచురణలను మార్చుకోవడం.

7. బహుమతులు (Gifts) :

కొన్ని సంస్థలనుండి, దానకర్తలనుండి పుస్తకాలను ఉచితంగా సేకరించడం.

8. అంతర్ గ్రంథాలయ అరువు (Inter - Library Loan) :

అవసరమైన పుస్తకాలను పరిమిత కాలానికి ఇతర గ్రంథాలయాల నుండి అరువు తెప్పించి ఉపయోగించిన తర్వాత వాపసు చేయటం.

## పత్రికల సేకరణ

పుస్తక సేకరణకు కాస్త భిన్నంగా పత్రికల సేకరణ ఉంటుంది. ఇది ముఖ్యంగా రెండు రకాలు : 1. చందాను ప్రచురణకర్తలకే జమ

చేయడం (Direct Payment): ఈ విధానంలో గ్రంథాలయాలు సరాసరి ప్రచురణ కర్తలకే డబ్బు చెల్లిస్తాయి. 2. ఏజంట్లద్వారా సేకరణ (Subscription Agent): ఈ విధానంలో గ్రంథాలయాలు కావల్సిన పత్రికలను ఒక ఏజంటుకు ముందుగా డబ్బు చెల్లించి సేకరించడం.

## గ్రంథ సేకరణలో సాధకబాధకాలు

1. ప్రస్తుత పరిశోధనలవల్ల సమాచారం విపరీతంగా వృద్ధికావడం 2. సమాచారం వివిధ భాషల్లోను, వివిధ ప్రాంతాల్లోను, వివిధ రూపాల్లోను ఉండటం. 3. సమాచారం అతి తక్కువ కాలంలోనే నిరుపయోగం కావటం. 4. ప్రభుత్వ విధానాలు నిరోధకాలుగా ఉండటం. 5. ద్రవ్యోల్బణం, ద్రవ్య మార్పిడి విధానాల్లో సమస్యలు. 6. పుస్తక సేకరణ విధానంలో లోపం. 7. సమిష్టి సేకరణ విధానం వ్యాప్తి చెందక పోవటం.

## పుస్తక సేకరణలో ప్రభుత్వాల పాత్ర

1. సమాచార సేవలవల్ల కలిగే లాభాలను గుర్తించి, ప్రభుత్వాలు గ్రంథాలయాల అభివృద్ధికి తగిన కృషి చేయాలి. 2. యునెస్కో, FID, IFLA వంటి అంతర్జాతీయ సంస్థలను భాగస్వాములుగా చేసి పుస్తక సేకరణ వేగంగా జరగటానికి సరియైన విధానాన్ని రూపొందించాలి. 3. ప్రస్తుతం ఉన్న దేశ విదేశీ గ్రంథాలయ అనుసంధానాలను బలపరచి పుస్తక సేకరణ వాని ద్వారా జరిగేలా చూడాలి. 4. గ్రంథాలయాలకు తగిన నిధులు సమకూర్చాలి. 5. నిధుల కొరతను, ద్రవ్యోల్బణాన్ని అతిక్రమించడానికి వివిధ గ్రంథాలయాల మధ్య సహకార సేకరణా విధానాన్ని ప్రోత్సహించాలి. 6. రవాణా సౌకర్యాలను వృద్ధిపరచి పుస్తకాలను రవాణాఛార్జీలనుండి సాధ్యమైన రీతిలో మినహాయించాలి. 7. విదేశాలనుండి సరాసరి పుస్తక సేకరణలో ఉత్పన్నమయ్యే ఇబ్బంది

లను అతిక్రమించడానికి బ్యాంకులకు పుస్తకాలు సరిగా పంపించేందుకు బాధ్యతను అప్పగించాలి. 8. ప్రతి గ్రంథాలయానికి తగిన వసతిని కలుగజేయాలి. 9. గ్రంథాలయాధికారులుగా తగిన అర్హతలు గలవారిని నియమించాలి. 10. సంఘంలో వారి గౌరవం ఉత్తమంగా ఉండేట్లు తగిన జీత భత్యాలు ఇవ్వాలి. 11. గ్రంథాలయాధికారుల సూచనలను పాటించాలి.

## ముగింపు

భారతదేశం అభివృద్ధిచెందుతున్న దేశం గాబట్టి గ్రంథాలయాలకు తగినన్ని నిధులు సమకూర్చడం కష్టం. BOSLA మాదిరి వివిధ ప్రాంతాల గ్రంథాలయాల మధ్య సహకారం పెంపొందించి "సమష్టిగా గ్రంథాలను సేకరించి, ప్రతి చదువరికి పుస్తకాన్ని అందించిననాడు, దేశ సౌభాగ్యాన్ని గ్రంథాలయాలను చూసి నిర్ణయించవచ్చు" అన్న నానుడి నిజమవుతుంది. నాటి నలంద, తక్షశిల చారిత్రక వైభవాన్ని తిరిగి సంపాదించవచ్చును.

—(o)—

జె. యాదగిరి రెడ్డి

ఎస్. సుదర్శన్ రావు

# 1. 6 పుస్తక సమీకరణలో గ్రంథాలయాల ఆర్థికావసరాలు

గ్రంథాలయాలు వాఙ్మయ-సాహిత్య సేవా సంస్థలు. సామాజిక మార్పుల కనుగుణంగా వీటి సేవాలక్ష్యాలు, సేవలు, సేవావిధానాలు కూడా మారుతూ వస్తాయి. ఈ కారణంగానే నేటి గ్రంథాలయాల ఆశయం మారటం, వాటి అవసరాలు పెరగటం, ప్రజల సాంస్కృతిక విజ్ఞానాది అవసరాలు ఎక్కువ కావడం, ఆ విధంగా గ్రంథాలయాలకు ఇంతకు పూర్వం లేనంత గిరాకి ఏర్పడటం కూడా జరిగింది. అయితే కావలసినన్ని నిధులు సమకూర్చినప్పుడే గ్రంథాలయాలు తమ లక్ష్యాలను సాధించటానికి, సేవా కార్యక్రమాలను చేపట్టటానికి, విషయ-విజ్ఞాన వత్తిడులను తట్టుకోవడానికి సాధ్యమవుతుంది.

"గ్రంథాలయం ఒక పెరిగే సజీవ సంస్థ". ఈ పెరుగుదల పరిమాణాత్మకం-గుణాత్మకం. పుస్తక సంకలనం, భవనం, సిబ్బంది, ఆసనాదిసామగ్రి, ఇతర భౌతిక సదుపాయాలు, వీటితోబాటు ఉపయోక్తలు మొదలైన అంశాలు క్రమంగా సంఖ్యాపరమైన వృద్ధిని, అందుకోవటమే కాకుండా సేవాలక్ష్యాలు, సేవావసరాలు, సేవలు, వాఙ్మయ ప్రక్రియలు, పరికరాలు, తత్సంబంధమైన వత్తిడులు ఎండా అధికమవుతాయి.

ఈ విధాల పెరుగుదలలు వాటంతటవే ఆర్థిక ప్రమేయం లేకుండా అంటే ఈ పెరుగుదలకు సమానంగా వ్యయాన్ని కూడా పెంచాలి. ఇందుకు అవసరమయ్యే నిధులను సమకూర్చుకోవటం ఒక పెద్ద సమస్య అయితే ద్రవ్యోల్బణం, అలాగే అధికాధికంగా పెరిగే ధరలు మరో సమస్య.

గ్రంథాలయాలు నిర్వర్తించే సకలవిధ సేవలకు పుస్తకాలే మూలం. అంటే, పుస్తక సంకలన పరిమాణం, దాని విశిష్టత మీద సేవలు ఆధారపడి ఉంటాయి. అందుకని ఎక్కువసొమ్మును పుస్తక సమీకరణకు కేటాయించి ఎక్కువ సంఖ్యలో పుస్తకాలను సేకరించటం కూడా సరియైన పని కాదు. దీనివల్ల ఇతర అంశాలు నిర్లక్ష్యంప బడటం, ఆవిధంగా ఎన్నోరకాల అసంతృప్తికర పరిణామాలు ఏర్పడటం జరుగవచ్చును. స్థలాభావం, ఆసనాది సామగ్రి కొరత, సిబ్బంది తక్కువ కావడం మొదలైన సంకట పరిస్థితులు ఏర్పడటం, అలాగే ఇతర విషయాల్లో కూడా చాలీచాలని విషమస్థితులు ఏర్పడటం సంభవించవచ్చును. ఈ లోపాలను మాపటానికి మరింతధనం ఈ అంశాల మీద కూడా ఖర్చుచేయవలసి వస్తుంది. అంటే ఆర్థికవనరులను గరిష్ఠస్థాయిలో సాధించాలి. అందువల్ల గ్రంథాలయ ఆదాయవ్యయ విషయంలో మెలకువ అవసరం. ఖర్చులు కొన్ని ప్రమాణాల మేరకు అభిలషణీయమైన విధంలో నిర్ణయించటం తప్పనిసరి.

వ్యయాంశాలు, వ్యయ ప్రమాణాలు కూడా గ్రంథాలయాలకు సమకూరే ఆర్థికసంపత్తికి అనువైన విధంలో ఉండటం సమంజసం. సామాన్యంగా పౌరగ్రంథాలయాలకు గ్రంథాలయ శిస్తుద్వారా మాత్రమే కాకుండా ప్రభుత్వ అనుదానాలు, వాటితోబాటు సభ్యత్వధరావతులు,

ధర్మాదాయసంస్థల విరాళాలు, ఇతరత్రమైన బహుమానాలు, అలాగే కొంతమేరకు జరిమానాల వల్లవచ్చే రాబడులు ఆర్థిక సంపత్తిని చేకూరుస్తాయి.

విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు కూడా పాలనా యంత్రాంగం కేటాయించే నిధులు, యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ అందించే అనుదానాలు, దానధర్మాలు, బహుమతులు, రుసుములు-జరిమానాలు, సేవా రుసుములు, అమ్మకాలు మొదలైన వాటిద్వారా ఆర్థికవనరులు సమకూరుతాయి.

మన దేశంలో విశ్వవిద్యాలయ గ్రంథాలయాల వ్యయపట్టికలను పరిశీలించినప్పుడు వేతనాలకు 50 శాతం, పుస్తకసేకరణాది ఇతర అంశాలకు 50 శాతం కేటాయించడం ఒక ప్రమాణ పద్ధతిగా కనిపిస్తుంది. వేతనాలకు 50 శాతం పోగా పుస్తకాది సేకరణకు 40 శాతం ఇతర అంశాలకు 10 శాతం సరిపోగలదని రంగనాథన్ అభిప్రాయం.

ఈ ప్రమాణాలు కొన్ని దశాబ్దాలకు పూర్వం ఏర్పాటై స్థిరపడిన విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలకు ఏ మాత్రమైనా సరిపోతాయేమో కానీ, ఇటీవలి కాలంలో కొత్తగా ఏర్పడి ఇంకా శైశవదశలో ఉన్నటువంటి విద్యాలయ గ్రంథాలయాలకు—ముఖ్యంగా విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలకు వర్తించవు.

గ్రంథాలయం విద్యాలయానికి హృదయం వంటిది. అందుచేత అది పటిష్టంగా ఉండాలి. పటిష్టవంతంగా ఉండాలంటే ఒక కనీస స్థాయిలో దానికి రూపురేఖలను దిద్దాలి. కనీస సంకలనం, పరిమాణం, అందుకు తగిన భవనం, అభిలషణీయమైన పరిధిలో సిబ్బంది తదితర సదుపాయాలు తప్పనిసరిగా ఉండాలి. అంటే, శైశవబాల్య దశల్లో ఉన్న

గ్రంథాలయాలకు కొన్ని రకాల ప్రత్యేక కేటాయింపులు తప్పనిసరి. ఉన్నత విద్య, పరిశోధన ప్రమాణాలను సాధించడానికి వాటికి తగిన ఊతనివ్వటానికి ఈ గ్రంథాలయాలు ముందుగా ఒక ప్రాథమిక సంకలన సమీకరణ పథకాన్ని చేపట్టాలి. ఈ సంకలనంలో సాధారణ పుస్తకాలు, ఆచూకీపుస్తకాలు, పాఠ్యపుస్తకాలు, పత్రికలు మాత్రమే కాకుండా పరిశోధనకు పనికివచ్చే మౌలిక గ్రంథాలు-పాతవి, కొత్తవి, అలాగే అరుదైనవి. వీలైతే అచ్చులో లేనివి కూడా చేరాలి. అంటే కొత్త గ్రంథాలయాలకు తొలిదశల్లో ఉన్నటువంటి గ్రంథాలయాలకు కూడా కనీస సంకలనాభివృద్ధి కార్యక్రమం అత్యంత ప్రధానం. దీనికి నేర్పు, ఓర్పు మాత్రమే కాకుండా ఒక క్రమపద్ధతి, దానితోబాటు చాలినంత సంపత్తి తప్పకుండా సమకూర్చాలి.

కనీస ప్రాథమిక సంకలనం ఎటువంటిదై ఉండాలి? అనే విషయం ఆ విశ్వవిద్యాలయ లక్ష్యాలు, ఉద్దేశ్యాలమేరకు నిర్ణయం కావాలి. భాషాప్రాతిపదికమీద రాష్ట్రాలు ఏర్పడి ఇప్పటికి మూడు దశాబ్దాలు గడిచాయి. ఈ రాష్ట్రాల్లో రాష్ట్ర ప్రాంతీయభాషలను అభివృద్ధి చేయటం కోసం ఏవో కొన్ని పథకాలు, ప్రణాళికలు చేపట్టటం జరిగినా తగిన దూరదృష్టి కార్యవిధానం కనిపించదు. మన జాతీయ గ్రంథాలయం, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాలు, అలాగే రాష్ట్ర అభిలేఖన కేంద్రాలు ఏర్పడినా ఆయా భాషావర్గాలవారి సాంస్కృతిక, వైజ్ఞానిక, విద్యా విషయికమైన వాఙ్మయ - సాహిత్య సేవలకు ప్రోత్సాహం కలుగలేదు. ఈ సందర్భంలో తెలుగు విశ్వవిద్యాలయ ఆవిర్భావం, తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయ సంస్థాపనం అభినందనీయం.

తెలుగుభాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు, వైజ్ఞానిక శాస్త్రాలు, వేదాంతం తదితర రంగాల్లో ప్రగతిని సాధించటానికి, సాహిత్యాభివృద్ధి కావించటానికి ఉన్నతస్థాయి విద్యా పరిశోధనలు

కల్పించడానికి తెలుగు విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఈ వివిధ కార్య కలాపాలకు ప్రత్యేకంగా వాఙ్మయ వనరులను సేకరించి తోడ్పడటం గ్రంథాలయ ప్రధాన లక్ష్యం. తెలుగు సంస్కృతికి సంబంధించిన వివిధ వాఙ్మయం యావత్తును సేకరించటం కష్టతరం. దీనిని సాధించడమెలా అనే వ్యూహ రచన కావాలి. ఇందుకు ఏమాత్రం నిధులు అవసరం? అనే విషయాన్ని కూడా ధ్రువపరచడం కష్టమే.

గత రెండు ఆర్థిక సంవత్సరాల బడ్జెట్‌ను పరిశీలించినప్పుడు 1986-87 లో సుమారు రూ. 5 లక్షలు, 1987-88 ఆర్థిక సంవత్సరంలో రూ. 11.25 లక్షలు మాత్రం పుస్తక సమీకరణకు కేటాయించినట్లు తెలుస్తుంది. ఈ కేటాయింపులు శైశవదశలో ఉన్నటువంటి తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి ముఖ్యంగా నిర్వహించవలసిన గురుతర బాధ్యతల దృష్ట్యా అతిస్వల్పం. విశ్వవిద్యాలయ పాలనా యంత్రాంగం ఈ నిధులను కొన్ని రెట్లు పెంచాలి. అయినా అవి ఎంతవరకు సరిపోతా యనేది శేష ప్రశ్నలాగానే ఉంటుంది. గ్రంథాలయ ఆదాయాన్ని పెంచటంకోసం కొన్ని నూతన మార్గాలను ఏర్పాటు చేయాలి.

తెలుగు విశ్వవిద్యాలయం సాంస్కృతిక కార్యకలాపాలకు, కళలకు పట్టుగొమ్మగా ఉండాలని ఉద్దేశించినందున చలన చిత్రాలు, తదితర వినోదాలపై ప్రభుత్వం కొంత పన్ను విధించి దానిని గ్రంథాలయానికి అందించాలి. రవీంద్రభారతిని తెలుగు విశ్వవిద్యాలయం వశంచేసి దానివల్ల లభ్యమయ్యే అద్దెను గ్రంథాలయానికి వినియోగించాలి. రాష్ట్ర సాంస్కృతిక పౌరసంబంధాల శాఖ బడ్జెట్‌లో కూడా కొంత శాతం తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి కేటాయించడం సముచితం.

ఈ విధంగా సమకూరే అదనపు నిధులు తెలుగు విశ్వ విద్యాలయంలో సంకలనాభివృద్ధికి, ఆ సంకలనం విశిష్టతకు, వ్యవస్థీ కరణకు కూడా కొంత దోహదం చేయవచ్చును.

—(ం)—

డా॥ యం. వి. శాస్త్రి

# 1.7 పుస్తక సమీకరణ : ప్రచురణ ప్రోత్సాహక పథకాలు, పంపిణీ విధానాలు

స్వాతంత్ర్యం రాకముందు రోజులతో పోల్చిచూస్తే ఇప్పుడు విద్యావకాశాలు బాగా —అంటే ఎన్ని రెట్లో పెరిగాయి. పుస్తక రచనకూ, ప్రచురణకూ కూడా సౌకర్యాలు ఎంతగానో పెరిగాయి. పుస్తక వ్యాపారం, వితరణ, గ్రంథాలయాల సంఖ్యా విస్తృతంగా పెరిగాయి. గ్రంథ పఠనం ఎంత పెరిగిందో? పాఠకుల సంఖ్యా ఎంత పెరిగిందో? వాళ్ళ అభిరుచులు ఎట్లా ఉన్నాయో? గ్రంథాలయాల్లో ఎటువంటి పుస్తకాలకు ఎంతెంత గిరాకీ ఉందో? తెలుసుకోవటానికి ఒక సర్వేక్షణ జరిపించవలసిన అవసరం ఉంది.

స్వాతంత్ర్య పూర్వ దినాల్లో గ్రంథాలయ ఉద్యమం స్వాతంత్ర్య పోరాటానికి ఒక అనుబంధంగా సాగింది. అందుకు అంకితమైన వ్యక్తులు, వారిచేత ఉత్తేజితమయిన సమాజమూ ఆ ఉద్యమంలో పాల్గొనటం జరిగింది. ఆ ఉత్తేజం తరువాత తగ్గిపోయింది. గ్రంథాలయాలస్థాపన, పోషణ, ప్రధానంగా ప్రభుత్వం, ప్రభుత్వ సంస్థల బాధ్యతగా మారి పోయింది. ఉత్తేజం కోల్పోయిన సమాజంలో ప్రవేశించే దుర్లక్షణాలు అన్ని రంగాల్లో మాదిరిగా గ్రంథాలయ రంగంలోను ప్రవేశించినట్లు కనబడుతుంది.

ఇది ఎలా ఉన్నా ఈ శతాబ్ది ప్రథమార్థంలో కంటే ద్వితీయార్థంలో విజ్ఞాన వికాసం బహుముఖంగా వర్ధిల్లింది. ఈ వికాసం సామాన్య పాఠక

లోకానికి అందుబాటులోకి వచ్చినప్పుడే సమాజ వికాసం ఏర్పడుతుంది. గ్రంథాలయాలు ఈ సందర్భంగా వహించవలసిన పాత్ర గురుతర బాధ్యతతో కూడుకున్నది. పరిమితమైన వనరులతో అన్ని గ్రంథాలయాలూ అన్ని ప్రచురణలనూ సేకరించలేవు. ఒక గ్రంథాలయాన్ని ఉపయోగించుకునే సాధారణ పాఠక సమాజం అభిరుచులూ, అవసరాలనుబట్టి కూడా గ్రంథసేకరణ జరగవలసి ఉంటుంది. ఇది ప్రధాన నేపథ్యం.

నేను గ్రంథాలయ సమస్యలను రచయితలు, ప్రచురణకర్తల దృష్టితో పరిశీలించదలుచుకున్నాను. అందులో ప్రభుత్వం పాత్రను కూడా కలిపి చూడదలుచుకున్నాను.

కొన్ని సంవత్సరాలుగా రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సాహక పథకాల కింద రచయితలు తమ పుస్తకాలను ప్రచురించుకోవడానికి కొంత ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నది. అట్లాగే, ప్రభుత్వ సహాయం పొందకుండా తమ పుస్తకాలను తామే ముద్రించుకున్న రచయితల వద్ద ఒక మాదిరి పెద్ద సంఖ్యలో పుస్తకాలను ప్రభుత్వం కొనుగోలు చేస్తున్నది.

ఇక గ్రంథాలయాల అభివృద్ధి కింద మంచి పుస్తకాలు కొనడానికి నేరుగా ప్రభుత్వమైతే నేమి, ప్రభుత్వ పరమైన సంస్థలైతే నేమి ఏటా 50-60 లక్షల రూపాయలు వ్యయం చేస్తున్నాయి. బహుశా విద్యాశాఖ కింద ఉన్న విద్యాలయాల్లోని గ్రంథాలయాల కొనుగోలు వ్యయం ఇందులో చేరిఉండక పోవచ్చు. తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదంగా ఉన్న ఈ వివిధ చర్యల మధ్య సమన్వయం ఎందుకు జరుగకూడదు?

రచయితలకు పుస్తక ప్రచురణ నిమిత్తం ఆర్థిక సహాయం అందజేసే పథకం ఇటీవల తెలుగు విశ్వవిద్యాలయానికి బదిలీ అయింది. వెయ్యి ప్రతులకు అయ్యే ముద్రణ వ్యయంలో సగభాగాన్ని

7,500 రూపాయలకు మించకుండా సహాయం చేసి 25 ప్రతులు బదులుగా కోరడం జరుగుతున్నది. ముద్రణ వ్యయం పెరిగినకొద్దీ, రచయిత భరించవలసిన మొత్తం ఎక్కువ కావటం, నిర్దిష్టంగా అతడు పని పూర్తిచేసుకోలేకపోవటం జరుగుతున్నది. ప్రచురణార్హమని భావించిన పుస్తకానికి కదా ఈ సహాయం చేస్తున్నది? ఏవో తంటాలుపడి, ముద్రణ పూర్తిచేసుకొని, ప్రతులు అమ్ముకొని రచయిత తన పెట్టుబడిని కాల క్రమంలో రాబట్టుకోవాలి. ఇది కష్టమైనపని. ఇంతకంటె ముద్రణ వ్యయమంతా ఏదో ఒక నిర్ణీత పద్ధతిలో భరించి ముద్రణ పూర్వపు వెలనో, లేదా మామూలుగా ఇవ్వవలసిన రాయితీ పోగా మిగులు ధరనో కట్టి, ఆ వ్యయానికి సరిపడిన ప్రతులను తీసుకోగలిగితే అది రచయితకు సౌకర్యం; ఆ ప్రతులు వివిధ గ్రంథాలయాలకు పుస్తకాల కొనుగోలు పద్దులో లెక్కగట్టి అందజేయ వచ్చు. మరో విధంగా చెబితే ఇన్ని ప్రతులు కొంటామని చెప్ప వాటికి నిర్ణయించిన ధరను మొత్తంగా ముద్రణకు పూర్వం, ముద్రణ కాలంలో రచయితకు ఇచ్చి ప్రతులు కొనడమన్నమాట. గ్రంథాలయాలకు మంచి పుస్తకాలు రావడానికి ఇదొక పద్ధతి.

ఇటువంటి సహాయం నిమిత్తం ఇతర రాష్ట్రాల్లో కూడా పథకాలు ఉన్నాయి. అయితే అన్ని చోట్లా సమన్వయ పథకాలు లేవు.

ఇతర రాష్ట్రాల్లో కొందరి మిత్రుల వద్దనుండి సేకరించిన సమాచారం ఇక్కడ తెలియచేస్తాను. ఈ సమాచారాన్ని నాకు శ్రీయుతులు ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ, ఆచార్య ఆర్. వి. యస్. సుందరం, ఆచార్య బి. రామచంద్ర, శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి గారు అందించారు. వారికి నాకృతజ్ఞతలు.

కర్ణాటక రాష్ట్రంలో పరిశోధన గ్రంథాలను ఆయా విశ్వవిద్యాలయాలే ప్రచురిస్తాయి. కొన్నిటిని కన్నడ సాహిత్య పరిషత్తు

ప్రకటించింది. సృజనాత్మక రచనలను, ఇతర సాహిత్య గ్రంథాలను ప్రకటించుకోవడానికి ప్రభుత్వశాఖ అయిన కన్నడ మత్తు సంస్కృతి ఇలాఖె, సాహిత్య అకాడమీ, లలితకళా అకాడమీ, జానపదమత్తు యక్షగాన అకాడమీ సహాయం చేస్తున్నాయి. కర్ణాటక ప్రభుత్వ ప్రధాన గ్రంథాలయాధికారి ముద్రిత గ్రంథాలను 300-350 ప్రతులను కొనుగోలు చేసి గ్రంథాలయాలకు పంపిణీ చేస్తున్నాడు.

ఇక తమిళనాడులో ఉత్తమ సాహిత్య రచనల ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందజేసే పథకాలను తమిళ విశ్వవిద్యాలయం, తమిళ అభివృద్ధి మండలి, రాష్ట్ర ప్రభుత్వం నిర్వహిస్తున్నాయి. రాజా అణ్ణామలై చెట్టి ఛారిటీస్ వంటి సంస్థలుకూడా సహాయం చేస్తున్నాయి. అక్కడ కూడా ప్రచురణ వ్యయంలో సగంవరకు భరించటం కద్దు. పబ్లిక్ లైబ్రరీల డైరక్టర్ ఆంగ్ల గ్రంథమైతే 200 ప్రతులు, తమిళ గ్రంథమైతే 600 ప్రతులు కొని గ్రంథాలయాలకు పంపిణీ చేస్తున్నాడు.

మహారాష్ట్రలోని పథకం మరికొంత ముందుకు సాగింది. పరిశోధన పట్టాలకు ఆమోదించిన సిద్ధాంత వ్యాసాలకు ప్రత్యేకంగా సహాయంచేసే పథకం మహారాష్ట్రలో లేదు. కాని పుస్తకాలకు పారితోషికాలు, బహుమతులు ఇచ్చే పథకం ఉంది. మొదట ఈ పని మహారాష్ట్ర రాజ్య సాహిత్య సాంస్కృతిక మండలి చూసేది. తరువాత ఈ పనిని విద్యా సాంస్కృతిక శాఖకు అప్పగించారు. ఆ శాఖ ఒక సలహా సంఘం సిఫారసుల మేరకు ధనసహాయం చేస్తున్నది. ఒక విశేషమేమంటే ముద్రణ ప్రచురణలకు మహారాష్ట్రలో సహాయం కోరవలసింది రచయితలు కాదు. ప్రచురణకర్తలు. సహాయం $33\frac{1}{3}$ శాతం నుంచి 50 శాతం దాకా ఉంటుంది. సహాయం పొందిన పుస్తకాల ధరలను ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. ఈ పథకం కింద కొత్త రచయితలను, ప్రామాణిక గ్రంథ రచయితలను ప్రోత్సహిస్తున్నారు. రచయిత ఆర్థిక సహాయం పొందినా, ఆ పిదప మళ్ళీ ప్రచురణకర్తను వెతుక్కోవలసివస్తుంది. కనుక ఈ పద్ధతి రచయితకు సౌకర్యంగా ఉంటుందని వారి ఉద్దేశ్యం. ప్రభుత్వం

కూడా సలహా సంఘం సిఫారసులమేరకు రచయితలను ఎంపికచేసి పుస్తకాలను రాయించి ప్రచురిస్తుంది. ప్రచురణకర్తల వద్ద ప్రభుత్వం మూడు నుంచి నాలుగు వందలదాకా ప్రతులు కొని గ్రంథాలయాలకు పంపిణీ చేస్తున్నది.

తమిళనాడులో, మహారాష్ట్రలో మంచి సాహిత్యాన్ని ఇతర భాషల నుంచి అనువాదం చేయించి ప్రచురించేందుకు కూడా ప్రోత్సాహక పథకాలు ఉన్నాయి. కేరళలో రచయితల సహకార సంఘం గొప్ప కృషి చేస్తున్నట్లు తెలుస్తుంది.

వీటినన్నిటినీ సమన్వయపరిచి కొన్ని సూత్రాలను తయారుచేసి తదనుగుణంగా అటు రచనకు, ప్రచురణకు ప్రోత్సాహం కల్పించటమే కాకుండా గ్రంథాలయాలకు మంచి పుస్తకాలు చేరేటట్లు చూడటం కష్టం కాదు. ఇందుకు తగిన ప్రయత్నం ఉండాలి. పనిలో పనిగా గ్రంథాలయాలకు సంబంధించినది కాకపోయినా ఈ అవకాశం వినియోగించుకొని మరొక సూచన కూడా చేయడానికి అనుమతి వేడుతున్నాను. ప్రభుత్వం హస్తకళలు, చేనేతలు మొదలైన వాటి అమ్మకం అభివృద్ధి పరచటానికి లేపాక్షి దుకాణాలు పెంచుతున్నది. స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ కూడా కార్యకలాపాలు విస్తరిస్తూ ఉన్నది. ఉత్తమ గ్రంథాలు, ప్రామాణిక రచనలు (ముఖ్యంగా విశ్వవిద్యాలయాలు, ఇతర సంస్థలు ప్రచురించేవి) లభ్యపరచటానికి కూడా ఆ పథకం విస్తరించగల అవకాశాలను పరిశీలించవచ్చును.

అన్ని గ్రంథాలయాలను ఒకే శ్రేణివిగా పరిగణించటం సాధ్యం కాదని ముందు సూచించడమైంది. కొన్ని ప్రమాణాలను రూపొందించి గ్రంథాలయాలను కొన్ని శ్రేణులుగా విభజించే ప్రయత్నం జరగటం అవసరం. ఒకవేళ ఈ పద్ధతి ఇప్పటికే అమలులో ఉన్నదేమో, నాకు తెలియదు. ఏయే శ్రేణి గ్రంథాలయాల్లో ఏఏ తరహాల, స్థాయిల, భాషల గ్రంథాలు ఉండాలో నిర్ణయించటం ద్వారా సేకరించవలసిన ప్రతుల సంఖ్యలను నిర్ధారించవచ్చును. కనీసం జిల్లాకు ఒక్కటైనా ఉత్తమ శ్రేణి గ్రంథాలయం ఉండాలి. రాష్ట్రంలో కనీసం రెండు మూడు

గ్రంథాలయాల్లో అన్ని పుస్తకాలూ లభ్యమయ్యేటట్లు, పరిశోధకుల అవసరాలు తీర్చేటట్లు ఉండాలి. రాష్ట్రేతర ప్రాంతాల్లో సైతం, ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, బెంగుళూరు, మధురై మద్రాసు వంటి నగరాల్లో తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతి చరిత్రలపై గ్రంథాలు లభించే గ్రంథాలయాలను అభివృద్ధి చేయడం అవసరం.

రచయిత-ప్రచురణకర్త-విక్రేత-గ్రంథాలయాల మధ్య పరస్పర ప్రయోజనం నెరవేరేవిధంగా తగిన పథకాలను రూపొందించటం అవసరం. ప్రభుత్వంకాని, ప్రభుత్వ సంస్థకాని, విశ్వవిద్యాలయం కాని ఇందుకు తగిన చొరవ తీసుకోవటం జరగాలి.

మరొక అంశం మీముందు ఉంచదలుచుకున్నాను. పరిశోధకులకు సర్వ విధాల సహాయంచేయగల గ్రంథాలయాలు మన విశ్వవిద్యాలయాల్లో ఏర్పడాలి. పుస్తకాలను లభ్యంచేయటం మాత్రమే కాక, విషయ విశ్లేషణ, ప్రతులుతీసి ఇవ్వటం వంటి సేవలు కూడా తప్పనిసరిగా ఉండాలి, వాఙ్మయ నియంత్రణా విధానం సరిగాలేనందున కొత్త పుస్తకాలు ఏమేమి వెలువడుతున్నాయో తెలుసుకోవటం కూడా క్లిష్టమైపోయింది. ప్రతి రచయిత ముందుగా ఆర్డరు లేకుండా తన ప్రతులను బిల్లుతో పంపిస్తే చెల్లించి తీసుకొనే పద్ధతి విశ్వవిద్యాలయాల్లో రావటం అభిలషణీయం.

రిజిస్ట్రార్ ఆఫ్ బుక్స్‌కు, జాతీయ గ్రంథాలయాలకు ప్రచురణలన్నీ విధిగా పంపాలన్న చట్టాన్ని ఎంతమంది పాటిస్తున్నారో ఊహించగలం. రాష్ట్ర ప్రభుత్వంగాని, కేంద్ర ప్రభుత్వంగాని ప్రచురితమయ్యే ప్రతి పుస్తకానికి ఒక కేటలాగ్ నంబరు ఇస్తుందని, ఆ నంబరు పొంది పుస్తకంలో ముద్రించకపోతే అపరాధమౌతుందని శాసిస్తే తప్పపుస్తక ధరావత్తు అధికారాన్ని అమలుపరచడం సాధ్యం కాదేమో!

ఈ గోష్ఠిలో కొన్ని సూచనలకు మాత్రమే అవకాశం ఉంది. వీటిలో ప్రతి సూచనను, ఆచరణాత్మకంగా తీర్చిదిద్దేటందుకు చాలా ప్రయత్నం జరగాలి. అందుకు చొరవతీసుకునేటందుకు ఈ పత్రం ప్రేరేపించగలిగితే ప్రయోజనం నెరవేరినట్లే.

—(o)—

డా॥ వెలగా వెంకటప్పయ్య

# 2.1 వాఙ్మయ నియంత్రణ : తెలుగులో గ్రంథసూచీలు, సమగ్రగ్రంథ ఆంధ్రసూచీ అవసరం

భారతీయ భాషల్లో గ్రంథసూచి లేదా వాఙ్మయ సూచి తయారు చేయడంలో తెలుగు వారే ఆద్యులని చెప్పవచ్చు. గ్రంథసూచి నిర్మాణం ఊహించని దినాల్లో—"ఆంధ్రనాటక నామావళి" పేరుతో 1901-1916 మధ్య వచ్చిన నాటకాల జాబితాను పురాణం సూరిశాస్త్రి, కానుకొలను వెంకట్రామయ్యలు ప్రచురించారు. భారతీయభాషల్లో వెలువడ్డ తొలి గ్రంథసూచి ఇదే కావచ్చు. జాతి సంస్కృతి సంపదను, విజయ పరంపరను ప్రతిబింబించేవి గ్రంథాలు. ఇవి జాతి ఆలోచనా పటిమను తెలియజేస్తాయి. ప్రగతికి బాటలు వేస్తాయి. వీటి ఉనికిని, క్రమాన్ని, భౌతిక వివరాలను, విషయ అంశాలను తెలియజేసేవే గ్రంథసూచీలు. గ్రంథపాలకునికి గ్రంథాలయ సూచి తయారుచేయడానికి, పుస్తకాల ఎంపికకు, చదువరులకు వాఙ్మయ-సమాచార సేవలు అందించడానికి, పరిశోధనలో ఉపకరించటానికి తోడ్పడతాయి. ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, గ్రంథసూచీలు జాతికి చేసే సేవ అంచనాలకు అందదు మూల్యాంకణలకు నిలువదు. అపూర్వమైనది.

## రెండవ ప్రయత్నం

తదుపరి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు పూనుకొని 1929 లో ఆంధ్ర వాఙ్మయ సూచికను ప్రచురించారు. దీన్ని గన్నవరపు

సుబ్బరామయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు సిద్ధంచేశారు. దీనిలో 1927 వరకు ప్రచురించిన గ్రంథాల స్థూల వివరాలతోబాటు, కాకినాడలోని ఆంధ్ర సాహిత్యపరిషత్తు, తంజావూరులోని సరస్వతీ మహల్, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని రాత ప్రతుల జాబితా కూడా ఉంది. ఆనాటి గ్రంథ సంపదను గురించి తెలుసుకోవడానికి ఇదే నేటికున్న ఆధారం. కొద్ది స్థాయిలో క్రమబద్ధమైన రీతిలో 1962 లో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం ఆంధ్రవాఙ్మయ సంగ్రహ సూచికను ప్రచురించింది. దీనికి అప్పటివరకు వచ్చిన బాలల గ్రంథాల జాబితా అనుబంధంగా ఉంది. తదుపరి సమగ్ర సూచీల నిర్మాణంలో కొన్ని ప్రయత్నాలు జరిగాయి. కానీ ఏదీ జయప్రదంకాలేదు.

## విషయ, వ్యక్తి సూచీలు

స్వాతంత్ర్యం వచ్చాక భారతీయభాషలకు ప్రాధాన్యం పెరిగినపుడు, విషయపరమైన, వ్యక్తిపరమైన గ్రంథసూచీలకు ఆదరం లభించింది. 1953 లో మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు "తెలుగునుడి దండలు" పేరుతో నిఘంటువుల జాబితా తయారుచేశారు. సుప్రసిద్ధ నాటక విమర్శకుడు శ్రీనివాస చక్రవర్తిగారు 1963లో సుమారు రెండు వేల ఆంధ్రనాటకాల వివరాలను ముఖ్యంగా అంకాలు, రంగాలు, పాత్రల సంఖ్య తదితర వివరాలు అందుచేర్చారు. తదుపరి ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమి సిద్ధంచేసిన శాస్త్రీయ వాఙ్మయసూచీ 1967 లో ప్రచురితమైంది. 1863–1965 మధ్య అచ్చయిన శాస్త్ర, సాంకేతిక క్షేత్రాలలో గ్రంథాలు దాదాపు అన్నీ ఈ సూచీలో ఉన్నాయి. తదుపరి సామాజిక శాస్త్రాల గ్రంథసూచిని సమగ్రమైన రీతిలో, విషయసూచితో సహ భారత సమాజశాస్త్ర విజ్ఞాన పరిశోధనామండలి, దక్షిణ ప్రాంతీయ విభాగం సిద్ధం చేయించింది. కాని ఇది అచ్చు కాలేదు. కార్డుల రూపంలో ఆ కేంద్రంలో లభిస్తుంది.

వ్యక్తుల గ్రంథ సూచీల విషయంలో ఇప్పటివరకు కొడవగంటి కుటుంబరావు, కాళ్ళకూరి నారాయణరావు, మునిమాణిక్యం నరసింహారావు, బుచ్చిబాబు, విశ్వనాథ సత్యనారాయణ, రాయప్రోలు సుబ్బారావు, వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులపై ఎం. ఫిల్ డిగ్రీల సిద్ధాంత వ్యాసాలుగా వచ్చాయి.

ఇలా ఉండగా, కేవలం గ్రంథసూచిగా తయారుచేయకపోయినా తెలుగులో కవిత్రయం, శ్రీనాథుడు, కోలాచలం శ్రీనివాసరావు, జాషువా, నాయని సుబ్బారావు, దాశరథి, నారాయణరెడ్డి ప్రభృతులపై జరిగిన పరిశోధనల్లో వారి గ్రంథాలవివరాలు, వాటిపై వచ్చిన రచనలవివరాలు ఉన్నాయి. ఇవి కూడ ప్రత్యామ్నాయ గ్రంథ సూచీలే.

## జాతీయ గ్రంథసూచి

డెలివరీ ఆఫ్ బుక్స్ అండ్ న్యూస్ పేపర్స్ చట్టం అమల్లోకి వచ్చాక జాతీయ గ్రంథాలయంలోని కేంద్ర రెఫరెన్సు గ్రంథాలయ పరంగా 1958 నుంచి భారతీయ గ్రంథసూచి ప్రచురణ రోమన్ లిపిలో జరుగుతూ ఉంది. భారతీయ భాషలన్నిటిలో ప్రచురించే గ్రంథాలకు ఈ సూచి దర్పణంగా ఉంటుంది. జాతీయగ్రంథసూచి ప్రచురణ ప్రారంభించిన నాటి నుంచీ అది సామాన్య చదువరులకు, చిన్న చిన్న గ్రంథాలయాలకు అందుబాటులో లేదనే విమర్శ వస్తూనే ఉంది. పైగా సూచి వెల హెచ్చుగా ఉండటం చేత చిన్న చిన్నగ్రంథాలయాలు, పాఠశాలలు, కళాశాలలు, వ్యక్తులు కొని ఉపయోగించుకోడానికి అందుబాటులో లేకున్నది. అందుచేత తక్కువ వెలలో ప్రతిభాషలోనూ, ఏటేటా జాతీయ గ్రంథసూచితో బాటు అదనంగా ఒక సంపుటాన్ని ప్రచురించవలసిన అవసరం ఎంతో కనబడింది. దీనిని రాష్ట్రప్రభుత్వం కూడా గుర్తించి కేంద్రప్రభుత్వం సహకారంతో ఈ విభాగ ప్రచురణకు పూను

కున్నది. దేశంలో దాదాపు రాష్ట్రప్రభుత్వాలన్నీ ఈ కార్యక్రమాన్ని నిర్వహించడానికి ముందుకు వచ్చాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడ ఈ విషయంలో ముందంజవేసి "జాతీయ గ్రంథసూచి తెలుగు విభాగాన్ని" 1958 నుంచి ఈ తీరుగా ప్రచురిస్తూ ఉంది.

| వరుస సంఖ్య | విభాగ సంవత్సరం | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|
| 1 | 1958 | 1960 |
| 2 | 1959 | 1962 |
| 3 | 1960 | 1962 |
| 4 | 1961 | 1968 |
| 5 | 1962 | 1968 |
| 6 | 1963 | 1975 |
| 7 | 1964 | 1976 |
| 8 | 1965 | 1977 |
| 9 | 1966 | 1977 |
| 10 | 1973 | 1975 |
| 11 | 1974 | 1975 |

1966 నుంచి 1972 వరకు, 1975 నుంచి నేటివరకు గల సంపుటాలు అచ్చులో ఉన్నాయని తెలుస్తుంది. ఎప్పటికి పూర్తి కాగలవో అనూహ్యం. 1958 నుంచి వెలువడుతున్న జాతీయ గ్రంథసూచిని 1963 నుంచి భారతీయ గ్రంథసూచిగా మార్చారు. ఈ విధంగా ఆలస్యం కావడంవల్ల పాఠకులకు పూర్తిగా ఉపయోగపడవు. సూచీ ప్రచురణ

నాటికి సూచీలోని అనేక పుస్తకాలు చెల్లిపోయి ఉంటాయి. మంచి పుస్తకాలయితే అసలు లభింపవు. చాలా పుస్తకాలను చూడటం పడక పాఠకులు ఈ సూచీలోని పద్దులను చూచి తృప్తిపడవలసి వస్తుంది. కనుక ఇప్పటికయినా పాత వాటిని వెంటనే ముద్రించి, ఇకనుండి కొత్తవానిని ఏయేటా ముద్రించేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృషి చేసినప్పుడే ఈ సూచీల ప్రయోజనం సిద్ధించగలదు.

అనేక ఒడుదుడుకులతో సాగుతున్న తెలుగు గ్రంథ సూచీల పరిస్థితిని చూశాక ఒక వ్యవస్థాగత ప్రాతిపదికపై సమగ్రమైన రీతిలో తెలుగు గ్రంథాలకు "కన్నడ గ్రంథసూచీ"ని పోలిన గ్రంథసూచి ఎంతో అవసరం అనిపిస్తుంది.

## సమగ్ర గ్రంథసూచీ పథకం

పుస్తకాలు కాగితాల బంగీలు కావు. మానవ మేధా సంపత్తికి నికషోపధాలు. తరతరాలుగా మానవ విజయ పరంపరను సంపుటీకరించుకొని వస్తున్న సాంస్కృతిక కాంతి పుంజాలు. పుస్తకాలను వాటి వివరాలను భద్రపరచడం జాతి చరిత్రను పదిలం చేసుకొన్నట్లే. ఇందుకు పశ్చిమదేశీయులు మార్గదర్శకులు. బ్రిటన్‌లో, ఫ్రాన్స్‌లో, అమెరికాలో మూడు, నాలుగువందల సంవత్సరాలనాటి పుస్తకం కావాలన్నా లేదా ఆ వివరాలు కావాలన్నా సంపాదించడం కష్టంకాదు.

సమగ్ర గ్రంథసూచీలను కేవలం ఒక విషయానికో లేదా ప్రాంతానికో పరిమితం చేయొచ్చు. సామాన్యంగా ప్రతి జాతీయ గ్రంథాలయ యావత్సంకలనానికి సూచి నిర్మించి క్రమేణ ప్రత్యగ్రపరచటం వల్ల కూడ సమగ్ర గ్రంథసూచీ లక్ష్యాన్ని సాధించటం జరుగుతుంది.

ఇటువంటి బృహత్ప్రయత్నాలు విదేశీయులకే చెల్లు. కొన్ని జాతీయ గ్రంథాలయాల ముద్రితసూచీలను ఈ కింద ఉదహరిస్తాను.

| వరుస సంఖ్య | సూచీ పేరు | భాష | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| 1. | బ్రిటిష్ మ్యూజియం కేటలాగ్ 313 సంపుటాలు | ఇంగ్లీషు | 1966 |
| 2. | లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ కేటలాగ్ 194 సంపుటాలు | ఇంగ్లీషు | 1948-58 |
| 3. | బిబ్లియోథిక్ నేషనల్ కేటలాగ్ | ఫ్రెంచి | 1968 |

ఇలాటివే తాజా ప్రచురణల సూచీలు జాతీయ వాఙ్మయ సూచీలు ప్రచురణ ప్రారంభం నుంచి ప్రతివారం, మాసం, పక్షం, త్రైమాసికం, సంవత్సరం అవి వెలువడుతున్నాయి.

## భారత దేశంలో సమగ్ర సూచీలు

కాస్త ఆలస్యంగా ప్రారంభించినా ఈ సాధనలో భారతదేశంలో కొంత కృషి కనిపిస్తుంది. భారత దేశంలో పుస్తకాల ముద్రణ మూడు వందల సంవత్సరాల క్రితం ప్రారంభమైనా వాటిని క్రమబద్ధమైన విధానంలోకి తేవాలనే ఆలోచన నూరేళ్ళ క్రితమే బ్రిటీషు ప్రభుత్వానికి వచ్చింది. వెంటనే 1867లో ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ ఆక్టు అమలులోకి వచ్చింది. ఇది గ్రంథ ముద్రణా చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన ఘట్టం. ఈ చట్టంవల్ల ప్రచురణకర్తలు ఆయా రాష్ట్రాల్లో పుస్తకాల రిజిస్ట్రారుకు తమ ముద్రిత గ్రంథాలను విధిగా పంపాల్సిన బాధ్యత ఏర్పడింది. ఈ తీరుగా వచ్చిన పుస్తకాల పట్టికలను ఆయా రాష్ట్రప్రభుత్వాలు గజెట్‌లో ప్రచురిస్తూ వచ్చాయి. ఇవే భారతీయ భాషల్లో తొలి సమగ్ర సూచీలు. ఈ చట్టం కింద మద్రాసులో పుస్తకాల రిజిస్ట్రారుకు చేరిన పుస్తకాల వివరాలను సంచయనం చేసి మద్రాసు ప్రభుత్వం ఈ తీరుగా ప్రచురించింది.

| సంపుటం | చేరిన కాలం | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|
| 1 | 1867-1889 | 1892 |
| 2 | 1890-1900 | 1962 |
| 3 | 1901-1910 | 1964 |
| 4 | 1911-1915 | 1965 |
| 5 | 1916-1920 | 1966 |
| 6 | 1921-1925 | — |

ఇందు కార్యాలయానికి, ఆ కాలంలో చేరిన తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ తదితర భాషల గ్రంథాల వివరాలున్నాయి.

మిగతా రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విధంగా సంచయనంచేసి గ్రంథ రూపంలో ప్రచురించిన సమాచారం తెలియడంలేదు. ఐతే ఉత్సాహవంతులైన కొందరు వ్యక్తులు భారతీయ భాషల్లో సమగ్ర గ్రంథసూచీ నిర్మాణ ప్రయత్నాలు చేశారు. కొన్ని వివరాలు ఈ దిగువ ఇవ్వడమైంది.

| వరుస సంఖ్య | సమగ్ర సూచీ | సంపాదకుడు | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| 1. | బ్రిహత్ హిందీ గ్రంథసూచి | యశ్‌పాల్ మహాజన్ కృష్ణ మహాజన్ | 1965 |
| 2. | హిందీ సాహిత్య సరణి | నారాయన్-పీతాంబర్ | 1964 |
| 3. | మరాఠీ గ్రంథ సూచి | ఎన్. జి. దతే | 1943-1963 |
| 4. | తమిల్‌సొల్ వివర అత్తవనై | టి. సన్ముఖన్ | 1962 |
| 5. | బంగ్లా భాషా సాహిత్య సూచి మొదటి భాగం | — | 1964 |

| | | |
|---|---|---|
| 6. కేటలాగ్ ఆఫ్ సంస్కృత్ పాలీ, అండ్ ప్రాక్రిట్‌బుక్స్ | —— | 1951 |
| 7. కన్నడ గ్రంథ సూచి | —— | 1956 |
| 8. ఆంధ్ర వాఙ్మయ సూచిక | కాశీనాథుని నాగేశ్వరరావు | 1927 |

ఇందు కన్నడ గ్రంథసూచి ప్రయత్నం చక్కని ప్రణాళికతో ఉండి, అత్యంత శ్లాఘ్యనీయమైనది. ప్రయోజనకరమైనది.

ఆంధ్ర వాఙ్మయ సూచి నిర్మాణం క్రమబద్ధంగా జరగలేదు. ఐనప్పటికీ భవిష్యత్తులో తయారుచేయగల సమగ్ర గ్రంథ సూచీలకు అది ప్రాతిపదికగా ఉపయోగించగలదు. ఇంతకు పూర్వం కొన్ని విషయాలపై సమగ్ర ప్రయత్నాలు జరక్కపోలేదు. వాటి వివరాలు తెలుసుకుందాం.

| వరుస సంఖ్య | విషయం | సూచీ ప్రచురించిన సంస్థ | సంవత్సరం |
|---|---|---|---|
| 1. | తెలుగు భాషా సాహిత్యాలు భారత జాతీయ సాహిత్య సూచి (1901-1953), 4 వ సంపుటం | సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ | 1975 |
| 2. | విజ్ఞానశాస్త్రాలు (1963 - 1965) | ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమీ, హైదరాబాదు | 1967 |
| 3. | సామాజిక శాస్త్రాలు (1965 - 1966) | శోధన సంస్థ, హైదరాబాదు | అముద్రితం |

శాస్త్రిబద్ధంగా తయరుచేసిన పై సూచేల నిర్మాణాన్ని అందు గల సమాచారాన్ని వినియోగించుకొని 1746 నుంచి నేటివరకు ప్రచు రించిన గ్రంథాలకు సమగ్రసూచీ తయారుచేయవలసి ఉంది. తెలుగుభాష, సాహిత్యం, సంస్కృతుల అభివృద్ధికోసం ఏర్పడిన తెలుగు విశ్వవిద్యా లయం ఇందుకై కృషి చేయవలసిఉంది. సమగ్రమైన రీతిలో తెలుగు గ్రంథసూచి పూర్తయిననాడు తెలుగు పరిశోధన మరింత సుకరం కాగలదు.

## అనుబంధాలు

ఈ చర్చా పత్రానికి అనుబంధంగా ఉన్న తెలుగు గ్రంథసూచీల జాబితా చూస్తే తెలుగులో గత ఏడు దశాబ్దాల కాలంలో ఈ రంగంలో జరిగిన కృషి తెలుస్తుంది. గ్రంథాలయం విశ్వవిద్యాలయాల్లో విద్యా ర్థులకు తెలియజెప్పడానికి, తక్కిన రంగాలు పరిపుష్టం చేసుకోడానికి అవకాశం కలిగిస్తుంది. గ్రంథాలయ సిబ్బందికి, సంస్థలకు కొన్ని బాధ్య తలను గుర్తుచేస్తుంది. జతకూర్చిన సూచీలలో మొదటి జాబితాలో తెలుగు గ్రంథసూచీలు, రెండవ జాబితాలో తెలుగు గ్రంథాల గురించి ఇతర భాషల్లో లభించే వివరాలు ఉన్నాయి. చూడండి.

## భారతదేశంలో గ్రంథసూచీలు

1784లో రాయల్ ఏసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్ స్థాపనతో శాస్త్రీయ పరిశోధనకు పునాదులు ఏర్పడ్డాయి. 1874 లో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్సైన్సు, స్థాపన శాస్త్రీయ పరిశోధనకు దోహదం చేసింది. పరిశోధనలకు అవసరమైన గ్రంథ సూచీల నిర్మాణం జరిగింది. ఆ తరువాత 1952లో స్థాపించిన ఇండియన్ నేషనల్ సైంటిఫిక్ డాక్యు మెంటేషన్ సెంటర్ ఈకృషికి బలమైన ఊత నిచ్చింది.

## గ్రంథసూచీల రకాలు

గ్రంథసూచీల్లో అనేక రకాలున్నాయి. వీటిలో కొన్ని :

1. అపురూప గ్రంథసూచీలు : ప్రాచీన గ్రంథాలను వివరించేవి.
2. విశ్వజనీన గ్రంథసూచీలు : ప్రపంచవ్యాప్తంగాగల పుస్తకాలను వివరించేవి.
3. జాతీయ గ్రంథసూచీలు : ఒకదేశంలోని పుస్తకాలను వివరించేవి.
4. వ్యక్తిగత గ్రంథసూచీలు : ఒకచేత, ఒకవ్యక్తిపైగల రచనలు తెలిపేవి.
5. విషయ గ్రంథసూచీలు : ఒక విషయంపై గల పుస్తకాలను తెలిపేవి.
6. విశిష్ట గ్రంథసూచీలు : ఒక అవసరానికి ఉపయోగించే కొన్ని గ్రంథాలవివరాలు తెలిపేవి.
7. వ్యాపార గ్రంథసూచీలు : అమ్మకాలనిమిత్తం తయారుచేసిన విక్రయపట్టీలు.

వీటి గురించి ఎక్కువ వివరాలకు ప్రస్తుతం వెళ్ళలేము. తెలుగులో ఇంతవరకు వెలువడిన గ్రంథసూచీల, పత్రికారచనల సూచీల, అనుక్రమణికల వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

1. ఆంధ్రనాటక దర్శిని : శ్రీనివాస చక్రవర్తి సంగ్రహకత్వం. విజయవాడ : జయంతి పబ్లికేషన్స్, అక్టోబరు 1963; 534 పు; 19 సెం.మీ.
2. ఆంధ్ర గ్రంథములు : మొదటి జాబితా. పాతూరి నాగభూషణం సంగ్రహకత్వం. విజయవాడ : ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం, 1945; 33పు; 21 సెం.మీ.

3. ఆంధ్రనాటక నామావళి : పురాణం సూరిశాస్త్రి, కానుకొలను వెంక ట్రామయ్య, కూర్పు. మచిలీపట్నం : ఆంధ్రనాటక ప్రోత్సాహకసంఘం, 1917; 28, 4 పు; 24.5 సెం.మీ.

4. ఆంధ్ర గ్రంథసూచిక : వెలగా వెంకటప్పయ్య కూర్పు. హైదరా బాదు: తెలుగు అకాడమి, 1972; 21 సెం.మీ.

5. ఆంధ్రనాటక వికాసము : పోణంగి శ్రీరామఅప్పారావు. హైదరా బాదు : నాట్యమాల ప్రచురణ, డిశంబరు 1967; 16,84పు; 24 సెం.మీ.

6. ఆంధ్రప్రదేశం : పి. సత్యనారాయణ కూర్పు. హైదరాబాదు : భారత సమాజ విజ్ఞాన పరిశోధనమండలి, దక్షిణప్రాంతీయ కేంద్రం, హైదరాబాదు, 1980.

7. ఆంధ్రవాఙ్మయ సంగ్రహసూచి : పాతూరి నాగభూషణం, సంపాద కత్వం. వెలగా వెంకటప్పయ్య, మహీధర జగన్మోహన రావు సంగ్రహకత్వం. విజయవాడ: ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం, 1962; 18, 218, 48పు; 21 సెం.మీ.

8. ఆంధ్రవాఙ్మయ సంగ్రహసూచి : ముద్రితా ముద్రిత గ్రంథాల పట్టిక. కాశీనాథుని నాగేశ్వరరావు సంపాదకత్వం.గన్నవరపు సుబ్బ రామయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ తదితరుల కూర్పు. మద్రాసు: ఆంధ్రపత్రిక కార్యాలయం, 1929; 4, 108, 370, 60, 56పు; 24 సెం.మీ.

9. కాళ్ళకూరి నారాయణరావుగారి వాఙ్మయ జీవితవిశేష సూచిక. వేమూరి శ్రీనివాసమూర్తి. కాకతీయ విశ్వవిద్యాలయ సిద్ధాంత వ్యాసం, 1981; అముద్రితం.

10. కుటుంబరావు సాహిత్యం : కేతు విశ్వనాథరెడ్డి కూర్పు. విజయవాడ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1982; కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యం, ప్రచురణకు ముందు ప్రచురించిన కథలు, గల్పికలు, నవలలు, నాటికల సమాచార సూచి ఇది; అసమగ్రం.

11. గాంధీవాఙ్మయ సూచిక : వెలగా వెంకటప్పయ్య, సంపాదకత్వం. గ్రంథాలయ సర్వస్వము 1965; అక్టోబరు, నవంబరు సంచికలలో ప్రకటితం.

12. గాంధీ సాహిత్యం : గ్రంథాలయ సర్వస్వము. 1956 సెప్టెంబరు; 1958 నవంబరు సంచికలలో ప్రకటితం.

13. గోల్కొండ పత్రికలోని ముఖ్యరచనల సూచి: పి. సత్యనారాయణ, సంపాదకత్వం. హైదరాబాదు: భారత సమాజవిజ్ఞాన పరిశోధనమండలి, దక్షిణ ప్రాంతీయ కేంద్రం (1980). గోల్కొండ పత్రికలో 1926-49 మధ్యకాలంలోని ముఖ్యరచనల సూచిక.

14. గ్రంథాలయ దర్శిని 1972 : వెలగా వెంకటప్పయ్య, సంపాదకత్వం. ఏలూరు : గ్రంథాలయ దర్శినిధి, 1972; 168 పు; 21 సెం.మీ. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ ఉద్యమాన్ని సమీక్షిస్తూ 1968 నుంచి 1973 వరకు ఏటా ప్రచురింపబడింది. 1971 నుంచి అంతకుక్రితం సంవత్సరంలో తెలుగులో ప్రచురించిన గ్రంథాల పట్టిక కూడ దీనికి చేర్చబడింది.

15. గ్రాంథికవ్యవహారిక వాదసూచిక (1836 - 1980) : అక్కిరాజు రమాపతిరావు, సంగ్రహకత్వం. హైదరాబాదు : తెలుగు అకాడమీ, 1980; 4,103 పు; గ్రాంథిక, వ్యవహారిక వాదాలు తెలిపే గ్రంథాలు, వ్యాసాల సూచి ఇది.

16. ద్విపద గ్రంథముల పట్టిక : ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,1979; 523-529 పు; ఇందు 114 ముద్రితా ముద్రిత ద్విపద గ్రంథాల వివరాలున్నాయి.

17. నోరి నరసింహశాస్త్రి వాఙ్మయ జీవిత సూచిక. జి. సుమతిదేవి, సంపాదకత్వం. కాకతీయ విశ్వవిద్యాలయ సిద్ధాంత వ్యాసం 1981; అముద్రితం.

18. పోతన వాఙ్మయ జీవితసూచిక : విమర్శిని పరిశోధన పత్రిక, 6-7 సంచికలు. వరంగల్ : కాకతీయ విశ్వవిద్యాలయం; జనవరి 1981, 1982; 41 పు.

19. తెలుగు జానపద విజ్ఞానసూచి : జి.ఎస్. మోహన్, సంపాదకత్వం. మలయనూరు (అనంతపురంజిల్లా): శ్రీనివాస పబ్లికేషన్స్, ఆగస్టు, 1982; 10, 74 పు; ఇందులో జానపద విజ్ఞానానికి సంబంధించిన 1003 గ్రంథాల వ్యాసాల వివరాలు లభిస్తాయి.

20. తెలుగు నిఘంటువికాసం : వెలగా వెంకటప్పయ్య. హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1975; అనుబంధం లోని 36-60 పుటలలో 275 తెలుగు నిఘంటువుల వివరాలు లభిస్తాయి.

21. తెలుగు పత్రికలు : హైదరాబాదు: భారతసమాజవిజ్ఞాన పరిశోధనా మండలి, దక్షిణ ప్రాంతీయ కేంద్రం, 1980 గౌతమీ గ్రంథాలయం, వర్ధమాన సమాజం, సారస్వతనికేతనం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, రాజ్య అభిలేఖన నిలయం, నగరకేంద్ర గ్రంథాలయం, మొదలైన ప్రసిద్ధ గ్రంథాలయాల్లో లభించే తెలుగు పత్రికల వివరాలు లభిస్తాయి.

22. తెలుగు పరిశోధనా సంహిత : హైదరాబాదు: తెలుగు అకాడమీ, 1975; 10, 145 పు; 1974 వరకు తెలుగులో ఆమోదించిన సిద్ధాంత వ్యాసాల వివరాలు లభిస్తాయి.

23. తెలుగు పుస్తకముల పట్టిక : మద్రాసు: మద్రాసు గ్రంథాలయ సంఘం, 1929; 28 పు.

24. తెలుగు నుడి దండలు : మారేపల్లి రామచంద్రశాస్త్రి, సంగ్రహకర్త్వం. విజయవాడ: ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము, 1953; 16, 53 పు; 13.5 సెం.మీ. తెలుగు పద్య అకారాది నిఘంటువుల వివరాలు లభిస్తాయి.

25. తెలుగులో రామాయణాలు : గాడిచర్ల హరిసర్వోత్తమరావు, సంపాదకత్వం. గ్రంథాలయ సర్వస్వము. జనవరి 1965 సంచిక. తెలుగులోని బాల సాహిత్యం; వెలగా వెంకటప్పయ్య సంపాదకత్వం, గ్రంథాలయ సర్వస్వము 1958, నవంబరు, డిశంబరు సంచిక.

26. తెలుగు సాహిత్య పత్రికలు : తెలుగులో పరిశోధన రజతోత్సవ సంచిక. హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆగస్టు, 1983; 439-453 పు; వివరాల సేకరణ: ఎస్.వి. రామారావు, జంధ్యాల జయకృష్ణ బాపూజీ, ఆశావాది ప్రకాశరావు, పత్రిక పేరు, సంపాదకులు, స్వభావం, స్థలం, కాలం వివరాలు (1868 - 1982) ఉన్నాయి.

27. బుచ్చిబాబు వాఙ్మయ జీవితసూచిక : కాత్యాయినీ విద్మహే. వరంగల్లు, సెప్టెంబరు 1983.

28. తెలుగు హరికథలు : తూమాటి దొణప్ప. తెలుగు హరికథా సర్వస్వం. గుంటూరు : నవంబరు, 1978. 561-608పు. కొన్ని హరికథల సూచి.

29. బాలసాహితీమాల : వి. పి. నారాయణరెడ్డి, జి. సత్యం, గౌరవ సంపాదకులు. పి.యస్. దేవదాసు, పి. దేవదానం, సంపాదకులు. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ శాఖ, 1963; 28, 687పు; 25 సెం. మీ. తెలుగులో ప్రచురించిన బాలసాహిత్య వివరాలు ఇందులో ఉన్నాయి.

30. భారతీయ గ్రంథసూచి : తెలుగు విభాగం, హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌరగ్రంథాలయశాఖ; 21 సెం. మీ.

| సంపుటం | | ప్రచురణ సంవత్సరం | పుట సంఖ్యలు |
|---|---|---|---|
| 1958 | మే | 1960 | 31,229 పు. |
| 1959 | ఫిబ్రవరి | 1962 | 32,212 పు. |
| 1960 | డిశంబరు | 1962 | 32,184 పు. |
| 1961-62 | జనవరి | 1968 | 37,444 పు. |
| 1963 | ఏప్రిల్ | 1975 | 40,258,8,28 పు. |
| 1964 | ఆగస్టు | 1976 | 29,265 పు. |
| 1965-1966 | నవంబరు | 1977 | 34,8,330 పు. |
| 1973-1974 | డిశంబరు | 1975 | 54,348 పు. |

డెలివరీ ఆఫ్ బుక్స్ చట్టాన్ని అనుసరించి కలకత్తాలోని జాతీయ గ్రంథాలయానికి చేరిన తెలుగు పుస్తకాల జాబితా, ఆయా సంవత్సరాల్లో ప్రచురించే తెలుగు పుస్తకాలు ఇందులో చాలావరకు ఉన్నాయి. 1962 వరకు జాతీయ గ్రంథసూచీ అనేవారు.

31. పత్రికలు. (ఆంధ్రసర్వస్వములో) మాగంటి బాపినీడు సంపాదకత్వం. రాజమండ్రి : కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, 1961; 394-407పు.

32. పత్రికాలోకం. (తెలుగు పత్రికల సమాచార సంగ్రహం) పి. సత్య నారాయణ సంపాదకత్వం. హైదరాబాదు : భారత సమాజ విజ్ఞాన పరిశోధనమండలి, 1973 (జులై-సెప్టెంబరు) త్రైమాసిక పత్రిక, తొలి సంచిక మాత్రమే వెలువడింది.

33. పొడుపు కథాసాహితి. వెలగా వెంకటప్పయ్య సంపాదకత్వం. (పొడుపు కథలు- లో). విజయవాడ: సిద్ధార్థ పబ్లిషర్స్, 1981;200-204పు.

34. పోతన వాఙ్మయ జీవితసూచిక. విమర్శిని పరిశోధన పత్రిక. 6-7 సం. జనవరి 1981-82; వరంగల్, కాకతీయ విశ్వ విద్యాలయం, 41పు.

35. ప్రమాణగ్రంథావళి. హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయశాఖ, 1966; 88పు. ప్రామాణిక గ్రంథాల వివరాలు ఇందులో దొరుకుతాయి.

36. బుచ్చిబాబు వాఙ్మయ జీవితసూచిక. కాత్యాయినీ విద్మహే కూర్పు. వరంగల్: కాకతీయ విశ్వవిద్యాలయం.

37. బౌద్ధ వాఙ్మయము. మహాకారుణిక్ తెలుగు మాసపత్రిక, 1956 మే సంచికలో ప్రచురితం. ఇందులో సంస్కృతం, పాలీ, హిందీ, తెలుగు భాషల్లోని బౌద్ధ సారస్వతవివరాలు దొరుకుతాయి.

38. మహాత్మాగాంధీ శత జయంతి గ్రంథసూచి. వెలగా వెంకటప్పయ్య సంపాదకత్వం. న్యూఢిల్లీ : సోషల్ సైన్సు డాక్యుమెంటేషన్ సెంటర్, 1969. గాంధీజీ పై గల సుమారు

నాలుగు వందల గ్రంథాల వివరాలు లభిస్తాయి. అముద్రితం.

39.ముని మాణిక్యం నరసింహారావు వాఙ్మయ విశేషసూచిక. డి. విమలా బాయి. కాకతీయ విశ్వవిద్యాలయ సిద్ధాంత వ్యాసం, 1982. అముద్రితం.

40. వయోజన సాహిత్య సూచి. వెలగా వెంకటప్పయ్య సంపాదకత్వం హైదరాబాదు: వయోజనవిద్యా వనరుల కేంద్రం ద్వారా ప్రచురణకానున్నది. అముద్రితం.

41 విశ్వనాథ వాఙ్మయ సూచిక. కేతవరపు రామకోటిశాస్త్రి, కోవెల సంపత్కుమారాచార్య సంపాదకత్వం. వరంగల్ : తెలుగు విభాగం, స్నాతకోత్తర విద్యాకేంద్రం, 1974; 102పు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రచనల, వాటిపై గల రచనల సూచి ఇది.

42. విశ్వవిద్యాలయాలలో తెలుగు పరిశోధన. (తెలుగులో పరిశోధన-రజతోత్సవ సంచికలో 399-438). హైదరాబాదు: ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆగస్టు, 1983. పి.హెచ్.డి , డి.లిట్.,ఎం.లిట్.,ఎం.ఫిల్.,ఎం.ఎ.ఆనర్స్, ఎం.బి.ఎల్., పట్టాను పొందిన పరిశోధకుల పేర్లు, విషయం, సంవత్సరం, పర్యవేక్షకుని పేరు, విశ్వవిద్యాలయం పేరు 1929-1983 వరకు ఉన్నాయి.

43. వీరేశలింగం కవి రచనలు. అక్కిరాజు రమాపతిరావు సంపాదకత్వం. గ్రథాలయ సర్వస్వం, 1963 జనవరి, ఫిబ్రవరి మార్చి సంచికలు.

44. వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ సూచిక. ఎం. చెన్నప్ప. ఉస్మానియా విశ్వవిద్యాలయం సిద్ధాంత వ్యాసం, 1983. అముద్రితం.

45. వ్యాసరచనల సూచి. (1875-1972) నేలనూతుల శ్రీకృష్ణమూర్తి సంపాదకత్వం. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1977; 31, 1663పు. 1875-1972 మధ్య కాలంలో ప్రచురింపబడిన వ్యాసాల సూచి.

46. వ్యవసాయ ధురీణ గోటేటి జోగిరాజు సారస్వతము. గ్రంథాలయ సర్వస్వము. 1954 డిశంబరు సంచికలో ప్రకటితం.

47. రవీంద్రగ్రంథసూచి. వెలగా వెంకటప్పయ్య సంగ్రహకత్వం. గ్రంథాలయ సర్వస్వము, అక్టోబరు 1961 సంచికలో ప్రచురితం.

48. రాయప్రోలు వాఙ్మయ జీవితసూచిక. కాత్యాయినీ విద్మహే కూర్పు. విమర్శిని పరిశోధన పత్రిక, వరంగల్ : కాకతీయ విశ్వ విద్యాలయం, జనవరి, 1979.

49. శాస్త్రీయ వాఙ్మయసూచిక. (1867-1965) వెలగా వెంకటప్పయ్య సంగ్రహకత్వం. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సైన్సు అకాడమి, మార్చి, 1967; 24, 304పు; 21 సెం. మీ. 1863 నుండి 1965 వరకు తెలుగులో అచ్చయిన శాస్త్ర గ్రంథాల వివరణలు ఈ సూచికలో లభిస్తాయి.

50. సమాజ విజ్ఞానం. ప్రధానవ్యాససూచి. హైదరాబాదు : భారతసమాజ విజ్ఞాన పరిశోధన మండలి, దక్షిణ ప్రాంతీయ కేంద్రం. 1978 నుండి 6 మాసాల కోతూరి ప్రచురణ.

## BIBLIOGRAPHY OF BIBLIOGRAPHIES IN ENGLISH AND HINDI ON TELUGU AND PERIODICALS

51. Annotated Bibliography of Indian periodicals for childern. Bombay: SNDT University, 1979.

52. Annotated Bibliography. XXI National Prize Competitions Children's Literatures. J.C. Bubey, S.J. Verma-Compiler : New Delhi: National Council for Educational Research and Training, 1979.

53. Bibliography of Bibliographies on India. D. R. Kalia and M. K. Jain (Ed.) New Delhi : Concept Publishing Co., 1976. 820 p.

54. Bibliography of Children's Books in India. New Delhi : Children's Book Trust, 1983. Telugu Section Compiler V. Venkatappaiah p. 573-598.

55. Bibliography of Dictionaries and Encyclopaedias. Calcutta : National Library, 1964.

56. Catalogue of the Telugu Languages. K. Navlani and N. N. Gidwani (Ed.) Jaipur : Saraswat Publications, 1972, iv 370 p.

57. Hindi Tadhabharateeyabhasha Ki sandarbhika. New Delhi : Central Hindi Directorate, 1970.

58. Indian Periodicals in Print. 1973. N.N. Gidwani J.L.S. Agarwal (Ed.) Delhi : Vidya Mandal, 1973;294 p.

59. Indian National Bibliography 1958-1976. Calcutta : Central Reference Library, 1970.

60. Indian Reference Sources. H.D. Sharma and others (Ed.) Varanasi Indian Bibliographic Centre, 1972.

61. Indian Languages Bibliography H.D. Sharma and others (Ed.) Varanasi Indian Bibliographic Centre, 1972.

62. Indian Scientific and Technical Publications, New Delhi : CSIR, 1960 and 1966.

63. National Bibliography of Indian Literature 1901-1953. 4 Vols. New Delhi : Sahitya Academi, 1974. Telugu Section Ed : G. V. Seetapati. 230 to 420 p. Index.

64. Press in India 1931. List of Periodicals Published in india. New Delhi : Government of India.

65. Reference Tools in Telugu by Velaga Venkatappaiah. (1977) (Manuscript).

—(o)—

ఆచార్య ఎ. ఎ. ఎన్. రాజు

# 2.2 వర్గీకరణసమస్యలు—వాఙ్మయ నియంత్రణ

## విజ్ఞానవిశ్వం – వికాసం

నాగరికత వికసించిన నాటినుండి మానవ పరిజ్ఞానం అభివృద్ధి చెందుతునే ఉంది. ఈ విజ్ఞాన విశ్వం క్రమంగా వృద్ధి చెంది ఇరవయ్యో శతాబ్దంలో వెల్లువగా పరిణమించింది. ఈ విజ్ఞాన వెల్లువను ఆంగ్లంలో Knowledge Explosion అని పేర్కోవటం జరిగింది. ఈ వెల్లువ పుస్తకాలు, పత్రికలు, పరిశోధన వ్యాసాలు, నివేదికలు, సిద్ధాంత వ్యాసాలు, సదస్సులు, సమావేశాలు మొదలైన ప్రచురణలు, కరపత్రాలు, ఇంకా అనేక ఇతర మాధ్యాల్లో రూపుదిద్దుకొని మానవాళి సాధించిన సాహిత్య సంపదగా వృద్ధి చెందుతున్నది.

## విజ్ఞానం – దాని నైజం

విజ్ఞానం అనంతం. అపారం. గతిశీలం.బహుముఖం. అవిచ్ఛిన్నం. నాగరికత వృద్ధిచెందే కొలది మానవ పరిజ్ఞానంకూడా వృద్ధిచెందుతుంది. అనేక దిశలుగా, అంశాలుగా విస్తరిస్తుంది. వివిధ విషయాలకు సంబంధించిన విజ్ఞానం పఠన సామగ్రి రూపాల్లో నిక్షిప్తం కావించబడి ప్రసారమవుతుంది. ఉప్పెనగా వ్యాప్తమవుతున్న విజ్ఞానాన్ని అదుపుచేసి, క్రమపరచి కావలసినవారికి సరియైన సమాచారాన్ని సమగ్రంగా, నిర్దిష్టంగా, అతిత్వరగా అందచేయడం గ్రంథాలయాలకు ఒక పెద్ద సమస్యగా తయారైంది. దీనినే గ్రంథాలయ శాస్త్రజ్ఞులు "వాఙ్మయ వ్యవస్థీకరణ –

నియంత్రణ" (Bibliographic Organisation and control) అన్నారు.

## వాఙ్మయ వ్యవస్థీకరణ-నియంత్రణ

వాఙ్మయ వ్యవస్థీకరణ - నియంత్రణ అనే భావనను నిర్వచించటం, వివరించటం కొంత కష్టసాధ్యమే. ఈ క్షేత్రంలో నిష్ణాతులైన పండితులు వివిధ దృక్పథాల్లో దీనిని నిర్వచించారు. వాఙ్మయ నియంత్రణ అంటే "మానవ సంసర్గానికి సంబంధించిన గ్రంథాలు, తదితర పఠన సామగ్రిని జాబితాచేసి, ఆ విధంగా ఏర్పడే వాఙ్మయ వివరణల ద్వారా వాటిని గరిష్ట ఉపయోగానికి తీసుకురావటం". వాఙ్మయ వ్యవస్థీకరణలో పుస్తక ప్రచురణ మొదలుకొని దాని లభ్యతను పెంపొందించే కార్యక్రమాలన్నిటిని క్రమబద్ధం చేయటం ప్రధాన ఉద్దేశ్యం. అయితే ఒక్కొక్కప్పుడు ఈ రెంటిని పర్యాయపదాలుగాకూడా ఉపయోగించటం కనిపిస్తుంది. వాస్తవానికి ఒకటి సాంకేతిక ఉద్దేశ్యసాధన విషయాన్ని, రెండవది భౌతికరూపసాధన విధానాన్ని సూచిస్తాయి.

వాఙ్మయ వ్యవస్థీకరణ, వాఙ్మయ నియంత్రణ పూరక, అనుపూరక అంశాలు. అయితే వాఙ్మయ నియంత్రణను వాఙ్మయ వ్యవస్థీకరణలో ఒక భాగంగాకూడా గ్రహించవచ్చును. లిఖిత, అచ్చు లేదా ఇతర రూపాల్లో ప్రచురించబడే విజ్ఞానాన్ని సంపాదించటానికి మార్గాలను అన్వేషించటం, అనువర్తించటం, ఇందలి ముఖ్య ఉద్దేశ్యం. ఈ విధానంలో వర్గీకరణ ఒక సాధనంగా వాఙ్మయ నియంత్రణను సాధించటానికి సహాయపడుతుంది.

## వర్గీకరణ ఆవశ్యకత

గ్రంథస్థ విషయాల ఆధారంగా పుస్తక సామగ్రిని సేకరించి, పొందుపరచి, వాటిమధ్య ఉండే విషయ సంబంధాలకు అనుగుణంగా

క్రమబద్ధంచేసి అమర్చడానికి వర్గీకరణ ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇలా పఠన సామగ్రిని గ్రంథాలయాల్లో ఏర్పాటుచేస్తే చదువరులకు ఎంతో అనుకూలంగా ఉంటుంది. విద్యావిషయక, ప్రత్యేక గ్రంథాలయాల్లో సామాన్యంగా చదువరులు నిర్దిష్ట విషయాలమీద పుస్తకాలు, ఇతర పఠన సామగ్రిని కోరుతారు. ఈ నిర్దిష్ట విషయ అవసరం తీర్చటానికి పఠన సామగ్రిని విషయక్రమంలో ఏర్పాటు చేయాలి. ఈ వర్గీకరణ ప్రక్రియ అంత సులభంకాదు. పఠనసామగ్రిని వర్గీకరించి అత్యుత్తమ క్రమపద్ధతిలో ఏర్పాటు చేయటంలో కొన్ని సమస్యలు ఎదురౌతాయి. ఈ సమస్యలను క్లుప్తంగా ఈ కింద వివరించటమైంది.

## వర్గీకరణ విధానం

గ్రంథాలయ కీర్తి ప్రతిష్టలు అది అందించే సేవలపై ఆధారపడి ఉంటాయి. ఈ సేవలకు ఒక నిర్దుష్ట వర్గీకరణ విధానం ఆధారం కావాలి. అందువల్ల వర్గీకరణ ప్రక్రియా విధానాన్ని అమలుచేయటంలో గ్రంథాలయం తగిన నిర్ణయాన్ని తీసుకోవాలి. ముఖ్యంగా విద్యాసంస్థల గ్రంథాలయాలకు, ప్రత్యేక గ్రంథాలయాలకు, అలాగే పెద్ద పౌరగ్రంథాలయాలకు వర్గీకరణ విధానం ఎంతో అవసరం. దీనికి గ్రంథాలయ సంకలన పరిమాణం, స్వభావం, విషయప్రాతినిధ్యం, ఉపయోక్తలు, వారి విషయ ఉపగమనాలు మొదలైన అంశాలను పరిశీలించటం జరగాలి.

## వర్గీకరణ పథకాలు

గత వంద సంవత్సరాల్లో ఎన్నో సాధారణ వర్గీకరణ పథకాలు రూపొందించబడినాయి. ఈ పథకాల్లో కొన్నిమాత్రమే అమలులో ఉన్నాయి. ముఖ్యంగా దశాంశ, విశ్వదశాంశ, కాంగ్రెసు గ్రంథాలయ వర్గీకరణ పథకాలు చాలవరకు గ్రంథాలయాల్లో అన్ని దేశాల్లోను వాడుకలో ఉన్నాయి. అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో హెచ్చుశాతం విద్యా

సంస్థల గ్రంథాలయాలు కాంగ్రెసు గ్రంథాలయ వర్గీకరణ పథకాన్ని, హెచ్చు సంఖ్య పౌర గ్రంథాలయాలు దశాంశ వర్గీకరణ పథకాన్ని అమలు చేస్తున్నాయి. ఇతర దేశాల్లో పౌర గ్రంథాలయాలు చాలవరకు దశాంశ వర్గీకరణ పథకాన్ని, ప్రత్యేక గ్రంథాలయాలు విశ్వదశాంశ వర్గీకరణ పథకాన్ని వాడుతున్నాయి.

ద్విబిందు వర్గీకరణ పథకాన్ని మనం "జాతీయ పథకం"గా గుర్తించినప్పటికి, మన గ్రంథాలయాల్లో దీని అమలు అతి స్వల్పం. సుమారు ఇరవై విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, కర్ణాటక రాష్ట్రంలో పౌర గ్రంథాలయాలు ఈ ద్విబిందు వర్గీకరణ పద్ధతిని ఉపయోగిస్తున్నాయి. ఈ అనాదరణకు కారణాలు ఏమిటి ? అని తర్కించటం ఇక్కడ అప్రస్తుతం.

## వర్గీకరణ సమస్యలు

విషయ ఊహారచన, రూపకల్పనలు (Formation of Knowledge) ఏయే విధాల్లో జరుగుతుందనే విషయాన్ని నిర్ణయించటం, వివరించటం చాలా కష్టం. విషయాలు కోకొల్లలు. వాటి రూపాలు ఎన్నో విధాలు. వాటి మధ్య సంబంధాలు అనూహ్యం. వివిధరకాల సంపర్క సమ్మేళన ప్రభావాల ఫలితంగా కొత్త కొత్త విషయాలు ఆవిర్భవించి వృద్ధిచెందటం వర్గీకరణ విషయంలో పరిష్కరించవలసిన సమస్యలు. ఇవి వర్గీకరణ పథకాల మీద, అలాగే వర్గీకరణ ప్రక్రియలమీద ఎంతో ఒత్తిడిని, క్లిష్టతను కలిగిస్తాయి. వర్గీకరణ పథకాలు వీటిని సాధించాలి.

## నిర్దిష్ట విషయం - వివిధ దృక్పథాలు

ఇంతవరకు రూపొందించబడిన సాధారణ వర్గీకరణ పథకాలు సాంప్రదాయక విద్యా విభాగాల (Traditional disciplines) ఆధారంగా రూపొందించబడినవి. ప్రతి పథకంలో పరిజ్ఞానాన్ని ప్రథమంగా

విజ్ఞాన శాస్త్రాలు, సాంకేతిక శాస్త్రాలు, సమాజశాస్త్రాలు, మానవీయ శాస్త్రాలు లేదా కళలుగా విభజించి ఆ తరువాత ప్రతి విభాగాన్ని ప్రధాన వర్గాలుగా, ప్రతి ప్రధాన వర్గాన్ని ఉపవర్గాలుగా విభజించటం ఒక పద్ధతిగా ఏర్పడినట్లు కనిపిస్తుంది. అయితే అనూచానంగా అనువర్తించే భాజన విధానం ప్రస్తుతావసరాలకు సరిపడకపోవచ్చును. ఉదాహరణకు 'సౌరశక్తి' (Solar Energy)నే తీసుకుందాం. ఇది ప్రధాన వర్గంకాదు. ఒక పృథక్కరణాంశం (Isolate). ఈ విధ నిర్దిష్ట విషయాలు ప్రధాన వర్గ భాగాలుగా చూపించబడతాయి. సౌరశక్తి ఉపయోగం ఎన్నో విధాలు. ఈ ఉపయోగాలను వివిధ కోణాల్లో వివరించవచ్చును. ఆ వివిధ సాహిత్యాలను ఎలా వర్గీకరించాలి ? ఏ విధంగా గ్రంథాలయంలో విషయ ఉపగమనానికి వీలుకల్పించాలి? చదువరులకు ఈ విషయాలను ఎంత సులభంగా అందించవచ్చు? ఇవి ముఖ్య సమస్యలు. దీనికి ప్రస్తుతం అమలులో ఉన్న సాధారణ వర్గీకరణ పథకాల్లో సంతృప్తికరమైన సమాధానం లభించదు.

## అంతర్విషయ సంబంధాలు

విషయాలు పరస్పర సహజ సంబంధాలు కలిగి ఉంటాయి. ఒకే విషయమైన దృక్పథాలు, అంశాలు, సందర్భాలు అనేవి ఒక రకం. అలాగే స్థూల-నిర్దిష్ట విషయ సంబంధాలు మరోరకం. అంతర్భాగాలు, అంతర్విషయ అధ్యయనాలు, బహువిషయ సంబంధ అధ్యయనాలు, పరివ్యాప్త విషయాలు అని మరెన్నో విధాలు. వర్గీకరణ పథకాలు ఈ సంబంధాలను తప్పనిసరిగా పరిగణించాలి. ఉదాహరణకు వివిధ క్షేత్రాల్లో గణాంక శాస్త్ర అనువర్తనంవల్ల Bibliometrics, Librametry, Scientometrics, Econometrics, Biometrics మొదలైన నూతన విషయాలు ఆవిర్భవించాయి. ఇలాగే గణాంక శాస్త్ర అనువర్తనం ఎన్నో శాస్త్రాల్లో కార్యక్రమాల్లో ఉంది. ఈ విషయాలకు

సంబంధించిన గ్రంథ సంపదను గణాంకశాస్త్ర వర్గంకింద చూపటమా లేదా వివిధ విషయాల కింద చూపటమా అనేది వివాదాస్పదంగా కనిపిస్తుంది. అయితే తార్కిక వర్గీకరణ అనేది వర్గీకరణ పథక నిర్మాణంలో ఒక ముఖ్య సూత్రం. అనుల్లంఘనీయం.

## ప్రధానవర్గాల పెరుగుదల

విజ్ఞానం ఊహించలేనంత వేగంగా విస్తరించటం వల్ల ఒకదశలో ఉప విభాగాలు, పృథక్కరణాంశాలుగా ఉన్న విషయాలు క్రమంగా ప్రధాన వర్గాల స్థాయికి ఎదగటం జరుగుతుంది. ఫలితం ప్రధాన వర్గాల సంఖ్య పెరగటమే. World of learning, Ulrich's international periodical Directory, British National Bibliography మొదలైన ప్రచురణలను పరిశీలిస్తే నూతన విషయాలపై ఎన్ని పరిశోధన సంస్థలు, సంఘాలు స్థాపించబడుతున్నాయో, ఎన్నెన్ని పుస్తకాలు, పత్రికలు వెలువడుతున్నాయో తెలియగలదు.

ద్విబిందు వర్గీకరణ ప్రథమ కూర్పు (1933) లో ఇరవైమూడు ప్రధాన వర్గాలుఉంటే, ఆరవ కూర్పు (1960) లో యాభైమూడు అయ్యాయి. ఏడవకూర్పు (1987)లో వందకు మించి ఏర్పడ్డాయి. ఈ విధంగానే ఇతర వర్గీకరణ పథకాల్లోకూడా నూతన వర్గాలసంఖ్య పెరుగుదలను గమనించవచ్చు. ఈ వర్గాల కింద నూతన పట్టికలతోబాటు పాత వర్గాల పట్టికల్లోకూడా మార్పులు చేర్పులు సహజంగానే వస్తాయి. ఉదాహరణకు దశాంశ వర్గీకరణ పథకం 19 వ కూర్పు (1979)లో సాంఘికశాస్త్ర ప్రధానవర్గానికి, రాజకీయ శాస్త్రంలో రాజకీయ పత్రికలకు గ్రేట్ బ్రిటన్ భౌగోళిక విభాగాలకు నూతన పట్టికలు తయారు చేయబడినాయి. వర్గీకరణ పథకాల్లో వచ్చే మార్పులు చేర్పుల ప్రభావం గ్రంథాలయాల్లో జరిగే వర్గీకరణ ప్రక్రియపై కనిపిస్తుంది. పునః వర్గీకరణ అవసరం ఏర్పడుతుంది. ఇది ఎంతవరకు సాధ్యం?.

## వర్గీకరణ ప్రాథమిక రూపనిర్మితి : మార్పులు

పరిజ్ఞాన విస్తరణకు ఏ వర్గీకరణ పథకంకూడా అతీతం కాదు. మార్పులకు అనుగుణంగా వర్గీకరణ పట్టికల్లో సవరణలు తీసుకురావాలి. సాధ్యమైనంతవరకు వర్గీకరణ పథక నిర్మితిలో మౌలిక మార్పులు చేయరాదు. అలా చేస్తే గ్రంథాలయాల్లో వర్గీకరణ విషయంలో ఆచరణ సమస్యలు ఏర్పడతాయి. దశాంశ వర్గీకరణ పథకంలో ఎన్నిమార్పులు, చేర్పులు ప్రవేశపెట్టినా, మౌలిక నిర్మితిలో మాత్రం మార్పులు తీసుకు రావటంలేదు. ఈ విధానం స్థిరంగాకొనసాగుతూ ఉంది. దీనిని (Integrity of Numbers) అని అంటారు. వర్గీకరణ పథకంలో సాధ్యమైనంత వరకు మౌలిక నిర్మితికి మార్పులు చేయకుండా పరిజ్ఞాన వ్యాప్తి-విస్తరణకు అనుగుణంగా సవరించి గ్రంథాలయ అవసరాలను తీర్చే విధంగా ఉండాలి.

## స్థానిక గ్రంథాలయ అవసరాలు

వర్గీకరణ పథకాలు స్థానిక అవసరాలను కూడా తీర్చేవిగా ఉండాలి. అందుచేత వీటి అనువర్తనలో ప్రత్యామ్నాయ వర్గ సంఖ్యలు, ఐచ్ఛికాలు (Options) స్థాన నిర్దిష్టాలు చేకూర్చే విధంగా గమనికలు నిబంధనలు, సడలింపులు మొదలైనవి ఉండి వర్గీకారులకు కావలసిన స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించటం జరగాలి. ఆయా సాంస్కృతిక భాషా వర్గాలకు సంబంధించిన ప్రత్యేక విషయాలను వివరించే పుస్తకాదులను వర్గీకరించటానికి వీలుండాలి. ఈ ఏర్పాట్లు లేని పథకాలు వాడటంవల్ల ఎన్నో చిక్కులు, సందిగ్ధాలు ఉత్పన్నమవుతాయి, గ్రంథాలయాలు వీటిని పరిష్కరించుకోవటం కష్టం.

## వర్గీకరణ ప్రయోగ సమస్యలు

ఒక వర్గీకరణ పథకాన్ని అనువర్తించటం, ఆ పరిధిలో స్థానిక అవసరాల మేరకు పుస్తకాలను వర్గీకరించటం అనుకున్నంత సులభం కాదు. వర్గీకరణలో నిర్దిష్ట విషయ నిర్ణయం అత్యంత ప్రధానాంశం. అంటే-పుస్తకంలో తర్కించిన విషయాన్ని వర్గీకరణ ప్రక్రియలో సరియైన వర్గ సంఖ్యనిచ్చి నిర్దిష్టపరచటం జరగాలి. ఇది వర్గీకారునికి వర్గీకరణ పథకంతో ఉన్న నిశిత పరిచయం మీద ఆధారపడి ఉంటుంది. విషయ పరిజ్ఞానంతోబాటు వర్గీకరణ పథక స్వరూప స్వభావ పరిజ్ఞానం కూడా అవసరం. అప్పుడే వర్గీకరణ కార్యవిధిని సమర్థవంతంగా నిర్వహించవచ్చును.

వర్గీకరణ పథకాన్ని అందులో వివరించిన ఆదేశాలను, సూచనలను, తదితర నిబంధనలను క్షుణ్ణంగా తెలిసికొని అనువర్తించకపోతే ఎన్నో ఒడిదుడుకులకు, అసంగతాలకు దారితీస్తుంది.

స్థానిక అవసరాలను తీర్చటంలో వర్గీకరణ పట్టికలకు మార్పులు చేర్పులు, విస్తరణలు చేయగలిగిన మెలుకువలు ఉండాలి. అలా చేసినప్పుడే వాఙ్మయ నియంత్రణోద్దేశ్యాలను స్థానికంగా సాధించటం జరుగుతుంది.

అనుగుణ్యత వర్గీకరణ ప్రయోగ కుశలతకు జీవగర్ర. ఈ గుణం పాటించకపోతే ఒకే నిర్దిష్ట విషయంపైగల పుస్తకాలు ఒకేచోట కాకుండా వివిధ చోట్లలో చెదరి ఉంటాయి. గ్రంథాలయ సాంకేతిక విభాగంలో (Technical Section) ఈ విధమైన సమస్యలను పరిష్కరించటానికి ఒక ప్రక్రియాదీపికను (Procedure Manual) రూపొందించి వాడటం అవసరం. ఈ విధంగాచేస్తే వర్గీకరణలో అనుగుణ్యత, ఏకరూపత

సాధించవచ్చును. వాఙ్మయ నియంత్రణతోబాటు, భౌతిక నియంత్రణను కూడా సాధించవచ్చును.

## ఉపసంహారం

వాఙ్మయ నియంత్రణ సాధనకు వర్గీకరణ జీవం వంటిది. ఇతర ప్రక్రియలు, అందు నిమిత్తం ఉపయోగించే వాఙ్మయ పరికరాలు ముఖ్యంగా సూచీకరణ - వర్గీకరణకు పూరకం కావాలి. వర్గీకరణలో పరిష్కరించలేని సమస్యలను సూచీకరణ ద్వారా పరిష్కరించవచ్చును. అందువల్ల ఈ రెండు ప్రక్రియలు ముఖ్యమైనవి. వాఙ్మయ వ్యవస్థీకరణ-నియంత్రణలో తలఎత్తే సమస్యలను పరిష్కరించటంలో ఈ రెండు సాధానాల పాత్ర అతిముఖ్యం.

—(o)—

డా॥ పి. సోమరాజు

# 2. 3 తెలుగు పుస్తకాలు : వర్గీకరణ సమస్యలు

## విజ్ఞాన విశ్వం

విజ్ఞానం విలువైంది. మానవ మనుగడకు, సమాజ శ్రేయస్సుకు, ఆర్థిక పారిశ్రామిక సమగ్రాభివృద్ధికి విజ్ఞానం అత్యంతావశ్యకం. ఆధునిక కాలంలో విజ్ఞానం అతివిలువైన ముడిసరుకుగా పరిగణింపబడుతోంది. అందుచేత విజ్ఞానాభివృద్ధికి నిరంతరం కృషి జరుగుతూనే ఉంది. ఈ విధంగా మానవాళి సముపార్జించిన విజ్ఞానం మొత్తాన్ని "విజ్ఞాన విశ్వం" (Universe of Knowledge) అంటారు. వివిధ అంశాలపై సాధ్యమైన ఈ విజ్ఞాన విశ్వం వివిధ రకాలైన పుస్తకరూపాల్లో నిక్షిప్తమైంది. పుస్తకరూపంలో ఉన్న విజ్ఞాన సంపదను సమాజంలో అందరికీ అందివ్వడమే గ్రంథాలయాల పరమావధి.

## గ్రంథాలయ ఆశయాలు

గ్రంథాలయాలు విజ్ఞాన నిలయాలు. ప్రజల విజ్ఞానావసరాలు తీర్చే సాంఘిక సేవా సంస్థలు. పుస్తక రూపంలో ముద్రితమైన విజ్ఞాన సంపదను సేకరించి, అభివృద్ధి చేయడం గ్రంథాలయాల ఆదర్శం. సేకరించిన పుస్తకాలను వివిధ వాఙ్మయ ప్రక్రియలద్వారా ఒక క్రమపద్ధతిలో ఉపయోగించటానికి వీలుగా వ్యవస్థీకరించటం ప్రధాన విధి. అడిగిన వెంటనే కావలసిన గ్రంథాన్ని లేదా సమాచారాన్ని పాఠకుడికి అందజేయటం ప్రధానకర్తవ్యం. ఈ లక్ష్యసిద్ధి దిశగానే గ్రంథాలయాలన్నీ పనిచేస్తాయి.

అయితే ఈ విజ్ఞాన సేవ అంత సులభంకాదు. గ్రంథాలయాలు అనునిత్యం అభివృద్ధి చెందే స్వభావం కలవి. పుస్తకాలు, పాఠకులు వారి విజ్ఞాన అవసరాలు ఎప్పటికప్పుడు మారుతూ, పెరుగుతూ ఉంటాయి. గ్రంథాలయాల్లో పుస్తకాలు అధిక సంఖ్యలో ఉంటాయి, ఉండాలి. అలా ఎక్కువ సంఖ్యలో ఉన్న పుస్తకాల్ని ఒక క్రమపద్ధతిలో అమర్చటం అవసరం. లేనట్లయితే కావలసిన పుస్తకాన్ని గుర్తించి, సకాలంలో పాఠకునికి అందజేయడం కష్టసాధ్యం. కాబట్టి గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలన్నింటినీ ఒక నిర్దిష్ట పద్ధతిలో సొరుగులలో అమర్చటానికి శాస్త్రీయ పద్ధతిలో వర్గీకరించటం జరగాలి. పుస్తకాల వర్గీకరణ గ్రంథాలయ ప్రథమచర్య. గ్రంథాలయంలో పుస్తకాల వినియోగం, విజ్ఞానసేవ అనేవి ఈ వర్గీకరణ మీదనే ఆధారపడి ఉన్నాయనటంలో ఏ మాత్రం సందేహంలేదు.

## గ్రంథాలయ వర్గీకరణ

"వర్గీకరణ" (Clasificatsion) అనే పదానికి విభజన లేదా ఏకీకరణ అనే అర్థం వస్తుంది. ఉన్న వస్తుసముదయాన్ని వాటి స్వరూప స్వభావాల ఆధారంగా విభజించి, సంబంధ సారూప్యాల ఆధారంగా సంఘటితంచేసి ఒక క్రమంలో అమర్చటమే వర్గీకరణ.

వర్గీకరణ అనేది సృష్టిలోనే అంతర్లీనమై ఉన్నట్లు అనిపిస్తుంది. సృష్టిలో ఎన్నో వస్తువులున్నాయి. కొన్నింటిని చూడగలం, కొన్నింటిని వినగలం, కొన్నింటిని స్పర్శ మాత్రంచే తెలిసికొనగలం. భౌతిక రూపంలో ఉన్నవి...చెట్లు, జంతువులు, మనుష్యులు. మనుషులంతా ఒకే ఆకృతిలో ఉన్నా పరస్పరం వ్యత్యాసాలు స్పష్టంగా ఉన్నాయి. కవలల్లో కూడా వ్యత్యాసముంటుంది. ఇతరులకు తెలియకపోయినా తల్లికి ఈ వ్యత్యాసం తెలుస్తుంది. కాబట్టి సృష్టిలో ప్రతి వస్తువునూ, ప్రాణిని

గుర్తించటానికి, ప్రకృతే ఈ విధమైన వైవిధ్యాన్ని వర్గీకరణను పాటిస్తుందా? అని అనిపిస్తుంది. అదేవిధంగా గ్రంథాలయంలో ఎక్కువ సంఖ్యలో ఉన్న పుస్తకాల్లో ప్రతి ఒక్కదానిని ప్రత్యేకంగా గుర్తించడానికి వాటిని వర్గీకరించటం అవసరం. లేనట్లయితే వాటిని ప్రత్యేకించి గుర్తించలేము. పుస్తకాల విషయాంశాల ఆధారంగా వాటిని వర్గీకరణ చేయాలి. ఇలా చేయడంవల్ల, ఒకే అంశం మీద ఉన్న పుస్తకాలన్ని ఒక దగ్గర చేర్చటానికి వీలౌతుంది. ఈ పద్ధతి పాఠకులకు చాలా ఉపయోగకరం. సాధారణంగా ఈ ప్రక్రియను ఒక నిర్దిష్ట వర్గీకరణ పథకాన్ని అనుసరించి చేస్తారు. ఉదా॥ డ్యూయీ దశాంశ వర్గీకరణ పథకం 2. రంగనాథన్ కోలన్ వర్గీకరణ పథకం. ఈ పథకాల్లో వివిధ విషయాంశాలు కృత్రిమ భాషలో (సంఖ్యలు), తార్కిక క్రమంలో వ్యక్తీకరించబడతాయి. ఆ ప్రకారం ప్రతి పుస్తకానికీ, దానిలో ఉన్న విషయం ఆధారంగా సంకేతాన్ని (సంఖ్య) జతచేసి, ఆ సంఖ్యనిచ్చి వర్గీకరించటం జరుగుతుంది.

## తెలుగుభాష, సాహిత్యం

తెలుగుభాష ఎంతో సరళమైనదీ, సహజసుందరమైనదీ, మధురమైనదీ. అందుకే పాశ్చాత్య పండితులచే "Italian of the East" అని కొనియాడబడింది. అట్టి ఈ తెలుగుభాషలో ఎన్నో ఉద్గ్రంథాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాకరణ శాస్త్ర గ్రంథాలు, అలంకారశాస్త్ర గ్రంథాలు, ఖగోళశాస్త్ర గ్రంథాలు, భూగర్భశాస్త్ర గ్రంథాలు, ఇంకా భౌతిక, జంతు, వృక్ష,వైద్య జీవోత్పత్తి, ధర్మవ్యవసాయ శాస్త్రాదుల్లో అనేక గ్రంథాలు వెలిసి, తెలుగు వాఙ్మయాన్ని సుసంపన్నం చేశాయి. వాఙ్మయ ప్రపంచంలో మహోన్నత శిఖరాల్ని అందుకునేటట్లు చేశాయి.

తెలుగులో అన్ని అంశాలపైనా, గ్రంథాలు—కొద్దో, గొప్పో—వెలువడ్డాయి. చరిత్ర, సంస్కృతి, చిత్రలేఖనం, శిల్పం, వాస్తుకళ,

పురావస్తుశాస్త్రం, మతం, వేదాంతం, ఇంకా ఎన్నో అంశాలపై ప్రామాణిక గ్రంథాలు వెలువడినాయి, ఇంకా వెలువడుతున్నాయి.

ఈ గ్రంథ సంపత్తిని సేకరించి, పరిశోధకులకూ, పాఠకులకూ సమాచారాన్ని అందజేయటం ఉదాత్తమైన ఆశయం.

## తెలుగు పుస్తకాల వర్గీకరణ

గ్రంథాలయాల్లో వర్గీకరణ ఆవశ్యకతను ముందే వివరించటం జరిగింది. వర్గీకరణ చేయటానికి లభ్యమయ్యే పథకాల్లో డ్యూయీ దశాంశ వర్గీకరణ పట్టికలు అనుకూలమైనవిగా భావించబడి, బహుళ ఆదరణలో ఉన్నాయి. కాని వేదాంతం, చరిత్ర, భాష, సాహిత్యం ఇత్యాది విషయాల పట్టికలు చాలవరకు పాశ్చాత్య దృక్పథంతో రూపొందించబడ్డాయి. ఆ కారణంగా ఆసియా సంబంధ విషయాలపై—మతం, వేదాంతం, చరిత్ర, సంస్కృతి, భాష, సాహిత్యం ఇత్యాది—విషయాలపై సమగ్రమైన వర్గ పట్టికలు కావించబడలేదు. ఉదా॥ DDC. Ed: 19 Table: 4 తీసుకుందాం.

1. Written and spoken Codes of the standard form of the language.
2. Etymology.
3. Dictionaries.
4. Grammar.
5. Prosody.
6. Non-Standard forms of the language.
7. Standard usage of the language.

అనే ఉపవిభాగాలు తెలుగు భాషలో ఉన్న గ్రంథజాలాన్నంతటినీ సంతృప్తికరంగా వర్గీకరించటానికి అనువైనవిగా కనిపించవు. ముఖ్యంగా

ఈ పథకం తెలుగు భాష, సాహిత్యాలకు సంబంధించిన విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. డ్యూయీ పథకంలో టేబుల్ నెం.4;టేబుల్ నెం.3 భాష సాహిత్యాలకు సంబంధించినవైనా, అవి తెలుగు భాషాసాహిత్యాలకు అనుగుణంగా లేనందున వాటిని తగువిధంగా సవరించవలసిన అవసరం ఉంది. ఉదా॥ తెలుగు వ్యాకరణంపై తెలుగులోను, సంస్కృతంలోనూ రాసిన గ్రంథాలున్నాయి. పద్యాల్లో, శ్లోకాల్లో, సూత్రాల్లో రాసినవి ఉన్నాయి. విపుల వ్యాఖ్యానాలున్న గ్రంథాలుకూడా ఉన్నాయి.

1. ఆంధ్ర శబ్దచింతామణి : సంస్కృత శ్లోకాల్లో ఉన్న తెలుగు వ్యాకరణ గ్రంథం.
2. అథర్వణకారికావళి : సంస్కృత శ్లోకాల్లో ఉన్న తెలుగు వ్యాకరణ గ్రంథం.
3. ఆంధ్ర భాషాభూషణము : పద్యరూపాంధ్ర వ్యాకరణ గ్రంథం
4. అహోబల పండితీయము : సంస్కృత వ్యాఖ్యానంతో ఉన్న గ్రంథం
5. బాల వ్యాకరణము : తెలుగు వ్యాకరణ గ్రంథం
6. ప్రౌఢ వ్యాకరణము : తెలుగు వ్యాకరణ గ్రంథం
7. వ్యావహారికభాషా వ్యాకరణము : తెలుగు వ్యాకరణ గ్రంథం

ఇంకా వీటిపై ఎన్నో విమర్శ గ్రంథాలు, వ్యాఖ్యాన గ్రంథాలు, సిద్ధాంత గ్రంథాలు, తులనాత్మక పరిశోధన గ్రంథాలు వచ్చినాయి, వస్తున్నాయి.ఈ వ్యాప్తికి అనుగుణంగా డ్యూయీ సూచీలో ఉన్న పట్టీలను మార్పు చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

DDC : Ed. 19 Table No. 3. Sub-divisions of individual literature :

| | | | |
|---|---|---|---|
| 1. | Poetry | 5. | Speeches |
| 2. | Drama | 6. | Letters |
| 3. | Fiction | 7. | Satire Humor |
| 4. | Essays | 8. | Miscellaneous writings. |

పై పట్టికలో తెలుగు సాహిత్యంలోనున్న :

1. అలంకార శాస్త్ర గ్రంథాలు
2. సాహిత్య కోశాలు
3. చంపూ కావ్యాలు
4. పురాణాలు
5. వేదాంత గ్రంథాలు
6. ప్రబంధాలు
7. సంకలనాలు
8. శతకాలు
9. నాటకాలు, నాటికలు
10. నవలలు
11. క్షేత్ర మాహాత్మ్యాలు
12. ఖండకావ్యాలు
13. శైవ సిద్ధాంత గ్రంథాలు
14. జైన గ్రంథాలు
15. సూఫీ గ్రంథాలు
16. మార్క్సు సిద్ధాంత గ్రంథాలు

17. ఇతర భాషా వాఙ్మయాల నుండి అనువాదాలు
18. జీవిత చరిత్రలు
19. ఛందో గ్రంథాలు
20. భాషాశాస్త్ర గ్రంథాలు
21. జానపద వాఙ్మయం
22. పల్లెపదాలు
23. జానపదకళలు
24. జానపద భాష
25. యక్షగానాలు
26. రేడియో ప్రసంగాలు
27. రేడియో నాటికలు
28. రేడియో ఉపన్యాసాలు
29. రేడియో చర్చలు
30. రేడియో సందేశాలు
31. వివిధ దేశాల చరిత్రలు
32. తాళపత్ర గ్రంథాలు

ఇత్యాదులను డ్యూయీ దశాంశ పద్ధతిలో టేబుల్ నెం. 3 ప్రకారం వర్గీకరించడానికి అవకాశం తక్కువ.

భాషా సాహిత్యాలకు సంబంధించి డ్యూయీ పథకంలో ఏర్పరచిన కాలావధి పట్టికల (Periodical Tables)కు తెలుగు భాషాసాహిత్యాల కాలపట్టికలకు వ్యత్యాసం ఉంది.

1. To - 1345
2. 1346 - 1645
3. 1646 - 1845
4. 1846 - 1895
5. 1896 - 1920
6. 1921 - 1940
7. 1940 -

పై పట్టిక ప్రకారం తెలుగు సాహిత్యంలో కాలానుసరణ విభజన ఇమడదు :

1. అజ్ఞాత యుగం (లేదా ప్రాఙ్నన్నయ యుగం)
2. నన్నయ యుగం
3. శివకవి యుగం
4. తిక్కన యుగం
5. ఎఱ్ఱన యుగం
6. శ్రీనాథ యుగం
7. శ్రీకృష్ణదేవరాయల యుగం
8. నాయక రాజుల యుగం
9. క్షీణ యుగం
10. ఆధునికయుగం

ఇత్యాదిగా ఉన్న తెలుగు వర్గీకరణ పై పట్టికలో ఇమడదు కదా!

ఈ కారణంగా తెలుగు సాహిత్యానికి సంబంధించిన కాలావధికి ప్రత్యేకమైన పట్టిక ప్రవేశ పెట్టాల్సిన అవసరముంది.

తెలుగు భాషా సాహిత్యాల్లో పలు ప్రబంధాలపై, రచనలపై, ఎన్నో విమర్శలు, వ్యాఖ్యానాలు, పరామర్శలు, సమీక్షలు, సిద్ధాంతాలు, ఖండన

మందనలు ఉన్నాయి. కాబట్టి పుస్తకాల వర్గీకరణకు వీలుగా, ప్రస్తుత మున్న ఉప విభాగాల పట్టికలు, మూలపట్టికలు కూడ మార్పు, అభివృద్ధి కావాలి.

## సూచనలు

తెలుగు విశ్వవిద్యాలయం ఎన్నో ఉన్నతాశయాలతో స్థాపించ బడింది. దానికి గ్రంథాలయం తోడ్పాటు ఎంతో అవసరం. ఈ విశ్వ విద్యాలయం, విశ్వవిద్యాలయ స్థాయిలో ప్రామాణిక గ్రంథాల సేకరణ, తద్విధ సంకలనాభివృద్ధిని చేపట్టడం ముదావహం. ఈ సదస్సు ఏర్పాటు చేసి పలువురు మేధావులు, శాస్త్రనిపుణులు మొదలైన వారి సలహా సంప్ర దింపుల నేర్పాటు చేయటంలో విశ్వవిద్యాలయ కులపతి, గ్రంథాలయాధి కారి పాత్ర శ్లాఘ్యం.

తెలుగు పుస్తకాల వర్గీకరణ విషయమై, నిపుణులతో ఒక తాత్కాలిక సంఘాన్ని ఏర్పరిచి, తెలుగు వాఙ్మయాన్ని దృష్టిలో ఉంచు కొని డ్యూయీ వర్గీకరణ పథకానికి తగిన సవరణను తేవాలి. ఆవిధంగా చేయటంవలన డ్యూయీ పథకంలో ఈ విషయమై ఏర్పడే సమస్యలను అవసరాలకు అనుగుణంగా పరిష్కరించుకోవచ్చు.

—(०)—

యం వి. వేణుగోపాల్

# 2.4 సూచీకరణ వాఙ్మయ నియంత్రణాలు ఉద్దేశ్యసాధనా సమస్యలు

పుస్తకాలు మానవాళి సాధించిన సాంస్కృతిక-నాగరిక జీవనానికి కళాకౌశలాలకు, వాటికే దర్పణం పట్టే సాహిత్య సారస్వతాలకు గీటు రాళ్ళుగా ఆయా సమాజాల్లోనే కాకుండా అంతర్జాతీయంగా కూడ ప్రాముఖ్యాన్ని కలిగి ఉన్నాయనటం ఏమాత్రం యథార్థ దూరంకాదు. అందుచేతనే గ్రంథాలయాలు సహజ సాంఘిక ధోరణిలో ఆవిర్భవించి సాంస్కృతిక నిలయాలుగాను, సామాజిక సేవా సంస్థలుగాను వృద్ధి చెందటం జరిగింది. ఇది పరిణామ విషయం.

గ్రంథాలయాలు చేసే సామాజిక సేవలు వాఙ్మయ పరమైనవి. ఇందుకు పుస్తకాలే ప్రబలాధారాలు. ఈ సేవలకు స్థలం, కాలం, జాతి, సంస్కృతి, భాష మొదలైన వివక్షతలు, అవరోధాలు ఉండవు, ఉండ కూడదు. అంటే వీటిని అధిగమించాలి. గ్రంథాలయ నిర్వహణలో, ముఖ్యంగా వనరుల వ్యవస్థీకరణ (పుస్తకాల భౌతిక నియంత్రణ), సూచీకరణ-వర్గీకరణ (వాఙ్మయ నియంత్రణ) మొదలైన విధులలో ఇవి సమస్యలుగా ఏర్పడతాయి. ఈ సమస్యలు తగిన పరిష్కారాలను అందుకున్నప్పుడే గ్రంథాలయ ఆశయసిద్ధికి, వాఙ్మయ నియంత్రణ ఉద్దేశ్య సాధనకు వీలు కలుగుతుంది.

పుస్తకాలు కేవలం కళాకృతులు, భౌతిక వస్తువులు మాత్రమే కావు. అవి ప్రజ్ఞులు, విజ్ఞులు, విదులు బుధులు, సృష్టించిన విజ్ఞాన నిక్షేపాలు, సంసర్గ మాధ్యాలు. అందుచేత వాటి ఉపయోగం విస్తారం.

అందరికీ ఏదో ఒక విధంగా అవసరమౌతాయి. ఈ అవసరం భాషాది అవధులను దాటి ఉపయోక్తలకు అనుకూలమైన విధాల్లో వాఙ్మయ నియంత్రణ, గ్రంథ లభ్యతలను సాధించవలసిన ఆవశ్యకతను నిర్దేశిస్తుంది. అంటే వాఙ్మయ (ప్రచురణల) వివరాలతోబాటు వాఙ్మయ వస్తువులను (పుస్తకాది సామగ్రిని) కూడ ప్రపంచ వ్యాప్తంగా అందరికి అందుబాటులోకి తీసుకురావాలి. ఈ రెండు కార్యాలూ ఒకదానికొకటి ఆధారం, పూరకం. వాఙ్మయ వివరణ లక్ష్యం ప్రచురణ ప్రకటనలు (ఉదా॥ జాతీయ వాఙ్మయ సూచీలు, అనుక్రమణికలు, సంక్షేపాలు, సమీక్షలు మొదలైన వాఙ్మయ పరికరాలు) లేని పక్షం సాధ్యంకాదు. వాఙ్మయ వివరణ లక్ష్యం చేకూరనప్పుడు పుస్తక సమీకరణ, గ్రంథాలయ సేవలు సంతృప్తికరంగా సాధించటానికి వీలుతక్కువ.

వాఙ్మయ, గ్రంథాలయ చరిత్రలను పునరాలోకనం చేస్తే, వాఙ్మయ సూచీకరణము, వర్గీకరణము, గ్రంథాలయ సూచీకరణము, ప్రలేఖనము, తదితర పుస్తకప్రమేయమైన ప్రక్రియల్లో అంతర్జాతీయ దృక్పథం, ప్రమాణీకృతం మొదలైన భావాలు వాటి ఆచరణావసరాలు వృద్ధిచెంది క్రమేపి విశిష్టఆచరణ రూపాలను దాల్చటం గ్రహించవచ్చును. ఈ పరిణామానికి క్రమంగా వస్తున్న సాంఘిక మార్పులు, వృద్ధిచెందుతున్న సాంకేతిక సౌకర్యాలు, అధికాధికంగా విస్తరిస్తున్న ప్రచురణా బాహుళ్యం, నిత్యనూతనంగా అధిగమిస్తున్న మానవ పరిజ్ఞానం, ఆ విధంగా వికివి చెందుతున్న విజ్ఞాన – సమాచారాది అవసరాల సంశ్లిష్టతలే కారణం.

గ్రంథాలయ ప్రమేయం లేకుండ చెప్పాలంటే వాఙ్మయ ప్రక్రియలు (నియంత్రణ) మూడు విధాలు: (1) ప్రథమస్థాయి (మూల, లేక ఆద్య) ప్రచురణలు; (2) ప్రథమస్థాయి ప్రచురణల సమాచారాన్ని అందజేసే ద్వితీయ స్థాయి ప్రచురణలు; (3) ఆ పిదప

ఉపయోక్తల కనుగుణంగా జరిగే విషయ ప్రసరణం. వాఙ్మయ-సమాచార వ్యవస్థలో (జాతీయ, అంతర్జాతీయ వ్యవస్థా క్రమ అనుసంధానంలో) ఈ విధ వాఙ్మయ ప్రక్రియలు, తత్సంబంధమైన వాఙ్మయ కార్యసంస్థలు, వాఙ్మయ పరికరాలు, ప్రచురణ విక్రయదారులు, పంపిణీ, రవాణా, సంసర్గమార్గాలు, గ్రంథాలయాలు, ఉపయోక్తలు అంతర్భాగాలు.

ప్రపంచవ్యాప్తంగా వెలువడే పుస్తకాది పఠనసామగ్రి బాహుళ్యానికి ప్రపంచ వ్యాప్తంగా ఉపయోగాన్ని సాధించే నిమిత్తం అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణ అవసరం. స్థూలంగా చెప్పాలంటే అంతర్జాతీయ ప్రమాణాలమేరకు ఒక ఉమ్మడి లేక సామాన్య సంసర్గ రూపనిర్మితి (Common Communication Format = CCF) కింద ప్రతి పఠన సామగ్రికి అవసరమైన వాఙ్మయ వివరణ నమోదు (Descriptive Bibliographic Record)ను తయారుచేసి (ఎ.ఎ.సి.ఆర్. కల్పం 2. అంతర్జాతీయ ప్రామాణిక వాఙ్మయ వివరణలు, విశ్వయంత్ర పఠన సూచి = UNIMARC వివిధ సంక్షేప, అనుక్రమణిక ప్రమాణాల మేరకు) జాతీయ వాఙ్మయ సూచి తదితర వాఙ్మయ పరికరాల ద్వారా ఆ సమాచారాన్ని ప్రసరింపచేయటమే ఈ నియంత్రణాలక్ష్యం. ఇది నేటి సాంకేతిక ప్రపంచం దృష్ట్యా అత్యంతావసరం, ఆచరణసాధ్యం. ఈ విషయంలో ఇప్పటికి (1) ధారావాహిక = Serial; (2) పుస్తకం = Monograph; (3) ధారావాహిక అంగం (భాగం) = Component part in a Serial; (4) పుస్తక అంగం = Component part in a monograph; (5) అంగాలతో కూడిన పుస్తకం = Monograph with Component Parts; (6) గ్రంథమాల కింద ఉన్న బహు సంపుటాల గ్రంథ అంగం = Component Part in a Volume of a multi Volumed monograph which is in a series అనేవాటిని ఈ సామాన్య సంసర్గ రూపనిర్మితి కింద ఉదహరించవచ్చును. ద్వితీయస్థాయి సేవలు (అనుక్రమణికలు, సారసంగ్రహాలు), సమాచార

వ్యవస్థలు (Information Systems), వలకట్టులు (Net works) మొదలయినవి ఇంకా అయ్యావి రూపొందించిన ప్రమాణాలనే ఉపయోగిస్తున్నాయి. అంటే వీటి విషయమై సారూప్యత, అనుగుణ్యతలు ముందు ముందు సాధించవలసిన అవసరమెంతైనా ఉంది.

గ్రంథాలయాలు ఎక్కడకూడ ప్రపంచవ్యాప్తంగా ఉత్పాదితమయ్యే యావద్వాఙ్మయాన్ని పోగుచేసి అందించడమనేది ఊహకు కూడ అందని విషయం. ఇది ఆచరణలో అసాధ్యం. ఉపయోక్తల అవసరాల రీత్యా ఎక్కువభాగం అనౌచిత్యం, అసంగతం. అయితే అప్పుడప్పుడు ఉపయోక్తల అవసరాలు ఆయా గ్రంథాలయాల శక్తి సామర్థ్యాలను (సంకలనాలను) అధిగమించటం సంభవిస్తూనే ఉంటాయి. ముఖ్యంగా వైజ్ఞానిక-సాంకేతిక రంగాల్లోనూ, తదితర క్షేత్రాల్లోనూ, పారిశ్రామిక రంగాల్లోనూ, అభివృద్ధి కార్యకలాపాల్లోనూ, ప్రపంచస్థాయిలో విషయ ప్రసరణావసరం కనిపిస్తుంది. ఈ విధమైన పరిమితులను దాటి సేవ లందించటానికి అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణ వీలుకల్పిస్తుంది. ఇంతకు మించి ఈ వాఙ్మయ నియంత్రణ (వాఙ్మయ సూచీకరణాది సేవలు) స్థానికంగా గ్రంథాలయాల్లో నిర్వహించే వాఙ్మయ ప్రక్రియలకు, ముఖ్యంగా సంకలన అభివృద్ధి—వ్యవస్థీకరణలకు (వర్గీకరణ, సూచీకరణ తదితర సేవలకు) సైతం పనికివచ్చే సహాయక బాహ్యసేవగా ఉపయోగపడుతుంది.

ఈ విచారణలో తేలే విషయాలు కొన్ని ఉన్నాయి. ప్రస్తుతం అమలులో ఉన్న అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణ అభివృద్ధిచెందిన కొన్ని పాశ్చాత్య దేశాలు సాధించిన ప్రగతిని, ఆదర్శపరిస్థితిని మాత్రమే సూచిస్తుంది. ఈ నియంత్రణ పరిధికి రానిదేశాలు, వాఙ్మయాలు (భాషలు, పుస్తక రకాలు) ఎన్నో ఉన్నాయి. వీటిలో మనదేశం ఒకటి. అలాగే మన జాతీయ భాషలు కూడ. అంటే, మన జాతీయ భాషల్లో వెలువడే పుస్తకాలకు, ప్రభుత్వ ప్రచురణలకు, ఇతరాలకు అంతర్జాతీయ నియంత్రణ లేదు.

చారిత్రక కారణాలవల్ల మనదేశంలో పరభాషాప్రాభావం నెలకొని ఆ విధంగా మనజాతీయ భాషల అభివృద్ధికి, మన సాంస్కృతిక—వైజ్ఞానిక కార్యకలాపాల విస్తృతికి అంతరాయమేర్పడింది. ఫలితం, స్వాతంత్ర్యానంతరం కూడ వాఙ్మయ, విషయ, సమాచారాది పరాధీనత. మన గ్రంథాలయాల్లో ఎక్కువ భాగం పుస్తకాలు (జాతీయ భాషల్లో కంటె) ఆంగ్ల భాషలోనే ఉన్నాయి. అలాగే, కొంతభాగం ఆంగ్లపుస్తకాలను మినహాయిస్తే దేశంలో ప్రచురితమయ్యే వివిధ భాషల పుస్తకాలకు అంతర్జాతీయంగా సరే: జాతీయ స్థాయిలో కూడ నియంత్రణ లేదు. అటువంటి అవకాశం సమీపంలో ఏర్పడగలదనే నమ్మకం కూడా లేదు.

ఇదివరలోనే సూచించిన విధంగా గ్రంథాలయాల్లో నిర్వర్తించబడే సంకలన నియంత్రణలకు జాతీయ అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణలు అవసరమైన ఊత నివ్వగలిగి ఉండాలి. అప్పుడే గ్రంథాలయాల్లో సంకలనాభివృద్ధికి, సూచీకరణాది ప్రక్రియలకు పుష్టి, తుష్టి ఏర్పడతాయి. విషయావసరాలను సకాలంలో అందించడం, వివిధ సేవలకు సమగ్ర సంపూర్ణతలను సాధించడం వీలవుతుంది.

మన గ్రంథాలయాల్లో మనం నిర్వహించే వర్గీకరణ, సూచీకరణాది సంకలన నియంత్రణ ప్రక్రియలు, అందునిమిత్తం ఉపయోగించే వర్గీకరణ పథకాలూ, సూచీకల్పాలు, విషయ శీర్షికలు, అలాగే మనం అనువర్తించే, అనుకరించే భౌతిక వ్యవస్థీకరణ పద్ధతులు అన్నీ అరువు తెచ్చుకున్నవే. పరాధీనతను చూపెట్టేవే.

ఈ నిస్సహాయత, అచేతనం ముందుముందు అవసరమయ్యే కార్యవితరణకు, కార్యపరతకు దారి తీయాలి. మన జాతీయ వాఙ్మయ నియంత్రణకు సత్తువను చేకూర్చాలి. ఆవిధంగా మన జాతీయ వాఙ్మయ నియంత్రణ అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణకు అనుసంధానం కావటం, తత్పరిధి విస్తరణకు మనవంతు యత్నం కూడ అందటం జరగాలి మన గ్రంథాలయాలు సక్రమంగా శాస్త్రీయంగా నిర్వహించబడటానికి,

మన సారస్వతం (వివిధ జాతీయ భాషల్లో ప్రచురణలు) వృద్ధి చెందటానికి కూడ గ్రంథాలయ వృత్తిపరంగా తగిన కృషి, అవసర సూచనలు ఏర్పడాలి. మన సంస్కృతి, సారస్వతం, ఆలోచన, సంప్రదాయం, వాఙ్మయ విషయ ఉపగమనం, మన గ్రంథాలయ నిర్వహణకు కావలసిన రూపురేఖలను దిద్దాలి.

మన జాతీయ వాఙ్మయ సూచి కేవలం నామమాత్రమే. దాని ప్రచురణ మందకొడి, అకాలం. వాఙ్మయ నియంత్రణకు దీనివల్ల ఏ మాత్రం అలవి కలగటంలేదు. సూచీకరణ, వర్గీకరణాది ప్రమాణాలు అస్పష్టంగా ఉండటమే కాకుండా అవి కాలం చెల్లినవిగా కూడ ఉన్నాయి. దేశంలో కేంద్రీకృత సహకార సూచీకరణ సౌకర్యాలు ఏర్పడలేదు.

భాషాప్రయుక్త రాష్ట్రాలేర్పడినప్పటికి రాష్ట్రీయ, భాషావాఙ్మయ సూచీలు లేవు. ఈ విషయంలో కావలసినన్ని సూచనలు, అవసరమైన చట్టాలు, ప్రభుత్వ సంస్థలు, ఆ విధి నిర్వాహక అధికారులు ఉండికూడ ఏమీ సాధించబడలేదు. ఈ సమస్యలన్నీ చక్కబడాలి.

ఉపసంహారానికి ముందు కొన్ని సూచనలు : అంతర్జాతీయ పరిణామాల దృష్ట్యా మనదేశంలో రూపుదిద్దుకుంటున్న వాఙ్మయ నియంత్రణ-వ్యవస్థీకరణ కార్యకలాపాలు, తద్విషయమైన పథకాలు, ప్రణాళికలు, పునస్సమాలోచనం కావాలి. అంతర్జాతీయ ప్రమాణాలపరిధిలో జాతీయ వర్గీకరణ పథకం, సూచీకరణ నియమావళి, విషయశీర్షిక జాబితాలు, పదకోశాలు తదితర పరికరాలు, వ్యక్తుల నామాలు, సంస్థల పేర్లు, సూచీకరణ, అనుక్రమణీకరణ సంబంధమైన భాషాపర సమస్యలు ఏకలిపి (Common script) సంస్కృతమూల సాంకేతిక పదకోశాలు (Vocabularies based on Sanskrit) మొదలైన విషయ పరిశోధనలు అత్యవసర ప్రాతిపదికల మీద చేపట్టాలి. వీటితోబాటు గణక యంత్ర అనువర్తనాలు కూడ పరిశీలించటం అవసరం.

—(0)—

యల్. యస్. రామయ్య

# 3.1 సహకార గ్రంథ సేకరణ

ఒకరికొకరు చేయూత నివ్వటం, సహాయపడటం 'సహకారం'. సహకారభావాలు, అవసరాలు, చర్యలు అన్ని కూడా వివిధ సమాజాల్లో, వివిధ నాగరికతల్లో ఆదినుండి ఉంటూ వచ్చాయి. అయితే నేటి సమాజాల్లో ఏర్పడిన ఆధునికావసరాల కారణంగా సహకారం అనివార్యమైంది. ఈ విధంగా గత కొన్ని శతాబ్దాల్లో ఆచరణరీత్యా సహకారానికి ఒక విశిష్టరూపం ఏర్పడింది. సహకార బావనకు సౌష్ఠవమేర్పడింది. ఒక ఉద్యమంగా, సంఘాలు-సంస్థలు అనేవిధంగా రూపొందింది. ఆధునిక సహకార చరిత్రలో ఇంగ్లాండులో రాచిడేల్ పట్టణమే దీనికి నాంది గీతం పాడింది. 1844లో ఒక ఉద్యమంగా కేవలం నిత్యావసర వస్తువుల సక్రమ పంపిణికోసం ఏర్పడి క్రమంగా అన్ని రంగాలకు విస్తరించింది.

వాఙ్మయ - సాహిత్యవిషయమైన సహకారం, గ్రంథాలయ సహకారం. ఇది క్రీస్తు పూర్వం రెండువందల సంవత్సరాల కాలం నాటి అలగ్జాండ్రియా, పెర్గమమ్ గ్రంథాలయాల మధ్య పరస్పర గ్రంథ వినిమయం (Inter Library Loan) కోసం ఏర్పాటై ఉండినట్లు తెలుస్తుంది. ఇది చారిత్రక విషయం. వాస్తవంలో గ్రంథాలయ సహకార భావాలు ఇరవయ్యో శతాబ్దారంభంలోనే వొక నిర్దిష్ట రూపాన్ని దిద్దుకోవటం ప్రారంభించాయి. క్రీ॥శ॥ 1900 ల తరువాత వచ్చిన సామాజిక, ఆర్థిక, సాంకేతిక మార్పులే గ్రంథాలయ సహకారానికి ముఖ్యకారణాలు.

1876లో ఏర్పాటైన అమెరికన్ గ్రంథాలయ సంఘం, ఆ తరువాత స్థాపితమైన బ్రిటిష్ గ్రంథాలయ సంఘం ఈ రంగంలో ఎంతో కృషి చేశాయి. అమెరికన్ గ్రంథాలయ సంఘ (ALA) వ్యవస్థీకరణలో ఏర్పాటైన మొట్టమొదటి కమిటీ సహకార కమిటీయే (Co - operation Committee). కాలక్రమంలో వచ్చిన ఎ. ఎ. కల్పం, ఎ. ఎల్. ఎ. కల్పం, ఎ.ఎ.సి.ఆర్. కల్పం మొదలైన నియమావళులు; వివిధ విషయ శీర్షికల పట్టికలు; కాంగ్రెస్ గ్రంథాలయ సమీకృత సూచీలు; యంత్ర సహాయ పఠనసూచి (MARC) తదితర వాఙ్మయ సేవలు గ్రంథాలయ సహకార కృషిలో సాధించిన అభివృద్ధికి నిదర్శనాలు.

చాలావరకు ఈ శతాబ్దం ప్రథమదశ కాలంలో కూడా గ్రంథాలయ సహకారం కేవలం గ్రంథాలయాల మధ్య పరస్పర పుస్తక అరువులకు మాత్రమే పరిమితం. రెండవ ప్రపంచయుద్ధం తరువాతనే సహకార భావన బాగా విస్తరించి వివిధ ఇతర అంశాలకు పాకింది.

నేడు సహకార గ్రంథసేకరణ గ్రంథాలయ సహకార విధానంలో ఒక అంశం మాత్రమే. సహకార గ్రంథ సేకరణావశ్యకతకు గల కారణాలు ఈ దిగువ విధంగా వివరించవచ్చును.

(1) 20 వ శతాబ్దంలో విద్యావకాశాలు ఎక్కువై అక్షరాస్యుల సంఖ్య పెరిగింది. విద్యావసరాలతోపాటు, వాణిజ్య, పారిశ్రామిక, తదితర వృత్తి కార్యకలాపాలు, జీవనోపాయాలు పెరిగి ఆ విధంగా విషయావసరాలు విస్తరించటం, పుస్తక పఠన సామగ్రి ఉపయోగాలు ఎక్కువ కావటం జరిగింది. గ్రంథాలయాలమధ్య సహకారం, వనరుల సమష్టి సమీకరణ లేకుండా ఉపయోక్తలకు అవసరమయ్యే యావత్సమాచారాన్ని సమగ్రంగా అందించటానికి, అందుకు కావలసివచ్చే పుస్తకాలను పత్రికలను, తదితర పఠనావస్తువులను సమకూర్చటం వైయక్తిక గ్రంథాలయా

లకు సాధ్యంకాని పని. అందుచేత గ్రంథాలయాలమధ్య ఉమ్మడి పుస్తక సంపాదన - వినిమయం తప్పనిసరి.

(2) ప్రతి ఏటా 5-6 మిలియన్ల పుస్తకాలు, 1 మిలియన్ మించిన పత్రికలు ప్రచురణ అవుతున్నాయని అంచనా. అలాగే ప్రతి 15 సంవత్సరాల కాలంలో మన పరిజ్ఞానం (విషయ, సమాచారాలు) ఇనుమడిస్తున్నట్లు మరో అంచనా. విషయవెల్లువ అవధులు లేకుండా సాగుతున్నది. ఈ వెల్లువ తీవ్రతను టి.ఎస్. ఇలియట్ అనే ఆంగ్ల కవి ఈ కింది విధంగా పేర్కొనటం జరిగింది.

"Where is the life we have lost in living ?
Where is the wisdom we have lost in knowledge ?
Where is the Knowledge we have lost in information ?
The cycles of Heaven in twenty Centuries
Bringing father from God and nearer to the Dust."

ఇంత ఉధృతంగా వెలువడుతున్న యావత్ సాహిత్యాన్ని సేకరించటం ఏ ఒక్క గ్రంథాలయానికి సాధ్యంకాదు. అందువల్ల గ్రంథాలయ సహకార సమీకరణ, పరస్పర వినిమయాలు ఎంతో అవసరం.

(3) ప్రతి గ్రంథాలయంలో గ్రంథసేకరణ, ఆ గ్రంథాలయ ఆర్థికవనరుల మీద ఆధారపడి ఉంటుంది. అపరిమిత ఆర్థికవనరులు ఏ గ్రంథాలయానికి ఉండవు. గ్రంథాలయాల సంఖ్య పెరుగుతున్నా, వాటికి లభించే నిధులు మాత్రం పెరగటంలేదు. పఠన సామగ్రి ధరలు పెరగటం చేతనూ, ద్రవ్యోల్బణ కారణంగానూ, గ్రంథాలయాల పుస్తక సేకరణ

అభిలషణీయమైన స్థాయిలో జరగటంలేదు. ఇందువల్ల గ్రంథాలయాలు తమ చదువరులకు కావలసిన సమాచార సంపత్తిని స్వతంత్రంగా సమకూర్చుకోలేక ఇతర గ్రంథాలయాల మీద కూడా ఆధారపడవలసి వస్తున్నది. తమకు ఉండే పరిమిత నిధులను సక్రమంగా ఉపయోగించి చదువరులకు ఎక్కువ సేవలను అందించటంలో గ్రంథాలయ సహకారం, సహకార సేకరణ విధానాలు ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. అభివృద్ధిచెందుతున్న దేశాల్లో మరింత పురోగమనాన్ని అందుకుంటున్నాయి.

(4) గ్రంథాలయాల్లో వనరుల సమష్టి వినిమయం లేదా పంపకం (Resource sharing)విధానంలో కొన్ని ఇక్కట్టులు కూడా ఉన్నాయి. ముఖ్యంగా అంతర్ గ్రంథాలయ అరువు విధానంలో చిన్నచిన్న గ్రంథాలయాలు భారీ గ్రంథాలయ సంకలనాలను అప్పుడప్పుడూ తోడు చేసుకోవటానికి బదులు తమ నిత్యావసరాలకు పూర్తిగా వాటి మీదనే ఆధారపడటం జరుగుతుంది. నిధుల కొరత, తదితర కారణాలవల్ల అన్ని గ్రంథాలయాలు తమ సంకలనాలను (Collections) అభివృద్ధిచేసుకోవటం సాధ్యం కాదు. అందుకని భారీగ్రంథాలయాలమీద పూర్తిగా ఆధారపడటం సహకారం అనిపించుకోదు. ఆర్థికవనరులు, సేవాలక్ష్యాలు, సేవా అవసరాలు మొదలైన వాటి ఆధారంగా సహకారాన్ని సాధించే నిమిత్తం వివిధ గ్రంథాలయాలమధ్య ఒక నిర్దిష్టమైన సమష్టి సేకరణా విధానం అమలు కావాలి. అప్పుడే గ్రంథాలయాలమధ్య పరస్పర వినిమయం అర్థవంతమవుతుంది.

(5) సహకార గ్రంథ సేకరణవల్ల సమష్టి విధానంలో భాగస్వాములైన గ్రంథాలయాలు తమ సంకలనాలలో అనవసర పునరుక్తులను మాపవచ్చును. ఆవిధంగా సంకలనాలను వృద్ధిపరచుకొని తమ చదు

చదువరులకు మెరుగైన సేవలను అందించటానికి వీలేర్పడుతుంది. సంకల నాలు కూడా పుష్టి చెందుతాయి.

## గ్రంథ సేకరణ పద్ధతులు

గ్రంథ సేకరణ అంటే అందరికి తెలిసిందే. దానిని ప్రత్యేకంగా నిర్వచించ నవసరంలేదు. గ్రంథ సేకరణకు నాల్గు ప్రామాణిక పద్ధతులున్నాయి. అవి :

1. కొనుగోలు (Purchase) 2. బహుమానం (Gift) 3. వినిమయం లేదా మార్పిడి (Exchange) 4. చట్టబద్ధ ధరావత్తు (Legal Deposit).

కొనుగోలు పద్ధతి సాధారణంగా అన్ని గ్రంథాలయాల్లోను కనిపించే ప్రాథమిక సేకరణాపద్ధతి. వినిమయం, బహుమానం అనేవి వీలునుబట్టి అమలుచేయవచ్చు. చట్టబద్ధ ధరావత్తు ఏవో కొన్ని గ్రంథాలయాలకు తప్ప అన్నింటికి వర్తించదు. ఇందువల్ల తేలే విషయం ఏమిటంటే—పుస్తక సమీకరణకు ఆర్థిక వనరులు తప్పనిసరిగా ఉండాలి.

నిధులను వెచ్చించటం వల్లనే సకాలంలో సరియైన పుస్తకాది పఠన సామగ్రిని సేకరించటం వీలవుతుంది. సమష్టి విధానంలో ఫార్మింగ్‌టన్ ప్లాను విధానం (Farmington Plan Method), కేంద్రీకృత కొనుగోలు విధానం (Centralised Acquisition), ఉమ్మడి కొనుగోలు విధానం (Joint Purchase) మొదలైన విధానాలను కూడా ఉదాహరణలుగా పేర్కొనవచ్చును.

ఈ కొనుగోలు పద్ధతులు, వాటికి కావలసిన పరికరాలు మొదలైన వాటిని గురించి తెలుసుకునే ముందు, జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో

అమలులో ఉన్న కొన్ని సహకార గ్రంథ సేకరణ పథకాలను గురించి తెలుసుకోవటం సముచితం.

## సహకార గ్రంథ సేకరణ పథకాలు

ఉప్పెనలా వెలువడుతున్న ప్రచురణలను తట్టుకొని సాధ్యమైనంత మేరకు తమ చదువరులకు సేవలను అందించటానికి, రెండవ ప్రపంచయుద్ధం తరువాత అనేక దేశాల్లో సహకార గ్రంథ సేకరణ పథకాలు ఎన్నో అమలు చేయటం జరిగింది. ఇలా అమలు అయిన పథకాలను ఈ దిగువ ఉదహరించడం జరిగింది.

1. ఫార్మింగ్‌టన్ ప్లాను (Farmington Plan : ప్రారంభం 1942; అమలు 1948).
2. పబ్లిక్ లా 83-480 (Public Law 83-480: ప్రారంభం 1962).
3. స్కాండియా ప్లాను (Scandia Plan: ప్రారంభం 1950).
4. డాచ్ ఫార్‌చియున్ గ్స్‌గెమియన్ చాఫ్ట్ (Deutsch Forschungsgemeinschaft : German Resesgrch Society ; ప్రారంభం 1949).
5. లండన్ మెట్రో పొలిటన్ స్పెషల్ కలెక్షన్స్ స్కీమ్ (London Metropolitan special collections scheme: ప్రారంభం 1948).
6. జాయింట్ ఫిక్షన్ రిజర్వ్ స్కీమ్ (Joint Fiction Reserve Scheme : ప్రారంభం 1946).
7. మిడ్-వెస్ట్ ఇంటర్ లైబ్రరీ సెంటర్, చికాగో (Mid - West Inter-Library centre, chicago).
8. బ్రిటిష్ సౌత్ ఈస్టరన్ రీజినల్ సిస్టమ్ (British South-Eastern Regional System : ప్రారంభం 1950).

9. లండన్ అండ్ సౌత్ ఈస్టరన్ రీజినల్ సిస్టమ్ (London and South - Eastern Regional System (LASER) 1969).
10. ఒహియో కాలేజి లైబ్రరీ సెంటర్ (Ohio college Library centre : OCLC: ప్రారంభం 1974).
11. లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ ఫారన్ ఎక్విజిషన్ ప్రోగ్రాం (Library of Congress Foreign Acquisitions Programme)
12. ఇంటర్-డిపార్టుమెంటల్ రిఫెరెన్సు సర్వీసు (Inter - Departmental Reference Service, Institute of Public Administration, University of Philippines; ప్రారంభం 1952)

పైన పేర్కొన్న పథకాల్లో కొన్ని అంతర్జాతీయ పథకాలు, మరి కొన్ని జాతీయ, ప్రాంతీయ పథకాలు. ఇవికాక ఇంకా ఎన్నో చిన్నచిన్న సహకార గ్రంథసేకరణ పథకాలు పలుదేశాల్లో అమలులో ఉన్నాయి. ఉదాహరణకు, ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, నైజీరియా, వెస్టిండీస్ దేశాల సహకార సేకరణ పథకాలకు ఎక్కువగా అమెరికా, ఇంగ్లాండు దేశాల్లోనే ఆదరణ లభించింది. అలాగే పి.యల్ - 480 పథకం మన దేశంలో అందరికీ తెలిసిన విషయం. ఇది ఇంకా కొనసాగుతున్నది. మన దేశంలో ప్రచురణ అయిన పుస్తకాలను ఈ పథకం కింద USIS (ఢిల్లీ) కార్యాలయంవారుకాని, అమెరికాలోని అనేక పౌర, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు పంపిణి చేస్తున్నారు. కాని మనదేశంలో ఇంతవరకు ఏ ప్రాంతంలో కూడా గ్రంథాలయాలు సహకార గ్రంథసేకరణ పథకాలను అనుసరించటానికి ఎలాంటి ప్రయత్నం చేసినట్లుగాని, చేస్తున్నట్లుగాని కనిపించదు. ఒక విధంగా రాజారాంమోహనరాయ్ సంస్థ పౌర గ్రంథా

లయాలకు అందించే గ్రంథ సహాయం ఈ కోవకే చెందగలదని చెప్ప వచ్చును.

## సహకార గ్రంథసేకరణావసరాలు

1. సహకార సమాఖ్యలో చేరిన సభ్యుల ఖరారు పట్టిక ఒకటి ఉండాలి. కొత్త సభ్యులు ఈ సమాఖ్యలో చేరటానికి అవకాశం ఉండాలి.
2. సమాఖ్యలో చేరిన గ్రంథాలయ సంస్థలు, గ్రంథాలయాధికారులు తమ బాధ్యతలను గుర్తించి స్పష్టంగా నిర్వహించగలిగిన సమర్థులై ఉండాలి.
3. సమాఖ్యసభ్య గ్రంథాలయాలన్ని తమకు నిర్దేశించిన విషయాలలో పుస్తక సంకలనం చేయటానికి తగిన ఏర్పాట్లు చేయాలి. ఈ విషయంలో ఎలాంటి అశ్రద్ధ, జాగరణ జరగకుండా చూడాలి.
4. సేకరించిన పుస్తకాలకు వర్గీకరణ, సూచీకరణ మొదలైన ప్రక్రియలను వెంట వెంటనే నిర్వర్తించి, వాటి భద్రతకు, వినిమయానికి తగిన ఏర్పాట్లు చేయాలి.
5. గ్రంథసేకరణ జాతీయ గ్రంథ సూచీ వంటి సాధనాలద్వారా జరగాలి. జాతీయ గ్రంథసూచి లేని పక్షం, దానిని వెంటనే ప్రారంభించాలి.
6. సహకార గ్రంథసేకరణకు అత్యున్నతమైన వృత్తి నైపుణ్యం ఉండాలి.
7. సహకార గ్రంథసేకరణ సమాఖ్య సభ్య గ్రంథాలయాలన్నిటికి నిశ్చితమైన బడ్జెట్లు ఉండాలి. ఆ బడ్జెట్లు ప్రతిసంవత్సరం గ్రంథసేకరణకు సరిపోయే విధంగా పునరీక్షితం కావటం, పరస్పరం సాపేక్షితంగా ఉండటం జరగాలి.

8. సహకార గ్రంథసేకరణ పథకాన్ని రూపొందించటంలో భాష, భౌగోళిక, పరిపాలన, రాజకీయ హద్దులు మొదలైన అంశాలను పరిగణనలోకి తీసుకొని సమాఖ్య సభ్యులను నిర్ణయించాలి. మనది బహుభాషలదేశం. బహు భాషల్లో పుస్తకాలు వెలువడుతాయి. అన్ని భాషల్లో వెలువడిన పుస్తకాలను, తదితర పఠనాసామగ్రిని సేకరించటం కష్టసాధ్యం. అయినప్పటికీ సాధించటం తప్పదు.
9. సహకార గ్రంథసేకరణ సమర్థవంతంగా, విజయవంతంగా ఉండాలంటే సమాఖ్యలోని సభ్య గ్రంథాలయాలమధ్య దృఢ సంకల్పం, కార్యదీక్ష కావాలి.

## వాఙ్మయ సాధనాలు

1. సహకార గ్రంథసేకరణ విజయవంతంగా అమలుపర్చటానికి సమగ్రమైన, క్రమబద్ధమైన జాతీయ గ్రంథసూచీ ఉండాలి.
2. సమాఖ్య సభ్య గ్రంథాలయాలమధ్య సమీకృత గ్రంథసూచి (Union Catalogue) ఏర్పాటు కావాలి. ఈ సూచి వల్ల ఏ పుస్తకం ఏ గ్రంథాలయంలో ఉందని తెలుసుకోవడం సాధ్యం. సమీకృత గ్రంథసూచి లేనిదే సహకార గ్రంథసేకరణ వల్ల ప్రయోజనం ఉండదు.
3. సహకార గ్రంథసేకరణకు ఒక వ్యవస్థ ఉండాలి. సహకరించే గ్రంథాలయాలమధ్య సమష్టి కార్యాచరణ విధానం, తగిన విధమైన అవగాహన, అనుసంధానం కావాలి. సాంకేతిక పరంగా ఇవి ఒక వల కట్టు (Network) రూపంలో ఏర్పడాలి.
4. గ్రంథాలయాలమధ్య టెలికమ్యూనికేషన్, Teletext మొదలైన సదుపాయాలు ఉండాలి. మనదేశంలో ఈ సౌకర్యాలు పౌర, విశ్వవిద్యాలయ గ్రంథాలయాల్లో పెద్దగా లేవు.

5. ఫోటో కాపీయింగు సదుపాయాలు కూడా అవసరం. అరుదైన పుస్తకాలు కొన్ని సందర్భాల్లో గ్రంథాలయాలు అరువు ఇవ్వ లేనప్పుడు, వాటి ప్రతులను ఇతర గ్రంథాలయాలకు అందించ టానికి ఇవి ఉపయోగపడతాయి. అలాగే పదువరుల అవ సరాలను కూడా తీర్చవచ్చును.

## సహకార గ్రంథసేకరణ విధానాలు

**(1) విషయ ప్రత్యేకీకరణ** (Subject Specialisation)

సహకరించే గ్రంథాలయాలు డ్యూయీ డెసిమిల్ పథకం వంటి వర్గీకరణ పథకాల ప్రకారం వివిధ విషయ విభాగాలలో పుస్తక సమీ కరణ అవసరాన్ని నిర్ణయించి ఆ బాధ్యతలను చేపట్టాలి. ఈ విధంగా గ్రంథాలయాలు కేటాయించిన ప్రత్యేక విషయ విభాగాల్లో కావించే పుస్తక కొనుగోలును విషయ ప్రత్యేకీకరణ అంటారు.

**(2) కేంద్రీకృత పుస్తక సంపాదనలు** (Centralised Book Acquisitions)

ఈ పద్ధతి ప్రకారం పుస్తకాలను ఒక కేంద్ర సంస్థ సభ్య గ్రంథాలయాల విషయ ప్రత్యేకీకరణ ప్రకారం కొనుగోలుచేసి పంపిణీ చేయడం జరుగుతుంది. Farmington Plan, P. L-480 పథకాలు ఇటువంటివే. ఈ విధానంలో పునరోక్తులు (Duplication) ఏర్పడవు. ఇందువల్ల ఎక్కువ ముదరా (Discount) లభించి పొదుపు కావటం, ఆ విధంగా అధిక గ్రంథనామాల కొనుగోలు సాధ్యమవుతుంది. సేకరించిన పుస్తకాలకు కేంద్రీకృత వర్గీకరణ, సూచీకరణ కార్యక్రమాలు కూడా జరిపించటం వీలవుతుంది. ఇందువల్ల అన్ని గ్రంథాలయాల్లోను ఈ విషయమై అనుగుణ్యత, ఏకరూపత సాధించటం, ఆ విధంగా సేవలను అభివృద్ధి పరచటం మరొక ముఖ్య లాభం.

**(3) ఉమ్మడి కొనుగోలు** (Joint Acquisition)

ఈ విధానం పైన చెప్పిన రెండు పద్ధతులకు భిన్నం. ఇందు సమష్టి సమాఖ్య విధానంలోని గ్రంథాలయాధికారులు తరచూ కలసి తమ గ్రంథాలయాల్లో సమీకరించని పుస్తకాలు ఏమున్నాయని పరిశీలిస్తారు. స్వల్ప ఉపయోగం, ఎక్కువ ధర ఉండేపుస్తకాలను ఎవరు ఎంపిక చేయాలి? అని నిర్ణయిస్తారు. ఈ నిర్ణయం మేరకు ఈ విధ పుస్తకాలను తమ నిధులనుండి గాని లేదా ఇతర గ్రంథాలయాల సహాయంతో గాని కొనవచ్చు. ఈ విధంగా ఉమ్మడి సంపాదనకు అందని గ్రంథ నామాలను పరిశీలించి, ఏరి తమ సంకలనాలను ప్రత్యగ్రీకరించటం, సమగ్రపరచటం జరుగుతుంది.

## సహకార గ్రంథ సేకరణ వల్లన ప్రయోజనాలు

(1) పరిమిత ఆర్థిక వనరులతో సమష్టి సమీకరణ ద్వారా అధిక ప్రమాణంలో సంకలన ప్రయోజనాన్ని సాధించవచ్చు.

(2) ఈ విధంగా స్థానిక గ్రంథాలయ ఉపయోక్తల అవసరాలను సమష్టి వినిమయం ద్వారా చాలావరకు ఆదుకోవచ్చును.

(3) స్థానిక గ్రంథాలయాల్లో స్థలాభావం, నిల్వ సమస్యలు చాలా వరకు సమసిపోతాయి.

(4) సహకరించే గ్రంథాలయాల సభ్యులు తమకు కావలసిన పుస్తకాలను తమ గ్రంథాలయంలోనే కాకుండా ఏ ఇతర గ్రంథాలయంలోనైనా అరువు పొందటానికి అవకాశం ఉంటుంది.

## పరిమితులు

(1) ఒక గ్రంథాలయంలో సేకరించిన పుస్తకాలు ప్రత్యేకంగా గ్రంథాలయ చదువరుల అవసరాలకు సరిపోయేవిగానే ఉండవు.

సమష్టి అవసరాల దృష్ట్యా సేకరించటంవల్ల ఒక్కొక్కప్పుడు స్థానిక గ్రంథాలయాల్లో కొన్ని పుస్తకాలకు అధిక ఉపయోగం కనపడక పోవచ్చును.

(2) కొన్ని సందర్భాల్లో పుస్తకాలు అంతర్ గ్రంథాలయ అరువులో ఉండి స్థానికంగా అవసర సమయాల్లో లభ్యం కాకపోవచ్చు.

(3) పుస్తకాలను అరువు తెచ్చుకోవటంలో జాప్యం ఏర్పడవచ్చు.

(4) సహకార గ్రంథసేకరణ పథకాలు అందలి గ్రంథాలయాలు ఈ విధానం లాభసాటిగా ఉందనుకున్నంత కాలమే ఇది అమలు అవుతుంది. తమకు లాభసాటిగాలేదన్న భావం ఏర్పడటం తడవుగా ఈ విధానం నిర్జీవమవుతుంది. సాధారణంగా ఈ విధానంలో పాల్గొనే గ్రంథాలయాలు సమాన ప్రతిపత్తి కలిగి ఉండకపోతే ఈ పద్ధతి అసలు పనిచేయదు.

సహకార గ్రంథ సేకరణను మనం రంగనాథన్‌గారి గ్రంథాలయ పంచసూత్ర ఆదేశాల దృష్ట్యా పరిశీలిస్తే 1, 2, 5 సూత్రాలు సహకార సేకరణకు అనుకూలంగాను 3, 4, సూత్రాలు వ్యతిరేకంగాను ఉన్నాయేమోనని అనిపిస్తుంది. అందువల్ల సహకార గ్రంథసేకరణ విజయవంతం కావటానికి సభ్య గ్రంథాలయాల ఉద్దేశ్యాలు, నైసర్గిక పరిధులు మొదలైన అంశాలు కూడా దోహదం చేస్తాయి.

—(o)—

కె. రామచందర్‌రావు

# 3.2 గ్రంథాలయ సహకారంలో సాధక బాధకాలు

గ్రంథాలయం ఒక సాంఘిక సంస్థ. ఇది ప్రజల ధనంతో నడుప బడుతుంది. కాబట్టి ప్రతి చదువరి పఠనావసరాలను తీర్చటం గ్రంథ పాలకుని ముఖ్య కర్తవ్యం. రంగనాథన్‌గారి పంచసూత్రాల్లో రెండవ సూత్రం ఈ ఆశయాన్నే తెలియజేస్తుంది.

పూర్వం గ్రంథాలయాలు కేవలం పుస్తకాల భద్రతకు మాత్రమే ప్రాముఖ్యత నిచ్చాయి. చదువరులు గ్రంథపాలకుని దయాధర్మాలమీద ఆధారపడేవారు. కాని ప్రస్తుతం గ్రంథాలయాలు సేవా సంస్థలుగా మార్పుచెందాయి. పఠనావసరాలకు, సమాచార సేవలకు ప్రాముఖ్యం పెరిగింది. నేడు గ్రంథాలయాలు చదువరి కోరిన పుస్తకాలు లేవని, తమ బాధ్యతను తప్పించుకోలేవు. అలాగే గిరాకి లేని పుస్తకాలను పెంచి తమ సంకలనాలు అపారమని కూడ సమర్థించుకోలేవు. అయితే ప్రపంచంలో ఏ గ్రంథాలయం కూడ అన్ని భాషల్లోను, అన్ని విషయాల్లోను ప్రచురిత మైన యావద్వాఙ్మయాన్ని సేకరించటం అసాధ్యం. అందువల్ల గ్రంథాలయ రంగంలో సహకారమనేది ఒక సమస్యగా ప్రపంచమంతటా ప్రాముఖ్యాన్ని తెచ్చుకుంది.

## గ్రంథాలయ సహకారం

సహకారం సమాజంలో సర్వసామాన్యం. ఇది సాంస్కృతిక, నాగరికతా లక్షణం అని కూడా చెప్పవచ్చు. మానవుడు ఒంటరిగా

సాధించలేని పనులను తనతోటి వారి సహకారంతో సమష్టిగా సాధించాడు. సాధిస్తున్నాడు. ఒక గ్రంథాలయం నిత్యం నిర్వర్తించే విధులను ఇతర గ్రంథాలయాలతో పాలుపంచుకొని చదువరులకు సమష్టి సేవలను అందించటమే గ్రంథాలయ సహకారం. ఈ సహకారం భాగస్వామ్యం (Partnership) వంటిది. ప్రతి గ్రంథాలయం సమిష్టి కార్యక్రమాల్లో పాల్గొనటం, ఇతర గ్రంథాలయాలకు సహాయపడటం, బదులుగా సహాయం పొందటం జరుగుతుంది. ఇతర గ్రంథాలయాలకు అత్యవసర పరిస్థితుల్లో కావల్సిన పఠనా సామగ్రిని బదులు ఇవ్వడం ఇందు ఒక ముఖ్య భాగం. గ్రంథాలయ సహకారంలో పుస్తకాలు, ఇతర వాఙ్మయ సాధనాలు మొదలైన వాటితోబాటు సిబ్బంది అనుభవాన్ని, సేవలను కూడా పొందే అవకాశం ఉంది. దీన్నే వనరుల భాగస్వామ్యం (Resource Sharing) అంటారు. ఇక్కడ వనరులు అంటే వస్తువులు, వ్యక్తులు, సేవలు మొదలైనవి కావచ్చు. గ్రంథాలయ పరిభాషలో ముద్రిత, అముద్రిత పుస్తక వనరులు; ఫిల్మ్ ప్రొజెక్టర్, మైక్రోఫిల్మ్ రీడర్, టైప్‌రైటర్ లాంటి పరికరాలు; అలాగే వర్గీకరణ, సూచీకరణ మొదలైన సాంకేతిక సేవలు; సలహాలు, సంప్రదింపులు అన్నీ వనరులుగా పరిగణింపబడతాయి.

## సహకార ఆవశ్యకత

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత పుస్తకాల ఉత్పత్తి అన్ని దేశాల్లో గణనీయంగా పెరిగింది. ముద్రణాది ఖర్చులుకూడా పెరగటం వల్ల, పుస్తక ధరలుకూడా పెరుగుతున్నాయి. ఏ. కె. గుహగారు చెప్పినట్లు 1971-1977 మధ్యకాలంలో ప్రచురణ ఖర్చులు రెట్టింపు కంటె ఎక్కువయ్యాయి. సైన్సు పుస్తకం సరాసరి వెల 1964-1973 మధ్య కాలంలో 10.99 డాలర్లనుండి 17.34 డాలర్లకు పెరిగిందని, 1974 లో సైన్స్ పుస్తకం సరాసరి వెల 20.83 డాలర్లనీ, సాంకేతిక పుస్తకం సరా

సరి వెల 17.74 డాలర్లని పబ్లిషర్స్ వీక్లీ పత్రిక ప్రకటించిందనీ జి.ఇ. ర్యాండల్ తెలిపారు. అలాగే పత్రికల చందా రేట్లు విపరీతంగా పెరిగాయి. ఉదాహరణకు 1940 లో కెమికల్ ఆబ్‌స్ట్రాక్టు వార్షిక చందా 400 డాలర్లు అయితే 1978లో 4000 డాలర్లకు హెచ్చింది! అమెరికాలో ప్రచురితమయ్యే పత్రికల సరాసరి వెల 1968లో 8.66 డాలర్ల నుండి 1978లో 27.58 డాలర్లకు పెరిగింది.

ఈవిధంగా పత్రికల వార్షిక చందాలు ప్రతి ఏటా పెరుగుతున్నా గ్రంథాలయాల బడ్జెట్లు మాత్రం సమంగా పెరగనందున పత్రికల సేకరణ తక్కువ అవుతున్నది. 1980లో నరేంద్రకుమార్ శర్మ, కురుక్షేత్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయం చందాకట్టే పత్రికలు, వాటి ధరల పెరుగుదలలపై ఒక కేస్‌స్టడీ చేశారు. ఆ గ్రంథాలయం 1969-70 సంవత్సరంలో 2 లక్షల చందా కట్టి 1000 పత్రికలు సేకరించేదని, 1979-80 సంవత్సరానికి 4,50,000 చందాకట్టి 1700 పత్రికలు మాత్రమే సేకరించ గల్గుతున్నదని నివేదికలో తెలిపారు. యస్. జి. మహాజన్ పూనా నగరంలో ఐదు గ్రంథాలయాలు రూ. 45,000 చందా గల కెమికల్ ఆబ్‌స్ట్రాక్టును ప్రతి సంవత్సరం ఖరీదు చేస్తున్నాయని ఒక వ్యాసంలో తెలిపారు. భారతదేశంలో గ్రంథాలయ సహకారం అనే వ్యాసంలో ఎ.ఆర్. సేథీ ఇలారాశారు. "అభివృద్ధి చెందుతున్న దేశాలు పారిశ్రామికంగా వెనుకబడియుండి, విద్య, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు ఖర్చు చేయడానికి చాలినంత ప్రజాధనం లేకపోవడంవల్ల, వీటికి పరిమితమైన ధనాన్ని కేటాయిస్తున్నాయి. అందువల్ల అభివృద్ధి చెందుతున్న దేశాల్లో తక్కువ వనరులను ఎక్కువ ప్రయోజనాలకు వినియోగించడానికి సహకారమే శరణ్యం".

## సహకారం వల్ల ప్రయోజనాలు

(1) ఒక గ్రంథాలయంలో సేకరించిన ఆచూకీ గ్రంథాలు, సాధారణ పుస్తకాలు, పత్రికలు, అనుక్రమణికలు మొదలైన పఠన సామగ్రిని ఇతర గ్రంథాలయాలు ఉపయోగించుకునే అవకాశం కల్గుతుంది. ఈ విధంగా గ్రంథాలయాలు తమ నిధులను సద్వినియోగం చేసుకొని పరిమితులను అధిగమించవచ్చు.

(2) చదువరి సమయం ఆదా అవుతుంది.

(3) గ్రంథాలయాల్లో లభ్యమయ్యే పఠనా సామగ్రులకు గరిష్ట ప్రయోజనాన్ని సాధించవచ్చు.

(4) కొత్త సేవా కార్యక్రమాలు చేపట్టవచ్చు.

## సహకారానికి అనుకూల పరిస్థితులు

గ్రంథాలయ సహకారం సత్ఫలితాలను ఇవ్వాలంటే ఈ కింద పేర్కొన్న అంశాలు ముఖ్యం.

(1) వివిధ సంస్థలకు ఉపయోగపడే పుస్తక సంకలనం సహకార పరిధిలోని గ్రంథాలయాల్లో ఉండాలి.

(2) సహకార కార్యక్రమాల్లో పాల్గొనడానికి గ్రంథాలయాలు అంగీకరించి ఉత్సాహంతో ముందుకు రావాలి.

(3) గ్రంథాలయ సమష్టి వనరులు సహకార విధానంలో పాల్గొనే సభ్య గ్రంథాలయాలకు సరియైన ప్రమాణంలో ఉండాలి.

(4) సమష్టిగా లభించే వనరుల వివరాలను తెల్పే సమీకృత సూచీ (Union catalogue) తదితర వాఙ్మయ సాధనాలు (Bibliographical Tools) కూడా అవసరం. ఈ సాధనాలు లేకుంటే చదువరులకు కావల్సిన పుస్తకసామగ్రి ఏ గ్రంథాలయంలో లభ్యమో తెలుసుకునే అవకాశం ఉండదు.

(5) సర్వ గ్రంథాలయాలకు అరువు కోరినప్పుడు తమవద్ద ఉంటే పఠనా సామగ్రిని అతిస్వల్ప వ్యవధిలో అందజేసే సామర్థ్యం ఉండాలి.

## సహకార క్షేత్రాలు

సహకార కార్యకలాపాలు (1) పుస్తక సేకరణ; (2) పత్రికా సేకరణ; (3) వర్గీకరణ, సూచీకరణ;(4) అనుక్రమణికరణ(Indexing); సారాంశీకరణ (Abstracting); (5) బైండింగ్; (6) పరికరాలు, సాధనాలు; (7) వనరుల వినిమయం; (8) సిబ్బంది; (9) తర్ఫీదు (10) మౌన గ్రంథాలయాల నిర్వహణ, స్థలం పొదుపు; (11) వలకట్టు (Network) రూపసాధన మొదలైన రంగాలకు అనువర్తించవచ్చును.

## అవరోధాలు

గ్రంథాలయాల వనరులను సమష్టిగా పంచుకోవడం ఎంతో లాభదాయకమైనా ఇందు కొన్ని చిక్కులు కూడా ఉన్నాయి. ఎస్. సుబ్బారావుగారు ఈ అడ్డంకులు ఆరు రకాలని తెలిపారు. అవి:

### (1) మానసిక (Psycholcgical) అవరోధాలు

కొందరు అధికారులు తమ గ్రంథాలయం పుస్తకాలు ఇతరుల చేతుల్లోకి పోతే తిరిగిరావని భయపడతారు. అందుచేత పుస్తకాలు బదులివ్వడానికి ఇష్టపడరు. చిన్నచిన్న గ్రంథాలయాలు సర్వదా తమ మీద ఆధారపడతాయని పెద్ద గ్రంథాలయాల అధికారులు విసుక్కుంటారు. ఇంకా కొంతమంది ఇతరులపై ఆధారపడడం ఎందుకు? అనే ఉద్దేశ్యంతో ఎవ్వరితోను సహకార సంబంధాలు కోరుకోరు.

### (2) ఆర్థిక అడ్డంకులు

గ్రంథాలయ సహకారానికి సరియైన ఆర్థిక వనరులు అవసరం. తపాలాఖర్చులు, జిరాక్సు మెషిన్లు, సిబ్బంది పై ఖర్చులు మొదలైన

వాటికి ధనవ్యయం అవుతుంది. అందువల్ల లోటు బడ్జెట్‌తో నడిచే గ్రంథాలయం సహకార కార్యక్రమాల్లో సంపూర్ణంగా పాల్గొనలేదు.

**(3) భౌతిక భౌగోళికపరమైన సమస్యలు**

భారతదేశం లాంటి దేశంలో ముఖ్య పట్టణాల మధ్యదూరం ఒక్కోసారి వేయికిలో మీటర్లు దాటుతుంది. దీనికి తోడు తపాలా కార్యాలయంవారి ఆలస్యం, అజాగ్రత్తలు, ఆకారణంగా ఏర్పడే నష్టాలు, గ్రంథాలయ సహకారానికి తీవ్రమైన అడ్డంకులు.

**(4) పరిపాలన, శాసనపరమైన అవరోధాలు**

కొన్ని సార్లు ప్రభుత్వ పరమైన ఆంక్షలు సంస్థ సొమ్మును ఇతరులకు బదులివ్వడంకూడా నిషేధించే నియమాలు లేదా అరువు నియమాలు కఠినంగా ఉండడం మొదలైనవి సహకారానికి వ్యతిరేకాలుగా పరిణమిస్తాయి.

**(5) వాఙ్మయ సాధనాలు** (Bibliographical tools)

గ్రంథాలయాల్లో సేకరించే పఠనా సామగ్రి సమాచారాన్ని అందించే వాఙ్మయ సూచీలు, సమీకృత సూచీలు లేకపోవడంవల్ల సహకారం సాధ్యంకాదు.

**(6) చదువరుల వివరాలు**

తమ గ్రంథాలయాన్ని ఉపయోగించే చదువరుల అవసరాలు ఎలాంటివి? వారు ఏవిధమైన పుస్తక సామగ్రిని కోరుకుంటారు? అనే విషయాలు తెలియని పరిస్థితులలో సమష్టి అవసరాలకు పనికివచ్చే సంకలనాలను సాధించడం కుదరదు. ఈవిధంగా సహకారావసరాలు తీరనప్పుడది చురుకుగా సాగదు.

## అంతర్జాతీయ సహకార కార్యక్రమాలు

UNESCO, FID, IFLA, ISO వంటి అంతర్జాతీయ సంస్థలు అంతర్జాతీయ రంగంలో సమాచార బదిలీకి ఎంతగానో తోడ్పడుతున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో సహకార కార్యక్రమాల్లో UNISIST, NATIS; మరియు IFLA కు సంబంధించిన UBC, UAP, UAI విధానాలు, ISBD ల వంటి ప్రమాణాలు; INIS, AGRIS, DEVISIS మొదలైన సమాచార విధానాలు; అలాగే ఎన్నో ఉమ్మడి సమీకరణ విధానాలు; మార్క్ ప్రాజెక్టు; OCLC, MEDLARS, CAS, BIOSIS మొదలైన సమాచార—సంసర్గ పద్ధతులను పేర్కొనవచ్చును.

## భారతదేశంలో గ్రంథాలయ సహకారం

భారతదేశంలో గ్రంథాలయాల వనరులు సమష్టిగా పంచుకోవడమనేది భావన మాత్రమే. అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతి తప్ప ఇతర రూపాలు కనిపించవు.

## అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతి

1959 సంవత్సరంలో యు.జి.సి. కమిటీ చైర్మన్‌గా రంగనాథన్‌గారు సమర్పించిన నివేదికలో స్థానిక, ప్రాంతీయ, జాతీయ గ్రంథాలయాల మధ్య అన్ని రంగాల్లో సహకారం ఉండాలని కోరారు. సిన్హా కమిటీ కూడా విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు పౌర గ్రంథాలయాలతో సహకరించాలని కోరింది. IASLIC రెండవ, మూడవ వార్షిక మహాసభల్లో గ్రంథాలలో సహకారంపై చర్చలు జరిపి శ్రీ కె. ఎస్. హింగ్వే ఆధ్వర్యంలో ఒక ముసాయిదాను తయారు చేయడమైనది. ఈ కోడ్‌ను ఆధునీకరించాల్సి ఉన్నది.

## బొంబాయి సైన్స్ లైబ్రరీ అసోసియేషన్

1970 లో బొంబాయి విజ్ఞానశాస్త్ర సంఘం ఒక అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ ప్రకారం బాబా ఆటమిక్ రిసెర్చి సెంటర్, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అనే ఈ మూడు గ్రంథాలయాల మధ్య రోజూ ఒక మోటారు వ్యాను తిరుగుతుంది. దీని ద్వారా ఈ మూడు గ్రంథాలయాలకు అవసరమైన డాక్యుమెంట్లు ఇతర పఠన వస్తువులు అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతిలో సరఫరా అవుతాయి. దీనికయ్యే ఖర్చులు ఈ మూడు గ్రంథాలయాలు భరిస్తాయి.

## అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతి సమస్యలు

భారతదేశంలో గ్రంథాలయ వృత్తిలో ఆసక్తిగల గ్రంథపాలకుల మధ్య సహృదయత, సౌమనస్యం వల్ల అంతర్ గ్రంథాలయ అరువులు ఏర్పడ్డాయి. అయితే ఇది చాలా స్వల్పం. విరివిగా సాగటం లేదు. దీనికి ఎన్నో కారణాలున్నాయి.

అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతి విజయవంతం కావాలంటే అరువు తీసుకునే గ్రంథాలయం బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. పుస్తకాలను వ్యక్తుల పరంగా కాకుండా సంస్థాపరంగా అరువు కోరాలి. చదువరి కోరిన పఠనాసామగ్రిని స్థానికంగా సాధించటానికి ప్రయత్నించాలి. అంతర్ గ్రంథాలయ పద్ధతిని చివరి ప్రయత్నంగా మాత్రమే ఉపయోగించాలి. డాక్యుమెంట్లను సాధారణంగా రిజిష్టర్ పోస్ట్ లేదా వి.పి.పి ద్వారా సరఫరా చేయాలి. అరువుకోరే గ్రంథాలయం వీటిని సరియైన సమయంలో తీసుకుంటే మంచిది. కొన్ని సందర్భాల్లో వి.పి.పి. లను తిప్పి పంపడంతో సంబంధాలు చెడిపోతాయి. వాపసు పంపేటప్పుడు ప్యాకింగ్‌సరిగా లేకనో, అడ్రస్ పూర్తిగా రాయక పోవడంవల్లనో అవి

గమ్యస్థానాల్ని చేరుకోలేవు. అలాగె అరువుకోరినప్పుడు ఆ గ్రంథాలయం కోరిన డాక్యుమెంటు ఉందా లేదా అని వెంటనే తెలియజేయాలి. ఎందు కంటే ఆ డాక్యుమెంటు లేనట్లయితే అందుకోసం వేరే ప్రయత్నం చేసుకోవచ్చు.

అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతిలో రెండవ సమస్య ఏమిటంటే అరువు కోరిన డాక్యుమెంటు వివరం (రచయిత, గ్రంథనామం, ప్రచురణ కర్త, ప్రచురణతేది, ప్రచురణ స్థలం మొదలైన సమాచారం) పూర్తిగా లేకపోవడం. ఈ సమాచారం సరిగా లేకపోవడంవల్ల అరువిచ్చే గ్రంథాలయం అనవసర ప్రయాసకు గురి అవుతుంది. యూనియన్ కేటలాగ్‌లు, ఆక్సేషన్ లిస్ట్‌లు, గ్రంథాలయాల ముద్రిత కేటలాగులు డాక్యుమెంటు ఏ గ్రంథాలయంలో లభిస్తుందో తెల్పుతాయి. కాని భారత దేశంలో పుస్తకాలకు యూనియన్ కేటలాగ్ ఇంతవరకు లేదు.

అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతిలో డాక్యుమెంట్లు తెప్పించు కోవడంలో ఖర్చులు, ఎవరు భరిస్తారు? అనేది ఇంకొక సమస్య. ఆస్ట్రేలియా, బ్రిటన్‌లలో జరిపిన సర్వేలవల్ల అరువిచ్చే గ్రంథాలయం ఒక వ్యక్తి నెలసరి జీతం ఖర్చు చేయాల్సి ఉంటుందని తేలింది. బ్రిటిష్ లైబ్రరి లెండింగ్ డివిజన్ నుండి డాక్యుమెంటు తెప్పించుకోవడం ఎంతో ఖర్చుతోకూడిన పని. భారతదేశంలో గ్రంథాలయాలు పుస్తకాలను ఉచితం గానే అరువు ఇస్తాయి. సాధారణంగా అరువు పుచ్చుకునే గ్రంథాలయం తపాలాఖర్చులు, ఫోటోకాపీ ఖర్చులు వగైరాలు భరించాల్సి ఉంటుంది.

రాతప్రతులు, తాళపత్ర గ్రంథాలు మొదలైన అరుదైన గ్రంథాలు, ఖరీదైన డాక్యుమెంట్లు, సిద్ధాంత గ్రంథాలు, అరువు

ఇవ్వడంలో సమస్యలు ఎదురౌతాయి. కాబట్టి వీటిని సాధారణంగా అరువు ఇవ్వరు. ముద్రణలో లేని (Out of Print) పుస్తకాలు, జీర్ణావస్థలో ఉన్న పుస్తకాలు కూడా అరువుగా ఇవ్వరు. ఆటోమేటిక్ జిరాక్స్ పద్ధతులు ఇటీవల వచ్చాయి కాబట్టి వీటి నకళ్ళను తీసి పంపవచ్చు.

హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరాల (40 కిలోమీటర్ల) పరిధిలో దాదాపు 100 గ్రంథాలయాలు ఉన్నాయి. ఈ గ్రంథాలయాలు ఇంజనీరింగ్, టెక్నాలజీ, రసాయన, భౌతిక, వ్యవసాయశాస్త్రాలు, రక్షణ, పరమాణుశాస్త్రం, మెటలర్జీ సామాజిక శాస్త్రాలు మొదలైన విషయాలకు సంబంధించిన విశేష సంకలనాలను కల్గి ఉన్నాయి. కొన్ని గ్రంథాలయాల్లో కంప్యూటర్లను ఉపయోగిస్తున్నారు. ఈ గ్రంథాలయాలు స్వతంత్రంగా తమకు తామే తమ పరిశోధకుల సమాచార అవసరాలను తీర్చలేవు. ఈ గ్రంథాలయాల్లో అంతర్ అధ్యయనాలకు, అలాగే పరివ్యాప్త విషయాలకు దోహదంచేసే సంకలనాలున్నాయి. ఉదాహరణకు రీజినల్ రిసెర్చ్ లేబొరేటరీ గ్రంథాలయం, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ గ్రంథాలయం ఒకదానికొకటి దగ్గరగా ఉండడమే కాక అన్యోన్య సంబంధ విషయాలపై డాక్యుమెంట్లను కల్గిఉన్నాయి. అలాగే జంటనగరాల్లో ఉస్మానియా విశ్వవిద్యాలయం, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు అండ్ ఫారన్ లాంగ్వేజస్, హైదరాబాదు విశ్వవిద్యాలయం, జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం మొదలైన విశ్వవిద్యాలయాలే గాక వీటి అనుబంధ కళాశాల మధ్య అంతర్ గ్రంథాలయ సహకారానికి ఎంతో అవకాశం ఉంది.

1986 లో ఈ రచయిత జంటనగరాల్లో 35 వివిధ గ్రంథాలయాలను సర్వేచేసి ఈ క్రింది అంశాలను గమనించటం జరిగింది.

(1) ఈ 35 గ్రంథాలయాల్లో 27 గ్రంథాలయాలు మాత్రమే ప్రత్యుత్తర మిచ్చాయి. ఇందులో 22 గ్రంథాలయాలు మాత్రమే సహకార కార్యక్రమాల్లో పాల్గొంటున్నాయి. అయితే బ్రిటిష్ లైబ్రరీ, న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్ గ్రంథాలయం, తమ అనుబంధ సంస్థలకు మాత్రమే పుస్తకాలను అరువిస్తాయి; చాలావరకు ఈ గ్రంథాలయాలు ఇతర ప్రాంత గ్రంథాలయాలకు పుస్తకాలు అరువివ్వటంలేదు. సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టూల్ డిజైన్, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్స్ గ్రంథాలయాలు సహకార కార్యక్రమాల్లో అసలు పాల్గొనటంలేదు. సహకార కార్యక్రమాల్లో పాల్గొనే గ్రంథాలయాల మధ్య కూడా నిర్ణీతమైన విధానాలు, సంబంధాలు ఏవీలేవు. స్థానికంగానైనా, ప్రాంతీయంగానైనా, జాతీయంగానైనా అంతర్ గ్రంథాలయ అరువుకు సంబంధించిన నియమావళి ఏదీలేదు. ఈ నవీన యుగంలో కంప్యూటర్లను శీఘ్రసమాచార సంసర్గ సాధనకు ఉపయోగిస్తున్నారు. కాబట్టి అంతర్ గ్రంథాలయ సహకారానికి కంప్యూటర్ నెట్‌వర్కులను రూపొందించి ఉపయోగిస్తే సమయం, శ్రమ, ఎంతో ఆదా అవుతుంది.

(2) అకాడెమీ ఆఫ్ లైబ్రరీ సైన్స్ అండ్ డాక్యుమెంటేషన్ (హైదరాబాదు) ఈ విషయంలో చొరవ తీసుకొని స్థానికంగానైనా గ్రంథాలయ సహకారాన్ని ప్రోత్సహించడానికి ప్రయత్నించాలి. ఇందుకు ముందు ప్రయత్నంగా జంటనగరాల గ్రంథాలయ డైరెక్టరీని నూతనంగా

ముద్రించాలి. అలాగే జంటనగరాల్లోని గ్రంథాలయ సంకలనాలు తెల్పే యూనియన్ కేటలాగును కార్డు రూపంలో నిర్వహించాలి.

(3) బొంబాయి సైన్సు లైబ్రరీ అసోసియేషన్ వారి అనుభవం, ఐ.సి.యస్.యస్.ఆర్; జె.ఎన్.యు వారి ఇంటర్ లైబ్రరీ రిసోర్స్ సెంటర్లు ఇతర సహకార కార్యక్రమాల అనుభవాలు ఆధారంగా జంట నగరాల అంతర్ గ్రంథాలయ సహకారానికి చక్కని రూపకల్పన చేస్తే స్థానికంగానే కాకుండ జాతీయంగా కూడా మార్గదర్శకం అవుతుంది.

—(o)—

గద్దె రామమూర్తి

# 4.1 గ్రంథాలయ సామాజిక సేవలు

చైతన్యం, వివేచనాశక్తి ఉండటంవల్ల అన్ని జీవరాసుల్లోను మానవ జన్మ ఉత్కృష్టమైనది. అందుచేతనే మానవునికి విజ్ఞానం అత్యంతావశ్యకం. విజ్ఞానం లోపంవల్లనే సహజవనరులు ఎన్ని ఉన్నా సద్వినియోగపరచుకో లేక మానవుడు వ్యధల పాలవుతున్నాడు.

మానవ అవసరాలైన ఆహార దినుసులు, వస్తుసామగ్రి చాలినంతగా ఉత్పత్తిచేసుకోలేకపోవటం, ఉత్పత్తి అయినదానిని సక్రమంగా పంపిణీ చేసుకోలేకపోవటం జరుగుతున్నది. జనాభాలో ఎక్కువభాగానికి కనీస అవసరాలు కూడా తీరక నానా అగచాట్లు పడటం జరుగుతున్నది. తోటి మానవుల అవసరాలు తీరకుండా కొంతమంది అడ్డుపడటం, తమ అవసరాలు తీర్చుకోవటంలో ఎదురయ్యే చిక్కులను మరికొందరు తొలగించుకోలేకపోవటం, కూడా విజ్ఞాన లోపం వల్లనే.

చంద్రమండలానికి పయనించటంవరకు ఎదిగిన శాస్త్ర విజ్ఞానం మానవాభ్యుదయానికి కాక వినాశనానికి దారితీయటం కూడా విజ్ఞాన లోపమే. అందుచేతనే మానవ సమాజం కోసం ఆలోచించి, తపనపడి సమాజ అభ్యుదయంకోసం అహరహం కృషి జరిపి మేధావులనిపించు కున్న ప్రతి ఒక్కరు మానవునికి అత్యంతావశ్యకమైనది విజ్ఞానమన్నారు.

## గ్రంథాలయాలు

సమస్త విజ్ఞానాన్ని అక్షరాస్యులకు, నిరక్షరాస్యులకు అందించే సాధనాలే గ్రంథాలయాలు. గతంలో గ్రంథ సంపద, సదుపాయాల్లు

అరుదుగా ఉన్న రోజుల్లోను, అక్షరాస్యులు స్వల్పంగా ఉన్న కాలంలోను కథలు, పురాణాలు, హరికథలు, ఉపన్యాసాలు చెప్పడంద్వారా సమాజానికి గ్రంథాలయ సేవలు అందించారు. ఈ విధంగా విజ్ఞానం అందుకున్న నిరక్షరాస్యులు పలువురు అనేక హోదాల్లో సమాజానికి సమర్థవంతమైన సేవలు చేసిన దాఖలాలున్నాయి. మానవునికి అవసరమైన నిత్య సమాచారం, మనుగడకు అవసరమైన విషయ పరిజ్ఞానం, సౌఖ్యవంతమైన జీవనాన్నిచ్చే శాస్త్ర విజ్ఞానం అందించే అవకాశం గ్రంథాలయాలకు నేడున్నది. అక్షరాస్యులకు పత్రికలు, పుస్తకాలు అందించుటేకాక నిరక్షరాస్యులకు దృశ్య, శ్రవణ మాధ్యాలద్వారా గ్రంథాలయాలు జ్ఞానాన్ని వ్యాప్తి చేయవచ్చును.

## వయోజన విద్య

నిరాక్షరాస్యులను అక్షరాస్యులను చేయటం, వారికి పఠన సామర్థ్యం అందించి, అభిరుచి పెంచి విషయ పరిపుష్టి కలిగించే అవకాశం గ్రంథాలయాలకు ఉన్న కారణంగా వయోజన విద్య బడ్జెట్‌ను గ్రంథాలయాలకు కలపటం సబబు. గ్రంథాలయాల్లో వయోజన విద్య నిర్వహణకు కొన్ని గంటలు నిర్ణయించి గ్రంథాలయ సిబ్బందికి వయోజన విద్యా శిక్షణ ఇప్పించి పని చేయించటం అవసరం. గ్రంథాలయంలోనే వయోజన విద్యా వసతులు కల్పించిననాడు వయోజన విద్యకయ్యే ద్రవ్యాన్ని కూడా గ్రంథాలయ నిర్వహణలో చేర్చటం, సిబ్బందిని పెంచటం, ఆ విధంగా సదుపాయాలు పెంచి ఒకే వసతిలో అక్షరాస్యతను సాధించి అందరికి విజ్ఞానం పంచటం వీలవుతుంది. అప్పుడు గ్రంథాలయాలు అన్ని హంగులతో అక్షరాస్యతను పెంచటానికి, అక్షరాస్యులకు పుస్తకాల ద్వారాను, నిరక్షరాస్యులకు ఇతర సాధనాల ద్వారాను సేవను అందించవచ్చును.

## సర్వత్రా గ్రంథాలయాలు

అక్షరాస్యులకు వయోజన విద్యాసదుపాయం, నిరక్షరాస్యులకు దృశ్య శ్రవణ సదుపాయం, స్థానికావసరాలకు పనికివచ్చే పుస్తకాలు, పత్రికలతో సామాన్య గ్రంథాలయాలు ఊరూర, పేటపేట ఉండాలి. మండల కేంద్రాల్లోనూ, పట్టణాల్లో ముఖ్యకేంద్రాల్లోను సర్వాహంగులుగల గ్రంథాలయాలు, నగరాల్లో పరిశోధనకు ఉపయోగపడే గ్రంథాలయాలు, ఉండటం అవసరం. గ్రామీణ గ్రంథాలయాలు తమ అవసరాలను సహకార పద్ధతిలో తీర్చుకోవచ్చును.

గ్రంథాలయ సేవలు అన్ని రంగాల్లోని వారికి అందాలి. అంటే సాంస్కృతిక వర్గాలకు, విద్యావేత్తలకు, మేధావులకు నగరాల్లోను, పట్టణాల్లోను కల సర్వసంపన్నమైన గ్రంథాలయాలు ఉపయోగపడగా,సామాన్యులకు సామాన్య గ్రంథాలయాలు ఉపయోగపడాలి. ఈ సామాన్య గ్రంథాలయాలు ఉండవలసిన తీరు, వీటి సేవలు, నిర్వహణ పద్ధతులు మొదలైన విషయాలను మాత్రమే ఈ వ్యాసంలో వివరించడమైంది.

సామాన్య గ్రంథాలయాలను గ్రామీణ గ్రంథాలయాలుగా మాత్రమే పిలువ వీలులేక పోవడానికి కారణముంది. ఇవి గ్రామాల్లోనే కాక పట్టణాల్లోను, పేటల్లోను కూడా ఉండాలి కనుక గ్రామీణ గ్రంథాలయాలు అనటం కంటే సామాన్య గ్రంథాలయాలు అనడం మంచిది.

## సామాన్య గ్రంథాలయాలు

సమాచారాన్ని అందించే పత్రికా విభాగం, స్థానికావసరాలను తీర్చే పుస్తక విభాగం, వయోజన విద్యా సదుపాయం, పలు విషయాలపై గోష్ఠులు, ఉపన్యాసాలు జరిపించగల సదుపాయాలుండే గ్రంథాలయాలు. సామాన్య గ్రంథాలయాలు. ఇవి ప్రతి గ్రామానికి, పట్టణాల్లో ప్రతి పేటకు, నగరాల్లో ప్రతి ప్రాంతానికి ఒకటి చొప్పున ఉండాలి.

అక్షరాస్యత (వయోజన విద్యా బోధన) పనిచేస్తూ, అక్షరాస్యులైన స్థానికులకు పఠనావకాశం కలిగించే ఏర్పాట్లు చేయాలి. వారి వారి వృత్తులకు అవసరమైన పరిజ్ఞానం సునాయాసంగా పొందడానికి పెద్ద అక్షరాలతో ముద్రించిన వివిధ విషయాలపై చిన్నచిన్న పుస్తకాలు ఈ గ్రంథాలయాల్లో ఉండాలి. వ్యవసాయం, చేతి వృత్తులు మొదలైన స్థానిక విషయావసరాలను ప్రతిబింబించే పుస్తకాలను మాత్రమే ఈ గ్రంథాలయాలకు ఎంపిక చేయాలి. జాతీయ, అంతర్జాతీయ సమాచారంతో పాటు స్థానిక సమాచారం అందించే పత్రికలు, చిరుపత్రాలు, కరపత్రాలు, సమాచార ప్రకటనలు ఈ గ్రంథాలయంలో ఉండాలి. కాలానుగుణంగా పంటల సమాచారం, రసాయనిక ఎరువుల వాడకం పురుగు మందుల వాడకం మొదలైన సమాచారం ఈ గ్రంథాలయాల్లో పొందుపరచాలి. గృహిణుల అవసరాలకు సంబంధించిన వంట-వార్పు' పిల్లల పెంపకం, ఆరోగ్యరక్షణ, గృహ శుభ్రత, బట్టల శుభ్రత, ఆహార విధానం ఆదిగాగల విషయాలకు సంబంధించిన సంగ్రహపుస్తకాలు ఈ గ్రంథాలయాల్లో చోటుచేసుకోవాలి. పిల్లలకు నీతిని ప్రీతిగా చెప్పే కథల పుస్తకాలు, వారిని ప్రభావితం చేసే త్యాగపురుషుల జీవిత చరిత్రలు, బొమ్మల ద్వారా విషయాన్ని బోధించే ఆకర్షణీయమైన పుస్తకాలు ఈ గ్రంథాలయాల్లో ఉండాలి. ఈ సామాన్య గ్రంథాలయాల పుస్తకాల ఎంపిక జిల్లా కేంద్రంలో గాక స్థానిక పెద్దల సలహా సంప్రదింపులతో గ్రంథాలయ నిర్వాహకులు స్థానికంగా చేయాలి.

పైన వివరించిన విధంగా పఠన సామగ్రిని సమకూర్చుకోవటం ఒక ఎత్తు. వాటిని ప్రజలకు తెలియపర్చడం, ప్రజలు పఠించి లాభం పొందేటట్లుచేయడం మరొకఎత్తు. వార్షికోత్సవాల సందర్భంలోను, ఇతర సమావేశాల సందర్భంలోను ఈ గ్రంథాలయంలో ఉండే పుస్తకాల వివరం తెలుపుతూ, అందలి విషయాలను వివరించటం ద్వారా ప్రజలు తమ వృత్తుల్లో పొందగల లబ్ధిని గూర్చి సమీక్ష చేస్తూఉండాలి.

వ్యవసాయ రంగంలోను, గ్రామీణవృత్తుల రంగంలోను, పిల్లల చదువుల రంగంలోను, శ్రామిక రంగంలోను పోటీలు నిర్వహించి బహు

మతులు వగైరా ఇస్తూ, పుస్తకాలు చదవటంవల్ల తమకు అవసరమైన విషయ విజ్ఞానం పొందటానికి ప్రోత్సహించాలి. ఈ విధంగా అలవాటు పడిన సామాన్య గ్రంథాలయ పాఠకులు విషయ పరిపుష్టిపొంది సుఖ మయజీవనం గడపగలరు.

## గ్రంథాలయాల విస్తరణ

గ్రామం, పట్టణం అనక అన్ని ప్రాంతాల్లో సామాన్య గ్రంథాలయ సౌకర్యం విస్తరింపచేయటానికి కొన్ని సూచనలు: ప్రస్తుతం రాష్ట్రంలో మండల కేంద్రాల వరకు గ్రంథాలయాలు విస్తరించి ఉన్నాయి. రాష్ట్రంలో ఇంకా సుమారు 25 వేల గ్రామాల్లో, పట్టణాల్లో 10 వేల తావుల్లో వెరశి సుమారు 35 వేల తావుల్లో సామాన్య గ్రంథాలయ సౌకర్యం అందించ వలసి ఉంది. ప్రస్తుత రాష్ట్ర బడ్జెట్ ననుసరించి జిల్లా గ్రంథాలయ సంస్థల ద్వారా 35 వేల శాఖా గ్రంథాలయాలు నెలకొల్పి నిర్వహించ టానికి సుమారు 200 కోట్ల రూపాయలు అదనంగా కావలసివస్తుంది. కనుక ఈ కింది సూచనను ఇవ్వడమైంది.

(1) హైస్కూళ్ళలో ఉన్న గ్రంథాలయాలను స్కూలు వేళల్లో కాక ఇతర వేళల్లో ప్రజల వినియోగం కోసం తెరవాలి. సిబ్బందికి అదనంగా భృతి చెల్లించి పాఠశాల అవసరాలతోపాటు స్థానికావసరాలకు అనుగుణంగా పఠన సామగ్రి చేకూర్చాలి.

(2) ప్రైవేటు గ్రంథాలయాలకు ఆర్థిక సహాయంచేసి వాటి విని యోగం విస్తృతం చేయాలి.

(3) పంచాయతీ పరిధిలో గ్రామ గ్రంథాలయ సంఘాల ద్వారా ప్రభుత్వ ఆర్థిక సహాయంతోను, పంచాయతీ ప్రజల సహకారం తోను గ్రామాల్లో సామాన్య గ్రంథాలయాలు నిర్వహించాలి.

పై మూడు సూచనలు పాటించినపక్షంలో రాష్ట్రంలో అన్నిచోట్ల గ్రంథాలయ సేవ అన్ని తరహాల ప్రజలకు అందించవీలవుతుంది. తక్కువ ఖర్చు అంటే రాష్ట్రం మొత్తం మీద సుమారు 20 కోట్ల రూపాయలతో ఈ పని నెరవేరగలదు.

—(o)—

జి. నరసింహ మూర్తి

# 4.2 సాంఘిక, సాంస్కృతిక వర్గాలు గ్రంథాలయ సేవలు

గ్రంథాలయాలు సమాజంలో అంతర్భాగం. సమాజ పరిణామ ప్రభావంగా ఏర్పడే వివిధ సాంఘిక సాంస్కృతిక సంస్థల్లో ఇది ఒక విశిష్టరూపం. అయితే ఈ సంస్థ స్వభావ స్వరూపాలు, సేవాలక్ష్యాలు, తత్సాధనా విధానాలు అలాగే సేవావసరాలు అన్నీకూడ ఆ సమాజం సాధించిన పరిజ్ఞానం మీద ఆధారపడి ఉంటాయి. ముఖ్యంగా సాంస్కృతిక చిహ్నాలైన పుస్తకాల ఉత్పత్తి దీనికి ఆధారం. అంటే ఆ జాతి అలవరచుకున్న సృజనాత్మక ప్రక్రియ దీనికి మూలస్తంభం. అంతే కాకుండ సాంఘిక లక్ష్యసాధనలో ఆ జాతి ఏర్పరచుకున్న పరిజ్ఞాన-సమాచార-సంసర్గ వ్యవస్థాక్రమం, విద్యావిషయకమైన విలువలు, జీవన సరళి మొదలైనవి కూడ గ్రంథాలయాలకు జీవం పోస్తాయి.

ఇదీ, అదీ అనకుండ అన్ని సమాజాల్లో కూడ గ్రంథాలయ లక్ష్యాలు ముఖ్యంగా పుస్తక సంపాదన, భద్రతలు, వ్యవస్థీకరణ, తత్సంబంధమైన వివిధ వాఙ్మయ సమాచారాది సేవలు అనేవిగా ఉన్నాయి. కానీ ఈ లక్ష్యాలు స్థానికంగా ఆ జాతి సాధించిన అభివృద్ధి, ముందు ముందు సాధించుకునే అభివృద్ధిని అనుసరించి అవసరమైన రీతుల్లో ప్రత్యేకతలను, విశిష్టతలను రూపొందించుకోవడం జరుగుతుంది. నేటి సమాజాల్లో గ్రంథాలయావశ్యకత ప్రతిరంగంలోను, ప్రతి కార్య సాధనలోను అత్యంత అవసరం. ఇది అందరికీ, ఇంతో అంతో అనుభవ

పూర్వోక్త విషయమే అంటే గ్రంథాలయాలు కేవలం వివిధవర్గాల ప్రజలకు సేవలనందించడమే ఉద్దేశ్యంగా కాక నిత్యజీవితంలో వృత్తి పరంగా కాని, ఆదర్శపరంగా కాని అవసరమయ్యే సేవలను అందించటం కూడ ప్రధాన లక్ష్యంగా నిర్వహించటం జరుగుతుంది. ఈ విధంగా విద్యాసంస్థల్లో, ప్రభుత్వసంస్థల్లో, వాణిజ్య, పారిశ్రామిక, పరిశోధన, సంస్కృతి మొదలైన రంగాల్లో గ్రంథాలయాలు ఏర్పడి ఆయా లక్ష్య సాధనలో పాల్గొనటం విధిగా ఎంచబడుతుంది. ఈ ప్రత్యేక రంగాల్లోనే కాక సమాజంలో సామాన్యంగా ఏర్పడే వాఙ్మయ సమాచారాది అవసరాల నాదుకునే నిమిత్తం కూడ అన్ని దేశాల్లో పౌర గ్రంథాలయాలను నెల కొల్పటం జరిగింది.

స్థూలంగా చెప్పవలసివస్తే గ్రంథాలయాలకు విద్య, పరిశోధన, సమాచారం, విరామకాలక్షేపం, వినోదం, సౌందర్య ప్రశంస, విషయ పరిశీలన ఇత్యాది అవసరాలకు తగిన సేవలనందించటమే లక్ష్యసాధ నంగా చెప్పటం సర్వసాధారణంగా కనిపిస్తుంది. ఈ లక్ష్యాలు సామాన్యంగా పౌర గ్రంథాలయాలు పూర్తిగా నిర్వహిస్తే ఇతర గ్రంథా లయ విధానాలు (విద్యా సంస్థల గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథా లయాలు మొదలైనవి) వీటిలో కొన్నింటిని మాత్రమే ముఖ్యంగా నిర్వ హిస్తాయి.

మరొక విషయం. గ్రంథాలయాలు కేవలం విద్యాధికులకు, అక్ష రాస్యులకు మాత్రమే అవసరపడతాయన్న పాత అభిప్రాయం నేడు మరుగుపడింది. నేటి ప్రజాస్వామ్య విధానంలో విజ్ఞాన సమాచారావసరాలు ప్రతి మానవుని జన్మహక్కుగా భావించటంచేత ఈ విధిని పౌర గ్రంథాలయాలకు అప్పజెప్పడం జరగటం, ఆ విధంగా వివిధ గ్రంథాలయ సేవలను పరిశీలించినప్పుడు పౌర గ్రంథాలయసేవలే అత్యంత ప్రశంస నీయం, విస్తృతం, సంశ్లిష్టంగా కనిపిస్తాయి. ఏదెలా ఉన్నప్పటికీ ప్రతి

సమాజంలో ఉన్న గ్రంథాలయాలన్ని కూడ స్థూలంగా ఒకే లక్ష్యసాధనకు దోహదం చేస్తాయి. అది సమాజ పురోగమనం. ఈ పురోగమన లక్ష్య సాధనలో సమాజం కలిసికట్టుగా శ్రమవిభజన అనే సూత్రప్రాతిపదిక మీద వివిధ కార్యాలను చేపట్టినట్లే గ్రంథాలయాలు కూడ ఆ యా సందర్భాలకు స్థానికావసరాలకు అనుగుణంగా వివిధ కార్యకలాపాలను సాగించటం ఏర్పడింది. అందుచేత వీటి నిర్వహణ విషయంలో పరస్పర సంబంధ బాంధవ్యాలు, ఏకరీతులు, సహకారం అవసరం. ఏ గ్రంథాలయం కూడ పూర్తిగా నిర్దేశించిన లక్ష్యసాధనకు దోహదం చేయలేదు. అందుచేతనే వీటిని స్థానిక, రాష్ట్ర, జాతీయ పరిధుల్లో, ఇంకా చెప్పవలసి వస్తే అంతర్జాతీయస్థాయిలో కూడ ఒక సమష్టి విధానంగా వ్యవస్థీకరించటం అవసరం. అంటే గ్రంథాలయ వనరులను సమష్టిగా సంపాదించటం, ఆ వనరులను సమష్టిగా ఉపయోగించుకోవటం, ఆ విధంగా వివిధ లక్ష్యాలను సాధించటం జరగాలి.

చారిత్రక కారణంగా మనదేశంలో సాంస్కృతికపరమైన లక్ష్య సాధనలో ఎంతో శ్రద్ధా లోపం ఏర్పడినందువల్ల గ్రంథాలయాభివృద్ధి సమంగా, సక్రమంగా, సహేతుకంగా కావించబడలేదు. విద్యారంగంలో గ్రంథాలయం అతి కీలకస్థానం వహిస్తుందని మనకందరికి తెలిసిన విషయమే. కాని ఎన్నో వేలాది ప్రాథమిక పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు, వందలాది కళాశాలలు అలాగే గ్రంథాలయావసరం ఉన్న సంస్థలు, సమాజాలు, గ్రంథాలయం నామమాత్రం కూడ లేకుండ కొనసాగుతున్నాయి. ఈ పరిస్థితి మారినపుడే మనం చేపట్టిన సర్వతో ముఖాభివృద్ధి కార్యక్రమాలు నిండుదనం తెచ్చుకొని సఫలీకృతమవుతాయి. ఇందుకు ముఖ్యంగా ప్రస్తుతం అంతో ఇంతో ఎన్నదగిన గ్రంథాలయాలను ఒక పరిధిలోకి వ్యవస్థీకరించి ప్రస్తుతం నెలకొన్న అస్తవ్యస్తాలను సరిదిద్ది వాటి వనరులను అభిలషణీయమైన విధంగా ఉపయోగానికి తీసుకు

రావటం జరగాలి. ఈ విధమైన వ్యవస్థీకరణ ఈ వ్యాసంలో వివరించ దలచిన వివిధ సాంఘిక సాంస్కృతిక వర్గాలకవసరమయ్యే గ్రంథాలయ సేవాచర్చకు పూర్వ పీఠికగా ఉండగలదనే అభిప్రాయంతో ప్రస్తా వించటం జరిగింది.

సమాజం అనేక భాగాలు. ముఖ్యంగా సమూహాలు, ఉప సమూహాలు, సంస్థలు, సంఘాలు, సముదాయాలతో కూడి ఏర్పడింది. ఈ విధమైన భిన్న సమూహాలతోను, ఆచార వ్యవహారాలతోను, కట్టుబాట్ల తోను, వృత్తులతోను, కులాలతోను, మతాలతోను, భాషలతోను, జాతుల తోను ఉండి నిర్ణీతమైన హద్దుగల ప్రదేశంలో నివసిస్తూ, పరస్పర సహకారంతో అనేక సామాజిక సంబంధాలతో విలసిల్లుతూ ఉండేదే మానవ సమాజం.

సమూహమంటే కొంతమంది వ్యక్తుల కలయికయేగాక ఆ వ్యక్తుల మధ్య పరస్పర సంబంధాలుండి, ఆ సంబంధాలతో వారు కలిసికట్టుగా పనిచేయడమేనని సాంఘిక శాస్త్రవేత్తల అభిప్రాయం. సమాజ ఔన్నత్యం, కీర్తిప్రతిష్టలు ఆ సమాజ సంస్కృతి మీద ఆధారపడతాయి. ఆ సంస్కృతి అభివృద్ధిగాంచి ముందుతరాలవారికి ఉపయోగపడుతుంది. సంస్కృతి అంటే సమాజ నిర్మితమైన మేధాసంపత్తి. ప్రజలభాష, విద్యా వ్యవస్థలు, ఆచార వ్యవహారాలు, నీతి నియమాలు, కళలు మొదలైనవి సామాజిక సంస్కృతిలో అంతర్భాగాలు.

సామాన్యంగా సాంఘికవర్గాలు సామాజికపరమైన భేద విభే దాలుగా వివరించవచ్చు. ఈ ప్రకారం కుల, మత పరమైన వర్గాలు, లింగపరమైన స్త్రీ, పురుష భేధాలు, అలాగే వయో పరమైన శ్రేణులు (బాల, యువక, వయోజన, వృద్ధవర్గాలు), వృత్తిపరమైన వివిధ రకాలు (కర్షకులు, శ్రామికులు, వ్యాపారులు, ప్రభుత్వోద్యోగులు, అధికారులు,

అధ్యాపకులు, శాస్త్రవేత్తలు, పరిశోధకులు, రాజకీయవేత్తలు మొ॥), అలాగే పట్టణ, గ్రామీణ ప్రాంత ప్రజలు, అల్పసంఖ్యాకవర్గాలు, గిరి జనులు, వెనుకబడిన వర్గాలు మొదలైన వాటిని సాంఘిక వర్గాలుగా చెప్పవచ్చును.

అట్లే సాంస్కృతిక వర్గాలను పరిశీలించినపుడు వివిధ భాషా వర్గాలు, వివిధ కళాకారులు, సాహితీవేత్తలు, శాస్త్రజ్ఞులు కులమతవర్గాలు, కొన్ని రకాల వృత్తికళాకారులు ఈ కోవకు చెందిన సమూహాలుగా కనిపిస్తారు.

ఈ రెండు వర్గాలు కూడ పరస్పరాంతరాలు కావు. వీటి మధ్య అనేక విధాలైన సారూప్యతలు, కలయికలు కనిపిస్తాయి. ఈ రెండు విధాల వర్గాలు కూడ సంఘటితమై ఉండవచ్చు, సంఘటితం కాకుండ కూడ ఉండవచ్చు.

గ్రంథాలయ సేవా ప్రణాళిక రూపరచనలో ఈ విధమైన సాంఘిక సాంస్కృతిక విశ్లేషణ, అలాగే అవసరమైన పూర్తి వివరాలు సేకరించినపుడే సేవా స్వరూపాన్ని నిర్ణయించటానికి, అవసరమైన వన రులను తదితర సామగ్రులను సమీకరించటానికి వీలవుతుంది. ఇదివరకే వివరించినట్లు ఒక సమాజంలో పౌరులకు అవసరమైన సేవా బాధ్యత పౌర గ్రంథాలయాలదే. కాని ఈ పౌరులు వివిధ విధాలుగా ఏర్పడి వివిధ రంగాల్లో కార్యకలాపాలను సాధించటంవల్ల, ఆయా రంగాలకు అవసర మైన విధంలో గ్రంథాలయ ఆస్కారమున్నంతమేరకు వాఙ్మయ సమా చారాది సేవ వ్యవస్థీకరణ కూడ అవసరం. ఈ విధంగా ప్రతి ఆధు నిక సమాజంలో వేరు వేరు గ్రంథాలయాలు వేరు వేరు బాధ్యతలను కలిగి ఉండి ఆయా లక్ష్య సాధనలో సామాజిక సంపూర్ణ కార్యకలాపాల్లో ఒక భాగంగా, ఆ జాతి సమగ్ర పురోగమనాభివృద్ధి కార్యవిధానంలో ఒక సాధనంగా పని చేస్తాయి.

స్వచ్ఛంద సేవాభావంతో వనరులను ఉపయోక్తలకందించి విశ్వజనీనత పొందడమే పౌర గ్రంథాలయాల ముఖ్యోద్దేశ్యంగా పేర్కొనవచ్చు. జాతీయ సమాచార విధానంలో అన్ని రకాల గ్రంథాలయాలను సంఘటితపరిచి, ప్రజల అవసరాలను స్థానిక, ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో ఆదుకునేందుకే భారత ప్రభుత్వం NISSAT ప్రణాళికను అమలుకు తెచ్చి శాస్త్ర సాంకేతిక విభాగాలలో సేవలందిస్తున్నది. అల్లే సాంఘిక శాస్త్రాల విభాగాల్లో ఈ విధమైన సేవలు NAS-DOC (ICSSR) సంస్థద్వారా ఏర్పాటైంది. మానవీయ శాస్త్రాలలోనూ, లలితకళలు, వృత్తికళల్లోను, ఇతరత్రా వివిధ స్థానిక సాంస్కృతిక కార్యకలాపాల్లోను ఈ విధమైన ప్రణాళికలేర్పడి సాంఘిక, సాంస్కృతిక వర్గాల వారికి సేవలందిచాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

అయితే పౌర గ్రంథాలయాలు, విద్యాసంస్థల గ్రంథాలయాలు అక్కడి వనరుల నుపయోగించే ఉపయోక్తల ఆధారంగా నిర్వచింప బడతాయి. విద్యాసంస్థలు కళలు, శాస్త్రాధ్యయన - అధ్యాపనలకు నిలయాలైయుండగా, పౌర గ్రంథాలయాలు ఈ శాస్త్ర సాహిత్యాలకు సంబంధించిన వనరులను సేకరించి, సేవలందించేవిగా ఉన్నాయి. అంటే విద్యాసంస్థల గ్రంథాలయాల్లో ముఖ్యంగా విశ్వవిద్యాలయ గ్రంథాలయాల్లో కూడ పౌర గ్రంథాలయాల్లో అందించే సేవలనన్నింటిని ఉపయోక్తల కందించవలసిన అవసరం కనిపిస్తుంది. పాఠకుల విషయంలో తప్ప, తక్కిన విషయాల్లో ఈ రెండు గ్రంథాలయాలకు భేదం కనిపించదు. సాంఘిక, సాంస్కృతిక వర్గాలవారి ప్రత్యేక సేవలకోసం గ్రంథాలయాలెన్నో ఉన్నాయి. ఈ విధమైన పరిశీలన, తదనుగుణమైన ఉపగమనాలు విదేశాల్లో బాగా కనిపిస్తాయి. ఉదాహరణకు బ్రిటన్‌లో (1) శాస్త్రవేత్తలకు, పరిశోధకులకు The Science Reference Library, British University Library; (2) వివిధ భాషాపరమైన రాతప్రతులు మొదలైన వాటికి బ్రిటిష్ గ్రంథాలయ అరువు విభాగం (BLLD); (3) న్యాయవాదులకు,

తత్సంబంధమైన విషయ విభాగాల వారికి The National Library of Scotland (Edinburg); (4) అర్థశాస్త్రం,తత్సంబంధమైన ప్రత్యేక సేవలకు Goldsmith's Library of Economics; (5) సాహితీ ప్రియులకు The Durning—Lawrence Library of Bacon and Shakespeare; (6) అద్భుత విషయాలు, ఇంద్రజాలాలు మొదలైన వాటికి The Harry Price Library on Phenomena and magic; (7) వాణిజ్య పారిశ్రామిక రంగాల్లోని వారికి The Research Library of Kodak Ltd (Wealdstone), Imperial chemical Industries Ltd. British Aeroplane Company, The Metal Box Company, Richard Thomas and Baldwin Ltd ఇత్యాది గ్రంథాలయాలు; (8) సంపాదకులు, ఉపసంపాదకులు, విలేఖరులు, రేడియో, దూరదర్శన్ వారికి, సంగీతాభిమానులకు British Library's News Paper (Colinde), BBC Music Library (London), Harry Watson Music Library (Manchester), Library at Television Centre (West London); (9) విద్యాది వృత్తులవారికి, వివిధ సంస్థల్లో వనిచేసేవారికి The Library of Royal Society for Medicine, the Institute of Transport, The British Dental Association, The National Book League మొదలైన గ్రంథాలయాలు దేశవ్యాప్తంగా సేవలనందించటం, అందుకు అవసరమైన వనరులను సమీకరించి వ్యవస్థీకరించటం ఆచరణలో ఉన్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో కూడ సాంఘిక, సాంస్కృతిక వర్గాలవారి సేవల్లో గుడ్డివారికి బ్రెయిల్ రాత కనిపెట్టడం ద్వారాను అంధకార బంధురాలయిన కారాగారాల్లోకి విజ్ఞానాన్ని ప్రసరింపజేయడం ద్వారాను, దృశ్యశ్రవణయంత్ర సహాయంలో వయోజనులకు, వికలాంగులకు సమాజంలో అస్వతంత్ర వర్గాల వారికిని సేవలనందించటం గమనార్హం. అంతే కాకుండా ప్రజాస్వామ్యదేశాలైన రష్యా, పోలండ్, రుమేనియా, హంగరీ, జర్మనీ, చెకోస్లవేకియాల్లో కార్మిక సంఘాల గ్రంథాలయాలు వివిధ రకాలైన సమాజసేవ లందిస్తున్నాయి.

భారతదేశంలో కూడ ఖుదాబక్ష్ ఓరియంటల్ పౌర గ్రంథాలయం (పాట్నా), తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయం, రాంపూర్ రాజా గ్రంథాలయం మొదలైన రాతప్రతుల గ్రంథాలయాలు; కేంద్రీయ సెక్రటేరియట్ గ్రంథాలయం మొదలైన ప్రభుత్వ సంస్థల గ్రంథాలయాలు; జాతీయ వ్యవసాయ గ్రంథాలయం (National Agricultural Library, New Delhi); జాతీయ వైద్య గ్రంథాలయం (National Medical Library); జాతీయశాస్త్ర గ్రంథాలయం (National Science Library) మొదలైన శాస్త్రసాంకేతిక గ్రంథాలయాలను పేర్కొనవచ్చును. అయితే ఈ కోవలో ఇతర రంగాల వారికి సేవలనందించటానికి వివిధ రకాల జాతీయ గ్రంథాలయాలు ఏర్పాటు కావాలి.

సామాజికాభివృద్ధికోసం భారతదేశమంతటా గ్రామీణ గ్రంథాలయాలేర్పడి సాంఘిక విద్యకు ప్రోత్సాహమిచ్చాయి. విద్య, సమాచార, వినోదాల్లో విస్తృతంగా సేవలందిస్తూ గ్రామీణ వృత్తులవారి నిరక్షరాస్యత నిర్మూలన కావిస్తూ, తీరిక సమయాల్లో నియత, అనియత, వయోజన విద్యను గ్రంథాలయాల ద్వారా అందిస్తూ సేవచేస్తున్నాయి. గ్రామీణ ప్రజలు స్థానిక, ప్రాంతీయ, జాతీయస్థాయిల్లోని రాజకీయ, సాంస్కృతిక, క్రీడాది పరిజ్ఞాన విషయాల్లో గ్రంథాలయాలనేక విధాలుగా సహకరిస్తున్నాయి. ఇంకా నాటకాలు, జానపద పాటలు, తోలుబొమ్మలాటల వంటి వినోద కార్యక్రమాల నేర్పాటుచేసి గ్రామీణ గ్రంథాలయాలు సమాజ సేవా కేంద్రాలై విలసిల్లాయి.

ఈ వివిధ కార్యక్రమాలు పౌర గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు, ప్రభుత్వ గ్రంథాలయాలు ఇతరాలు దేశవ్యాప్తంగా

చేపట్టాలి. ఇక విద్యావిషయం. విద్యారంగంలో కళాశాలల్లోను విశ్వ విద్యాలయాల్లోను గ్రంథాలయాలు ముఖ్యావసరం. ఈ గ్రంథాలయాలు సమకూర్చే సాధనసంపత్తి సాధారణంగా (1) వివిధ విషయాల్లో పరిశోధన ప్రాధాన్యం కల వనరులను సమకూర్చటం; (2) సమర్థవంతమైన సేవలద్వారా అధునాతన సమాచారాన్ని పరిశోధకులకు, ఉపాధ్యాయుల కందించటం; (3) ప్రవేశ పెట్టిన విద్యా విషయాల్లో గ్రంథాలయ సేవలు, సౌకర్యాలు సమకూర్చటం; (4) ఉన్నత విద్య, పరిశోధనలకు సానుకూల వాతావరణాన్ని కల్పించటం; (5) అంతర్విషయ పరిధుల్లో శిక్షణ వనరులను పెంపొందింప జేయడం — అనేవిగా ఉంటాయి.

గ్రంథాలయసేవలు అనేకం. అవన్నీ కూడ పుస్తకసమాచార లభ్యం, వివిధ వాఙ్మయ ప్రక్రియలు, తద్వారా ఏర్పడే సాధనాలు అని స్థూలంగా చెప్పవచ్చును. అయితే వీటన్నిటికి కూడా వనరులే ముఖ్యం. ఒక జాతి సాంస్కృతిక పురోగమనానికి అవసరమయ్యే పుస్తక వనరులు ఎక్కువమేరకు ఆయా భాషల్లోనే ఉండటం సమంజసం.

మనదేశంలో భాషాపర రాష్ట్రాలేర్పడ్డప్పటికీ, ఈ రాష్ట్ర ప్రభుత్వాలు గాని, ప్రజలు కాని ఆయా భాషా సంస్కృతులను పునర్ని ర్మించి పరిపక్వాన్ని సాధించి ముందు ముందు అభివృద్ధిని చేకూర్చే విషయమై తగిన శ్రద్ధ వహించినట్టు కనిపించదు.

ఈ విషయంలో మన రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల తెలుగు విశ్వ విద్యాలయాన్ని స్థాపించటం ద్వారా తత్సాధన కార్య స్వరూపాన్ని రూపొందించటం ప్రశంసనీయమైన విషయం. ఈ సందర్భంలో తెలుగు విశ్వవిద్యాలయ ఉద్దేశ్యాలతో పాటు ప్రభుత్వ ఉద్దేశ్యాన్ని, అలాగే జాతి అవసరాన్ని అన్వయించి గ్రంథాలయ వ్యవస్థీకరణ తగు విధంగా నిర్ణ యించటం, పరిష్కృతం కావటం జరగాలి. కేవలం అధ్యాపకులకు, విద్యా

ర్థులకు, బోధనకు, పరిశోధనకు మాత్రమే కాక రాష్ట్రవ్యాప్తంగా జాతి సామాజిక సాంస్కృతిక, నైతిక, కళామయ జీవన ఔన్నత్యానికి అవసరమైన వనరులను ప్రధాన లక్ష్యంగా తీసుకొని సంకలనాభివృద్ధిని రూపొందించాలి. ఈ విషయంలో ప్రస్తుతం శ్రీశైలం, రాజమండ్రిలలో ప్రాంగణ గ్రంథాలయాలతో పాటు మరికొన్ని శాఖా గ్రంథాలయాలు, వాటి ప్రత్యేకీకరణలు ఆలోచించాలి. అలాగే తెలుగు జాతి, తెలుగు భాష, సాహిత్యం ఇత్యాది విషయపరమైన రచనలు, ప్రచురణలు—పాతవి, ప్రస్తుతానివి, ముందుముందు వచ్చేవి—అన్నిటిని సమగ్రంగా పరిపూర్ణంగా సమీకరించి అవసరమైన వాఙ్మయప్రక్రియలు, వాఙ్మయ పరికరాలను ఏర్పరచాలి. ఈ కార్యక్రమానికి గ్రంథాలయ పరంగా ఎంతో పరిశోధన నెరవేర్చవలసిన అవసరం కూడా ఉంది.

—(o)—

ఆమళ్ళదిన్నె గోపీనాథ్

# 4.3 వివిధ సాంఘిక, సాంస్కృతిక వర్గాల కవసరమయ్యే సేవలు

"గాలినీరును లేకున్న గడువవచ్చు
గ్రాసమును లేక ఎట్టెటో గడువవచ్చు
గడువ వచ్చునె ఒక్క ఘడియయైన
గ్రంథాలయములేని గ్రామమందు"

—నాళం కృష్ణారావు.

"జాతీయ వికాసమునకు, వ్యక్తి వికాసమునకు గ్రంథాలయములు అత్యంతోపయుక్తములు. అందుచే వాని అభివృద్ధి అధికముగా కావలసి యున్నది. గ్రంథాలయములు 'పఠనమందిరములై, విద్యాలయములై, వ్యాయామనిలయములై, కళాక్షేత్రాలై, సేవాసదనాలై, ధర్మరక్షణ సాధనాలై విరాజిల్లి జాతీయవికాసానికి మహత్తర సాధనాలు కావాలి".

— కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు.

"ఏ గ్రామములో అయితే గ్రంథాలయమున్నదో ఆ గ్రామము సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా, రాజకీయముగా సజీవముగా వున్నది అని చెప్పటానికి వీలుంది".

—వావిలాల గోపాలకృష్ణయ్య.

జాతి భవితవ్యాన్ని రూపొందించుకోవడానికి ఏర్పడిన సర్వ సమగ్ర విద్యాలయం, అన్ని తరగతుల ప్రజల విద్యావిషయకంగా,

సాంస్కృతికంగా ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి రూపొందింపబడిన ఒక సజీవ విద్యాలయం స్వావలంబన సాధనకై ఏర్పాటు చేయబడిన సేవా కేంద్రం".

— వెలగా వెంకటప్పయ్య.

ఈ గ్రంథాలయ ఉద్యమ కార్యకర్తల అభిప్రాయాలనుబట్టి గ్రంథాలయ మెంతటి శక్తివంతమైనదో, ఎంతటి ఉపయోగకరమైనదో ఊహించవచ్చును.

భారతదేశంలో గ్రంథాలయ ఉద్యమానికి అంకురార్పణ ఆంధ్ర దేశంలోనే జరిగింది. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమే తరువాత కాలంలో భాషా ఉద్యమానికి, స్వాతంత్ర్య ఉద్యమానికి, సంస్కరణ ఉద్యమానికి, వయోజన విద్యావ్యాప్తికి, రాజకీయ చైతన్యానికి కూడ దారి తీసినట్లు చరిత్రవల్ల తెలుస్తుంది.

ఆంధ్రదేశంలోనే తొలిసారిగా సంచార గ్రంథాలయాలు, రోగులకు, నేరస్తులకు, ప్రయాణీకులకు గ్రంథాలయాలు నిర్వహించబడ్డాయి. ఇంటింటా గ్రంథాలయం అనే నినాదం ప్రచారమైంది. గ్రంథాలయాలు విద్యావంతులకే కాకుండా నిరక్షరాస్యులకు సైతం ఉపయోగపడాలనే అభిప్రాయం గుర్తించటం జరిగింది.

ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపజేసే కార్యక్రమాలు గాక మానవతా ధర్మంతోపాటు మన హక్కులు, బాధ్యతలు, మన ఆచారాలు, మన నడవడికలను గురించి సాంఘిక - సాంస్కృతిక సేవల ద్వారా ప్రబోధించారు. ఎన్నో కళా రూపాలను (హరికథలు, బుర్రకథలు, తోలుబొమ్మలాటలు, నాటకాలు, నృత్యాలు, వీధినాటకాలు మొదలైనవి) ప్రదర్శించి ప్రజల్లో విజ్ఞానం, వినోదం, విద్యావికాసం కల్పించారు.

వివిధ సామాజిక కళారూపాలు, సాంస్కృతిక కార్యకలాపాలు అన్నీ కూడా పూర్వం రచ్చకట్టల మీదను, దేవాలయాల్లోను ప్రదర్శించ బడేవి. నేడివి పూర్తిగా మరుగుపడిపోయాయని చెప్పవచ్చును. ఆధునిక సమాజంలో ఈ కార్యకలాపాలకు రంగస్థలాలు, కళాక్షేత్రాలు అక్కడక్కడ ఏర్పాటవుతున్నా అవి నామమాత్రమే. గ్రంథాలయాలే వీటిని చేపట్టి నిర్వహించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

గ్రంథాలయాలకు సామాజిక సాంస్కృతిక కార్యకలాపాలతో ఉండే సంబంధం ఎలాంటిదో తెలుసుకుందాం.

విద్యార్థులకు, పరిశోధకులకు ఉపకరించేవి విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు. జనసామాన్యానికి తోడ్పడేవి పౌర గ్రంథాలయాలు. పౌర గ్రంథాలయాలు అందరికి అందుబాటులో ఉంటాయి. జాతి, మత, కుల, వర్గ, లింగ భేదాలు లేకుండ సర్వమానవాళికి, అలాగే గుడ్డి, చెవుడు, మూగవారికి కూడా ఈ గ్రంథాలయాలు తోడ్పడగలవన్న విషయం గుర్తుంచుకోవాలి. ఆలయమంటూనే మనకు దేవాలయం, చర్చి లేదా మసీదు జ్ఞాపకం వస్తుంది. అయితే మతపరంగా సంస్కృతిపరంగా ఇవి పాక్షికమైనవనే చెప్పాలి. కానీ జాతికంతటికీ భిన్నత్వంలో ఏకత్వాన్ని రూపొందించే సమైక్య జాతీయ దేవాలయాలు గ్రంథాలయాలే. విశేషమైన, వినూతనమైన విశ్వసందర్శనాన్ని అందించగల మహత్తర కేంద్రం గ్రంథాలయం.

భారతదేశాన్ని ఒక ఉపఖండంగా పేర్కొంటున్నాం. వివిధ మతాలు, వివిధ జాతులతో విస్తరించిన సమాజం మన దేశం. ప్రతిరాష్ట్రంలో ప్రతి ప్రాంతంలో, చివరికి, ప్రతి పల్లెపట్టులో ఈ భిన్నత్వం మనకు కనిపిస్తుంది. అయినా భారతజాతి ఒకే జాతిగా వ్యవహరించటానికి పురాణ కాలం నుండి నేటివరకు "సర్వేజనాః సుఖినోభవంతు" అనే ధ్యేయంతో

కలిసికట్టుగా జీవించే విధానాన్నే, సంస్కృతినే మన భారతజాతి అల వర్చుకుంది. ఈ సామాజిక వ్యవస్థలో గ్రంథాలయాలు ముఖ్య సేవా కేంద్రాలుగా వృద్ధిచెందేటట్లు వాటిని తీర్చిదిద్దవలసిన బాధ్యత గ్రంథా లయ కార్యకర్తలు, గ్రంథపాలకులపై ఉంది. గ్రంథాలయం ప్రజల విశ్వవిద్యాలయం. ప్రజల బాగోగులను గుర్తెరిగి, ప్రజల సంక్షేమానికి పాటుపడటం గ్రంథాలయాల ప్రథమ ధ్యేయంగా భావించాలి.

సాంఘిక, సాంస్కృతిక వర్గాలకవసరమయ్యే సేవలకు వెచ్చించే ద్రవ్యం వృధా అనుకుంటే అది అపచారమే. గ్రంథాలయ వ్యయం ఒక పెట్టుబడిగా భావించి తద్వారా సాధ్యమయ్యే, సాంఘిక, సాంస్కృతిక వికాసం తగిన ప్రయోజనంగా గుర్తించాలి.

సమాజంలో బాలలు, యువకులు, యువతులు, స్త్రీలు, పురుషులు, వికలాంగులు, బడుగువర్గాలు, అల్పసంఖ్య వర్గాలు అంటూ ఎన్నో రకాలుగా జనాన్ని వర్గీకరించవచ్చును.

శ్రేయో రాజ్యంలో పైన పేర్కొన్న వివిధ వర్గాలకు ప్రభుత్వమే కాకుండా వివిధ సాంఘిక సేవా సంస్థలు కూడా ఎన్నో సేవా కార్యక్రమా లను అమలుచేస్తుండటం మనకు తెలిసిన విషయమే. సాంఘిక సేవా సంస్థలనగానే లయన్స్ క్లబ్‌లు, రోటరీ క్లబ్‌లు, రామకృష్ణ మిషనులు, రెడ్‌క్రాసు, స్కౌట్, మొదలైనవిగా మనకు స్ఫురిస్తాయి. సాంస్కృతిక సంస్థలనగానే నాటక సమాజాలు, ఆధ్యాత్మిక సంస్థలు, సాహిత్యసంస్థలు, క్రీడా సంస్థలు, అకాడమీలు, సంగీతనాటక నృత్య పరిషత్‌లు, భజన మందిరాలు తదితరాలుగా ఊహిస్తాం.

సాంఘికంగా, సాంస్కృతికంగా సేవలు చేసే నిమిత్తం పై విధాల సంస్థలున్నప్పుడు గ్రంథాలయాల్లో సాంఘిక, సాంస్కృతిక

కార్యక్రమాలు, వివిధ వర్గాలకు చేయూత నివ్వవలసిన ఆగత్యమేమిటని కొందరు ప్రశ్నించవచ్చును.

మనం ఇంతకుముందే గ్రంథాలయాలు ప్రజల విశ్వవిద్యాలయాలని, సముద్రాన్ని పోలిన అపార రత్నగర్భ అని చెప్పుకున్నాం. "నదీనాం సాగరోగతిః" అన్నట్లుగాను, "All Roads lead to Rome" అన్నట్లుగాను పైన పేర్కొన్న సంస్థలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో గ్రంథాలయాలను ఆశ్రయించక తప్పదు.

గ్రంథాలయం పుస్తకాలు, పత్రికలేగాక వాటితోపాటు ఇతర డాక్యుమెంట్లు, మైక్రోకార్డులు, మైక్రోఫిష్‌లు, ఫిల్ములు, కంప్యూటర్ రికార్డులు, దూరదర్శనులు, దృశ్యశ్రవణ పఠన సామగ్రి—ఒకటేమిటి? మానవునికి విద్య,విజ్ఞానం, వినోదవికాసాలను అందించే యావత్తు ఆధునిక పఠన వస్తువులతో పొందుపరచబడిన చైతన్యమందిరమని చెప్పుకున్నాం గదా! ఇవన్నీ వివిధ ఉపయోక్తలకు అనువైనవికదా! ఈ రకాల పఠన సామగ్రిలేనిదే గ్రంథాలయాలు సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాలను చేపట్టటం సాధ్యంకాదు.

గ్రంథాలయాల్లో పుస్తకాలు, పత్రికలు, ఇతర పఠన సామగ్రి సద్వినియోగం కావటానికి, అందరికీ అందుబాటులో ఉండటానికి, గ్రంథాలయ పంచసూత్రాలను అమలు పరచటానికి గ్రంథాలయాలు తప్పని సరిగా వివిధ సాంఘిక, సాంస్కృతిక వర్గాలకవసరమయ్యే సేవలను అందిరచవలసి ఉంటుంది.

సామాజిక వర్గాలు సైతం తమ అవసరాలు, కార్య విధులు ఫలించటానికి గ్రంథాలయాలను ఆశ్రయించవలసి ఉందని కూడా ముందుగానే చెప్పుకున్నాం. ఈ విధంగా గ్రంథాలయం, సమాజం కూడా అన్యోన్య ఆశ్రయ ఆధారాలు అయినపుడే వాటి ఉద్దేశ్యాలు ఫలిస్తాయి.

రోటరీ క్లబ్‌లయినా, లయన్సు క్లబ్‌లయినా లేదా ఏ ఇతర సాంఘిక-సంస్థలయినా తాము చేపట్టిన సేవా కార్యక్రమాల గురించిన సమగ్ర విషయాలను తెలుసుకోవటానికి తగిన సాహిత్యం కోసం గ్రంథాలయాల మీద ఆధారపడక తప్పదు. ఆధునిక ప్రపంచంలో వివిధ రంగాల్లో, ముఖ్యంగా శాస్త్ర సాంకేతిక రంగాలల్లోను, ఇతర అభివృద్ధి కార్యక్రమాల్లోను వస్తున్న పరిణామాల అభివృద్ధిని తెలుసుకొని తదను గుణంగా వారి కార్యకలాపాలను రూపొందించుకోవటానికి అనునిత్యం వెలువడే పత్రికలు, తదితర ప్రచురణలు ఎంతో అవసరం. కనుక ఆయా కార్యక్రమాల మార్పునుబట్టి అందుకు అవసరమైన విషయాలను తెలుసుకోవటానికి గ్రంథాలయాలు సాహిత్యాన్ని పోగుచేసి తోడ్పడతాయి.

సాంస్కృతిక వర్గాలలో పేర్కొన్న ఆధ్యాత్మిక, పౌరాణిక, సాహిత్య, సంగీత, నృత్య, క్రీడా సంస్థలు, కళాసంస్థల కార్యకలాపాల కంతా సాహిత్యం, సమాచారం మూలాధారం. వారి వారికి సంబంధించిన వివిధ విషయాల్లో గ్రంథాలు, పత్రికలు మొదలైన వాటిని క్షుణ్ణంగా చదువుకోగలిగిననాడే వారి కార్యక్రమాలు కూడా మారుతున్న సమాజానికి తోడు కాగలవు. కనుక గ్రంథాలయాలు ఈ విధంగా ఆయా సాంస్కృతిక వర్గాలకవసరమైన సాహిత్యం, అంటే పుస్తకాలు, పత్రికలు మొదలైన వాటిని అందించటం ద్వారా సాంస్కృతిక సేవకు దోహదం చేస్తాయి.

వాఙ్మయ సేవలు పరోక్ష సాంస్కృతిక సేవలు మాత్రమే. అలా కాకుండా గ్రంథాలయాల్లో పరోక్షంగా కూడా సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలు చేపట్టవలసి ఉంది. సదస్సులు, సభలు, సమావేశాలు, హరికథలు, బుర్రకథలు, నాటకాలు, నృత్యప్రదర్శనలు, వీధి నాటకాలు, తోలు బొమ్మలాటలు, కవిసమ్మేళనాలు, అవధానాలు, ఫిల్ము ప్రదర్శనలు, రేడియో కార్యక్రమాలు, దూరదర్శన ప్రసారాలు,

పుస్తక ప్రదర్శనలు, సంగీత కచేరీలు మొదలైన వివిధ సాంస్కృతిక కార్యకలాపాలు నిత్యం ఎన్నో చోట్ల నిర్వహించబడుతున్నాయి. అవి బహిరంగ కార్యక్రమాలైనా ప్రజలు వాటిని తమవిగా భావించి వెళ్ళటానికి జంకటమో, లేదా ఉత్సాహ పడకపోవటమో జరుగుతుంది. కానీ సార్వజనీన గ్రంథాలయాలు ప్రజా విశ్వవిద్యాలయాలు గనుక ఈ కార్యక్రమాలను నిర్వహిస్తే ప్రజలు ఇందులో పాల్గొనటం, తిలకించటం, తమవిగా భావించి ఆదరించటం జరుగుతుంది. ఆ విధంగా సమాజంలో ప్రజలందరికి సాంస్కృతిక సేవలు లభ్యమవుతాయి. వినోదంతో బాటు విజ్ఞానం కూడా లభ్యమవుతుంది.

గ్రంథాలయాలు పుస్తక విభాగాలతో పాటు సాంస్కృతిక విభాగాలు కూడా ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకొని ఒక సమగ్రపథకాన్ని రూపొందించుకొని క్రమం తప్పకుండా సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాలి. నిత్యకల్యాణం పచ్చతోరణంగా సాంఘిక సాంస్కృతిక కారక్రమాలు చేపట్టితే గ్రంథాలయాలు చదువరులకే గాక నిరక్షరాస్యులకు సైతం సేవలందించగలవనటంలో సందేహం లేదు.

గ్రంథాలయం భూతల స్వర్గం అనటం అతిశయోక్తి కాదుగదా! ఈ లక్ష్యసాధనకు మనమందరమూ సమష్టిగా కృషిచేయటం అవసరం.

—(౦)—

ఎస్. సుదర్శన్‌రావు

# 4.4 సామాజిక, సాంస్కృతిక వర్గాలకు గ్రంథాలయ సేవలు

మానవ స్థావరాలన్నింటిని కలిపి స్థూలంగా సమాజమని చెప్ప వచ్చును. ఈ విధంగానే ఒకదేశం, రాష్ట్రం, నగరం, గ్రామం లేదా అంతకన్న చిన్న పల్లెల్లో నివసించే ప్రజలను ఆయా ప్రాంత సమా జాలుగా గుర్తించవచ్చును. ఉదాహరణకు భారతీయ సమాజం, తెలుగు సమాజం, గ్రామీణ సమాజం మొదలైనవి.

కులం, మతం, ప్రాంతం, వృత్తి మొదలైన ప్రాతిపదికల ఆధా రంగా ఒక దేశవాసులను వివిధ వర్గాలుగా నిర్ణయించవచ్చును. ఆర్థిక, రాజకీయ, ప్రాంతీయ, సాంస్కృతిక, సామాజిక వర్గాలు సమాజంలో ఈ విధంగా ఏర్పడినవే. ప్రతి వర్గంలో ప్రజలు ఒకే రకమైన సమస్యలద్వారా సన్నిహితులై "మేము" అనే భావంతో వ్యవహరిస్తారు. అయితే సాధారణంగా ప్రతి వ్యక్తి కూడా సమాజంలో ఒకే సమయంలో వివిధ వర్గాలకు చెంది ఉండవచ్చును.

## సాంఘిక, సాంస్కృతిక వర్గాల ఆవశ్యకత

మానవుడు సంఘజీవి. అందుచేత పుట్టుకనుండి జీవిత పర్యంతం సామూహిక జీవితం గడుపుతాడు. శాంతియుత సుఖజీవనం గడప టానికి సమాజంలో అన్ని వర్గాలు సమాజ శ్రేయస్సు కోసం కలిసి కట్టుగా కృషి చేయవలసి ఉంటుంది. అలా కానప్పుడు సమాజం పురోగమించదు.

## సంఘీకరణం

శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఇంతకుమును పెన్నడు లేనన్ని పరిశోధనలు జరవటం వల్లను, నగరీకరణ, పారిశ్రామికీకరణ, రవాణా మొదలైన రంగాల్లో వస్తున్న అభివృద్ధి కారణంగాను, ఒక దేశ ప్రజలు ఇతర దేశాల ప్రజలతో సులభంగా సంబంధాలు ఏర్పరచుకోగలగటం చేతను మానవుడి జీవనవిధానంలో, అలాగే సంస్కృతి, ఆచార వ్యవహారాల్లో, ప్రవర్తనలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఇవన్నీ సామాజిక విలువల్లో మార్పులు రావటానికి కారణమయ్యాయి. ఈ మార్పులను సమాజం అర్థం చేసుకొని స్వీకరించటంలోను లేదా సంఘీకరణం గావించటంలోను వర్గాల పాత్ర ఎంతైనా ఉందనటం వాస్తవం.

## వ్యక్తి మనో వికాసం

వ్యక్తుల మనో వికాసానికి, అలాగే వారి శక్తి సామర్థ్యాలు పెంపొందించటానికి సామాజిక వర్గాలు తోడ్పడతాయి.

## సాంఘిక భద్రత

మానవుడు తనకు కావలసిన భద్రతను, మానసిక సంతృప్తిని తను నివసించే సమాజం నుండే పొందుతాడు.

## జాతియ సమైక్యత

వివిధ మతాలు వివిధ బాషలు, భిన్న సంస్కృతులు ఉన్న మనదేశంలో జాతీయ సమైక్యత ఎంతో అవసరం. జాతీయ సమైక్యతా సాధనకు కూడ సామాజిక వర్గాలే దోహదం చేస్తాయి.

## పౌర సంబంధాలు

ప్రజాశ్రేయస్సుకోసం, సామాజిక సమస్యల పరిష్కారం కోసం చేపట్టిన పథకాలను. విధానాలను, ప్రభుత్వం వివిధ వర్గాల వారి కందిచ్చే,

ఆర్థిక తదితర సదుపాయాలను ప్రజలకు తెలియజేసి, సరియైన అవ గాహన నేర్పరచటంలోను, వారి ఆమోదాన్ని సంపాదించటంలోను వర్గాలు కీలక పాత్ర వహిస్తాయి.

## ప్రేరణ, సహాయ సహకారాలు

మానవుడు వృత్తిలోగాని, ఇతర కార్యకలాపాల్లో గాని తనకు కావలసిన ప్రేరణను, స్ఫూర్తిని, సహాయ సహకారాన్ని తోటి మానవుల నుండే పొందుతాడు. ఈ విధంగా సత్ప్రవర్తనను, హేతువాద దృక్ప థాన్ని అలవర్చుకోవటంలో కూడా ఒక మనిషికి సమాజమే సాయపడు తుంది.

## గ్రంథాలయ సేవలు

గ్రంథాలయాలు సేవాతత్పరతగల సామాజిక సంస్థలు కావటం చేత, వాటి పరిధికి వచ్చే అన్ని వర్గాల ప్రజలకు సేవలందించాలి. ప్రతి గ్రంథాలయం తన లక్ష్యాలకు అనుగుణంగా ప్రజలకు గ్రంథాలయ సేవలందించాలి. పౌరగ్రంథాలయాలు సహజంగా సమాజంలో అన్ని వర్గాల ప్రజలకు సేవలందించాల్సి ఉంటే, విద్యా సంస్థల కనుబంధంగా ఉండే గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు వాటి పరిధిలోకి వచ్చే నిర్దిష్ట వర్గాల ప్రజలకు మాత్రమే సేవలందిస్తాయి. గ్రంథాలయాలు సమాజమందలి ఈ కింది వర్గాల ప్రజలకు సేవలను అందించాలి.

## పిల్లలు

ముఖ్యంగా పౌరగ్రంథాలయాల్లో పిల్లల మనోవికాసానికి, సుమా జంపట్ల సదవగాహన ఏర్పడటానికి వీలుగా తగిన సాహిత్యాన్ని విధిగా సేకరించి అందించటం ఆవశ్యకం. పౌరగ్రంథాలయంలో పిల్లలకోసం ప్రత్యేకంగా కేటాయించబడిన విభాగాలుగాని లేదా కేవలం పిల్లల కోసమే

ఏర్పాటైన గ్రంథాలయాలు ఉన్నప్పుడే పిల్లలను పుస్తక పఠనంలో ఆసక్తులను చేయటం సాధ్యం. నేటి బాలలే రేపటి పౌరులన్న నానుడి దృష్ట్యా ముందు ముందు పిల్లలను సత్ప్రవర్తన, జ్ఞానం, నీతి, నియమం కలిగిన పౌరులుగా తీర్చిదిద్దుటలో గ్రంథాలయాలు కూడా తగిన పాత్ర వహించాలి.

## మహిళలు

మహిళాభ్యుదయం సమగ్ర సమాజాభివృద్ధితో ముడివడి ఉందనే విషయం నిర్వివాదం. మహిళల్లో చాలా మందికి గృహిణులుగా ప్రధాన బాధ్యత ఉండటంవల్ల బాహ్య ప్రపంచం గురించిన అవగాహన చాలా తక్కువ. తమ సంక్షేమం కోసం ప్రభుత్వం ఏర్పాటు చేసిన పథకాల సంగతి వారికి తెలియదు. అందుచేత వాటిని ఉపయోగించుకోలేక పోతున్నారు: స్త్రీల సంక్షేమం కోసం ప్రభుత్వం చేపట్టిన పథకాలను తెలియజేయటంలోను వాటిని సద్వినియోగపర్చటంలోను, స్త్రీలలో విజ్ఞానం, సమాజ అవగాహన విస్తరింపజేయటంలోను, విరామ సమయాల్లో కాలం వృథా చేయకుండా ఎంబ్రాయిడరీ, కుట్టుపనులు మొదలైన చేతిపనులను నేర్చుకొనే అవకాశాలు కల్పించటంలోను, ఆ విధంగా కుటుంబ సంక్షేమానికి, సమాజ శ్రేయస్సుకు కూడా గ్రంథాలయాలు దోహదం చేయాలి.

## వికలాంగులు

శారీరక, మానసిక వికలాంగుల సంక్షేమానికి కూడ సమాజం బాధ్యత వహించాలి. వికలాంగులు మానసికంగా మరింత కృంగిపోకుండ సమాజం వారికి ప్రోత్సాహం, సహకారం అందించాలి. ప్రభుత్వం చేకూర్చే సహాయ సహకారాలను వారికి తెలియజేయటమే కాకుండా గ్రంథాలయాలు ప్రత్యేకమైన సదుపాయాలు, సేవలు ఏర్పాటు

చేయాలి. ముఖ్యంగా అంధులకు బ్రెయిలీ పుస్తకాలు అందించాలి. మానసిక రుగ్మతకు, ఇతర దౌర్బల్యాలకు గురైన వారికి కూడా వారి వారి స్థలాల్లోనే పుస్తక సేవలు ఉండాలి.

## వయోజనులు

విద్యకు నోచుకోని వయోజనులందరిని విద్యావంతులుగా చేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. అందుకు అనుగుణంగా గ్రంథాలయాలు వయోజన విద్యా కేంద్రాలను నడిపి సమాజంలో నిరక్షరాస్యతను రూపుమాపటానికి కృషిచేయాలి.

## వృద్ధులు

వృద్ధులకు వారి సంక్షేమ సంబంధమైన సదుపాయాలు, ఉద్యోగ విరమణ చేసినవారికి విరమణ వేతనం (Pension) తదితర సహాయాల సమాచారాలు గ్రంథాలయాలు అందించవచ్చును. విరామ సమయం సద్వినియోగం కావటానికి కూడా గ్రంథాలయాలు తగిన ఆస్కారం కల్పించవచ్చును.

## విద్యార్థులు

విద్యార్థులకు వారికి కావలసిన పాఠ్య గ్రంథాలను, ఆచూకీ గ్రంథాలను అందించాలి. ఆయా విద్యార్థుల స్థాయికి, అవసరాలకు సరిపడే పుస్తక సంకలనాన్ని కూడా సేకరించాలి.

## పరిశోధకులు

పరిశోధకులకు సాధారణంగా పుస్తకాలే కాకుండా సమాచార సేవలను కూడా చేయవల్సి ఉంటుంది. పరిశోధకులకు కావలసిన పాశ్చాత్య భాషల్లో సాహిత్యానికి అనువాదాలు, పుస్తక భాగాలకు, పత్రికా వ్యాసాలకు ప్రతులను అందించాలి. వారికి అవసరమయ్యే గ్రంథసూచీలను కూడ తయారుచేసి అందించాలి.

## వృత్తి వర్గాలు

డాక్టర్లు, ఇంజనీర్లు, ఉపాధ్యాయులు, తదితర వృత్తులవారికి వారి వారి నిత్యజీవితంలో ఎదురయ్యే సమస్యలకు సంబంధించిన సమాచారాలను కూడా అందించాలి.

## గ్రామీణ ప్రజలు, వెనుకబడిన వర్గాలు

గ్రామీణ ప్రజలను, వెనుకబడిన వర్గాల వారిని విజ్ఞానవంతులు గాను, చైతన్యవంతులుగాను తీర్చిదిద్దటంలో గ్రంథాలయాలు ఈ ప్రజల అభివృద్ధి కోసం కావలసిన సమాచారాలను, సలహాలను అందించాలి.

## నిరుద్యోగులు

నిరుద్యోగ కారణంగా విసిగిన ప్రజలు సమాజంలో అశాంతి, కల్లోలాలు లేపకుండ వారి కాలాన్ని సద్వినియోగపర్చుకోవటానికి గ్రంథాలయ పాత్ర ఎంతైనా ముఖ్యం. నిరుద్యోగుల కోసం ఉద్యోగ ప్రకటనలను సేకరించటమే గాక వారి వారి శక్తిసామర్థ్యాలకు, అభిరుచులకు తగిన స్వయం ఉపాధి పథకాలను ఉపయోగించుకోవటానికి కూడా సహాయపడాలి.

## సాంస్కృతిక వర్గాలు

సమాజమందలి కళాకారులకు, సాంస్కృతిక వర్గాలకు సరిపడే పుస్తకాలు, నాటకాలు, నాటికలు, నృత్య సంగీతరచనలు, వారి సమావేశాలకు వీలుగా ప్రాంగణ సదుపాయాలు కల్పించి ప్రోత్సాహం అందించవలసి ఉంటుంది. ఈ విధంగా సమాజంలో వివిధ వర్గాల అవసరాలను గుర్తించి వారికి అవసరమయ్యే సమాచారం, సదుపాయాలు చేకూర్చటంవల్ల గ్రంథాలయం సమాజంలో అత్యున్నతమైన సాంస్కృతిక కేంద్రంగా రూపుదిద్దుకోగలదు.

## విస్తరణ కార్యకలాపాలు

గ్రంథాలయాలకు సేవా పరిమితి వాస్తవంగానే లేదు. వాఙ్మయ సేవలకు మించి సామాజిక జీవనానికి అవసరం, అనుకూలం అయిన ప్రతి కార్యకలాపంలో కూడా గ్రంథాలయానికి (ముఖ్యంగా పౌరగ్రంథాలయానికి) ప్రత్యేక స్థానమంటూ ఉండటం సహేతుకం. అందుచేతనే, అభివృద్ధిచెందిన దేశాల్లో గ్రంథాలయాలు కేవలం పుస్తక సంకలనాలకే పరిమితం కాకుండ దృశ్య - శ్రవ్యాలు తదితర వస్తుసామగ్రిని సేకరించి సాంస్కృతిక పరమైన విస్తృత కార్యకలాపాలను విస్తరణ సేవల ద్వారా చేపట్టటం జరుగుతున్నది. ఈ విస్తరణ కార్యకలాపాల్లో ఇది, అది అని కాకుండ సందర్భోచితమైన సేవలకు రూపకల్పన చేయవచ్చును. ఉదాహరణకు డాక్యుమెంటరీ ఫిల్ములను ప్రదర్శించటం, ఆహార, ఆరోగ్య విషయాల గురించిన ప్రసంగాలు, ప్రదర్శనలు, ఏర్పాటుచేయటం, పిల్లలకు వ్యాయామ క్రీడలందు, సాహిత్య కళలందు ప్రోత్సాహాన్ని కల్పించే కార్యకలాపాలను నిర్వహించటం, పుస్తక పఠనం, సమీక్ష, వక్తృత్వపు పోటీలు, సమస్యాపూరణం, ప్రశ్నోత్తర పోటీలు, మొదలైన వాటిని కూడా ఏర్పాటు చేయవచ్చును.

## ఉపసంహారం

అభివృద్ధి చెందుతున్న మనవంటి ప్రజాస్వామ్య, సంక్షేమ దేశంలో అన్ని వర్గాల ప్రజల్లో జ్ఞానశీలతను, హేతువాద దృక్పథాన్ని పెంపొందించటంలో గ్రంథాలయాలు, ముఖ్యంగా పౌర గ్రంథాలయాలు చేయతగు సేవలు చాలా ముఖ్యమైనవి

—(o)—

ఆళ్ళ రాఘవయ్య

# 4.5 అందరికీ గ్రంథాలయ సేవ

ఒకప్పుడు గ్రంథపఠనం అందరికీ సులభతరంగా ఉండేదికాదు. అచ్చొత్తించిన పుస్తకాలు కూడ స్వల్పంగానే ఉండేవి. పరిపాలకులు లేదా శ్రీమంతులు మాత్రమే దొరికినంతవరకు గ్రంథ సంచయాన్ని సేకరించి స్వంత గ్రంథాలయాలు ఏర్పాటు చేసుకునేవారు. కాలక్రమేణా అచ్చు యంత్రంతోపాటు త్వరితగతిని పుస్తకాలను ముద్రించే యంత్రపరికరాలు రావటం జరిగింది. ప్రస్తుతం పుస్తకాల ముద్రణ పుంఖానుపుంఖంగా జరుగుతూ ఉంది. శరవేగంతో వివిధ పత్రికల ముద్రణ కూడ జరుగుతున్నది.

స్వాతంత్ర్యం తర్వాత దేశ వ్యాప్తంగా విశ్వవిద్యాలయాల సంఖ్య పెరిగింది. కళాశాలలు పెద్ద సంఖ్యలో వెలిశాయి. గణనీయమైన సంఖ్యలో ఉన్నత పాఠశాలల స్థాపన జరిగింది. గ్రంథాలయాల ఆవశ్యకత గుర్తించబడింది. యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ విశ్వవిద్యాలయాల్లో గ్రంథాలయాల అభివృద్ధికి ఇతోధికంగా ప్రోత్సాహం కలుగజేసింది. గ్రంథాలయ శాసనం ద్వారా పౌరగ్రంథాలయాలు వెలుగులోకి వచ్చి సేవలు చేస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో 1960 సంవత్సరంలో ప్రత్యేక గ్రంథాలయ శాఖ ఏర్పాటుకు అంకురార్పణ జరిగింది.

ఒక గ్రంథాలయాన్నిబట్టి అది అందించే సేవ ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు. విశ్వవిద్యాలయ గ్రంథాలయం వివిధ శాఖల అధ్యాపకులకు, విద్యార్థులకు సేవలనందించగలదు. అదే విధంగా కళాశాల

గ్రంథాలయాలు, ఉన్నత పాఠశాలల గ్రంథాలయాలు కేవలం విద్యార్థులకు, అధ్యాపకులకు మాత్రమే ఉపకరిస్తున్నవి. నేటికినీ ఉన్నత పాఠశాలల్లో సుశిక్షితులైన సిబ్బంది కొరత కారణంగా గ్రంథా-యాల నిర్వహణ అంతంత మాత్రంగానే ఉంటున్నది.

కానీ, పౌర గ్రంథాలయం పరిధి విస్తృతమైనదని చెప్పక తప్పదు. అది అన్ని వర్గాలకు సేవచేసే ప్రజాస్వామ్య సంస్థ. అందుకే పౌర గ్రంథాలయం ప్రజల విశ్వవిద్యాలయంగా అభివర్ణింపబడింది. సాంస్కృతిక కేంద్రంగా, విజ్ఞాన దేవాలయంగా గుర్తింపబడింది. సమాచార సేవ చేస్తూ ప్రజల్లో ఆలోచనాశక్తిని పెంపొందించి చైతన్య ప్రేరణకు దోహదం చేస్తున్నది. ప్రముఖంగా సాంఘిక, రాజకీయ పరిణామాలను ప్రభావితం చేయగల మహత్తరశక్తి పౌరగ్రంథాలయాలకున్నది. సి. బి. హేవుల్ మహాశయుడు చెప్పినట్లు ప్రపంచ సంస్కృతి సమస్తం గ్రంథాలయాల్లో ఉందనిచెప్పటం అతిశయోక్తికాదు. విభిన్న విషయ పరంపరలకు సంబంధించిన సాహిత్యం కలిగి ఉండి కుల, మత, వర్గభేదం లేకుండా అందరికీ సమానంగా సేవచేసే ప్రజాస్వామ్య సంస్థలుగా పౌరగ్రంథాలయాలు విశిష్ట స్థానాన్ని చేకూర్చుకున్నాయి. అందువల్లే పౌరగ్రంథాలయాన్ని గురించి—"Public library is considered an essential part of modern society and plays a very important role in the Community. It should be regarded as a social force which can greatly influence the society being served. It can help in safeguarding democracy, creating political awakening, bringing social awareness and fostering creative leisure activities" అని ఒక ఆంగ్లవ్యాసకర్త అభిభాషించటం సహేతుకం అనిపిస్తుంది.

పౌర గ్రంథాలయం విద్యార్థులకు, అధ్యాపకులకు, పరిశోధన సాగించే పండితులకు, వ్యాపారులకు, విద్యావేత్తలకు, విభిన్న వృత్తులవారికి మహిళలకు, పదవీ విరమణచేసిన ఉద్యోగులకు, కొత్తగా అక్షరాస్యులైన వ్యక్తులకు సేవలనందింప గలుగుతున్నది. సమాచారం, విద్య, వినోదం పాఠకుల కందిస్తూ ఉత్తేజితులను చేస్తున్నది. పౌర గ్రంథాలయం నిరక్షరాస్యులకు సయితం విద్య గరుపుతూ విరాజిల్లవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో చాలమంది గ్రంథాలయాలను స్వయంశక్తి పెంపొందించుకోవటానికి ఉపయోగించుకుంటున్నారు.

వ్యాపారులు తమ వ్యాపారం వృద్ధిచేసుకోవటానికి గ్రంథాలయం తోడ్పడవచ్చు. ఉత్పత్తి పెంచుకోవటానికి రైతులకు సమాచార సేవ చేయవచ్చు. పిల్లల్లో పఠనాసక్తిని పెంపొందించవచ్చు. అన్నివయస్సుల్లో ఉన్నవ్యక్తులకు సేవ చేయవచ్చు. విద్యార్థులకు పాఠ్యగ్రంథాలు అందించవచ్చు. స్థానికంగా ఉన్న పరిశ్రమలకు సంబంధించిన సమాచారాన్ని అందించవచ్చు. నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు తెలిపే పత్రికలను తెప్పిస్తూ ఉపయోగపడవచ్చు. వికలాంగులకు, అంధులకు, వృద్ధులకు ప్రత్యేక సేవలందించవచ్చు. అంధులకుపకరించే బ్రెయిలీ సాహిత్యం (Books in Braille), కనీసం జిల్లా కేంద్రాల్లోని గ్రంథాలయాలు కలిగి ఉంటటం ఉపయోగంగా ఉంటుంది. అభివృద్ధి చెందిన దేశాల్లో అస్వస్థులైనవారికి సయితం ప్రత్యేక సేవలు అందిస్తున్నాయి.

పెదపాలెం సేవాశ్రమంవారు (తెనాలి తాలూకా) ఒకప్పుడు బోటు ప్రయాణీకులకు పుస్తకాలనందించి సేవచేశారన్న చారిత్రక సత్యం ఆంధ్రులకు గర్వకారణం. ఆస్పత్రులలో రోగులకు, జైళ్ళలో ఖైదీలకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం వారి కొన్ని జిల్లా శాఖలు పుస్తకాలు, పత్రికలను అందించి సేవ చేశాయి.

అచ్చు యంత్రాలు రాకపూర్వం అనేక విషయాలపై రాసిన అమూల్యమైన రాత ప్రతులు సంస్కృతం, తెలుగు తదితర భాషల్లో పెద్ద సంఖ్యల్లో ఉన్నాయి. భారతీయ సాహిత్యంలో ఎన్నో మేలిరత్నాలు ఇప్పటికీ అముద్రితంగానే ఉండిపోయాయి. తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో తెలుగు రాత ప్రతులు మదరాసు నుండి తరలించబడి భద్రపరచబడినవి. అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషల్లో రాతప్రతులు హైదరాబాదులో ఉన్న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంలో 17,500 ఉన్నాయి. ఇవికాక తంజావూరులో అమ్యూల్యమైన రాత ప్రతులు ఎన్నో ఉన్నాయి.

ప్రస్తుతం పరిశోధకులు, పండితులు రాత ప్రతులను వినియోగించు కోవటానికి వ్యయ ప్రయాసలు పడి దూరప్రాంతం పోవలసి వస్తున్నది. ఇది అందరికీ సాధ్యం కానివని. అందువల్ల రాతప్రతులకు జిరాక్స్‌కాపీలు తీయించి జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు, ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాలకు సరఫరా చేస్తే పరిశోధనాసక్తిగల వారికి సేవలు చేయ వచ్చును

పై వివరించిన సేవలతో పాటు గ్రంథాలయం పాఠకులకు సలహా లివ్వటం (Reader's Advisory Service), ఆచూకీ సేవ చేయటం వివిధ విషయంశాలపై జాబితాలు (Bibliographies) తయారు చేసి అందించటం గ్రంథాలయం నిర్వహించే కార్యక్రమాల్లో భాగం కావాలి. గ్రంథాలయం ఉనికిని, అది అందించే సేవలను ప్రచారం చేయటానికి మరికొన్ని విస్తరణ కార్యక్రమాలు ఉన్నాయి. రీడింగ్ సర్కిల్స్ ఏర్పాటు చేయటం, స్థానికులు కోరినప్పుడు సమావేశాల ఏర్పాటుకు వీలు కలి గించటం, ఉపన్యాసాలిప్పించటం, నాటక ప్రదర్శనలు, 'పప్పెట్ షో'లు ఏర్పాటు చేయుట్టం, నిరక్షరాస్యులకు ఆసక్తికరమైన విషయాలను పుస్తకాలు,

పత్రికలనుండి చదివి విన్పించటం, పిల్లలకు కథలు చెప్పటం తదితర కార్యక్రమాలు విస్తరణ సేవలో భాగంగా పేర్కొనవచ్చు.

భారతదేశంలో నిరక్షరాస్యులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. 63.83 శాతం నిరక్ష రాస్యులే: అంటే అక్షరాస్యుల సగటు శాతం 1981లో జనాభా లెక్కలు చేసినప్పుడు 36.17గా ఉంది. ఇక ఆంధ్ర ప్రదేశ్‌లో అక్షరాస్యుల శాతం అఖిలభారత సగటుకన్న తక్కువే: 29.49 శాతం మాత్రమే.

అక్టోబరు విప్లవం సమయంలో సోవియట్ రష్యాలో నిరక్ష రాస్యులు అధికంగా ఉండేవారు. నిరక్షరాస్యత నిర్మూలనకు లెనిన్ 26 డిశంబర్ 1919 వ తేదీన ఒక 'డిక్రీ' జారీ చేయటం జరిగింది. 8 సంవత్సరాలనుండి 50 సంవత్సరాల వయసుగల నిరక్షరాస్యులైన ప్రతి ఒక్కరు చదవటం, రాయటం నేర్చుకోవటం నిర్బంధం చేయబడింది. నిరక్షరాస్యత నిర్మూలనకు 1920 లో లెనిన్ స్టేట్ కమీషన్ నియమించి విద్యా కేంద్రాలస్థాపనకు చర్యలు గైకొనటం గమనార్హం. యుద్ధ ప్రాతి పాదికపై కార్యక్రమాన్ని అమలు జరిపి నిరక్షరాస్యతను అనతి కాలంలో తొలగింపజేయటం జరిగింది. చిన్న దేశమైన క్యూబా 1959 విప్లవ సమయంలో అక్షరాస్యుల శాతం 42 ఉండగా 1964 నాటికి (ఐదు సంవత్సరాల్లో) గ్రంథాలయాల ద్వారా నూరుశాతానికి పెంచుకోగలిగింది.

పౌర గ్రంథాలయశాఖవారు ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యుల సంఖ్యను త్వరితంగా పెంచటానికి, నిరక్షరాస్యతను పూర్తిగా తొలగించ టానికి కార్యక్రమాలు చేపట్టేలా రాష్ట్ర ప్రభుత్వం చూడటం అవసరం. ఇందుకు కేంద్ర ప్రభుత్వం కూడా జాతీయ గ్రంథాలయ విధానాన్ని (Nitional L brary Policy) తగు విధంగా రూపొందించి దేశ వ్యాప్తంగా పౌర గ్రంథాలయాలు వయోజన విద్యా కేంద్రాలుగా పని

చేయటానికి కావలసిన ఆర్థిక సహాయం అందించాలి. పాఠశాలల్లో మధ్యలో చదువు మానేసిన పిల్లలకు, క్రొత్తగా అక్షరాస్యులైన వారికి, నిరక్షరాస్యులకు విద్య గరపటంలో గ్రంథాలయాలకు ప్రముఖ పాత్ర వహించగల శక్తి ఉంది. విజ్ఞులు, అనుభవజ్ఞులైన విద్యావేత్తలు "Anti-illiterary Compaign should be considered a concomitant of free Public Library Service" అన్న సత్యాన్ని అంగీకరిస్తున్నారు.

చదువుకున్నవారితోపాటు ముఖ్యంగా చదువురాని వారికి రేడియో, టెలివిజన్ కార్యక్రమాలు ఎంతైనా ఉపయోగపడగలవు. గ్రంథాలయాల్లో వీటిని ఏర్పాటు చేయటం అవసరం. టెలివిజన్ కేవలం భాగ్యవంతుల భోగవస్తువుకాదు. విద్య, విజ్ఞానాలను టెలివిజన్ అందజేస్తుంది. వ్యవసాయ దారులకు ఋతుపవనాల గురించి, వ్యవసాయంలో వాడుకలో ఉన్న అధునాతన పరికరాల గురించి ఎంతో సమాచారం అందజేస్తున్నది. సినీ సంగీత కార్యక్రమాలను చూపిస్తున్నది నాట్య నాటక ప్రదర్శనలు, పిల్లల కార్యక్రమాలు, జాతీయ అంతర్జాతీయ ఆటలపోటీలను ప్రదర్శిస్తున్నది. యువకులు టెలివిజన్ కార్యక్రమాలు చూడటానికి ఎంతో ఉత్సాహ పడుతున్నారు.

అనుభవజ్ఞుడైన ఒక గ్రంథపాలకుడు గ్రంథాలయాల గురించి ఇలా చెప్పటం జరిగింది.

"As democratic institutions they have to render multidimensional and multi directional services to their clienteles both qualitatively and quantitatively".

అందువల్ల పౌరగ్రంథాలయ సేవలను ఆధునికంగా సమాజంలో అందరికి ఉపయోగపడే విధంగా రూపొందించటం అవసరం.

—(౦)—

Syed Ali Hashmi

## 4.6 COMMUNITY SERVICES OF PUBLIC LIBRARIES

It was a Sarpanch of a Gram Panchayat in Medak district who demanded a public library in his village for the simple reason that the educated youth was taking to drinking and gambling in the absence of other useful avocations. He considered that a public library would keep them free from these evils. His contention was correct. His demand was just. Yet he could not get a library opened by the Zilla Grandhalaya Samstha because there were 500 other villages waiting in the queues. While Government's scheme to open one school in every village is well under way similar provision of public library has reached so far the Mandal headquarters only. But the question is whether these Mandal libraries (designated as Telugu Vignana Samachara Kendras) have actually affected the community life in any way? The answer is "No". The next question is whether these Mandal libraries are useful to the community in any way ? The answer this time is "Yes". Only their role has not been yet properly identified. Their potential services to the community have not been planned. The result is that public libraries are totally isolated from the Community Development Programmes of the Government. The topic chosen by the Telugu University is significant in the context of opening of Telugu Vignana Samachara Kendras

in the State on mass scale. There is need to highlight the community services of the Kendras.

The importance of public libraries in urban areas is an established fact. Overcrowding of urban public libraries is proof enough of their indispensability to the urban community. It is the rural public library that remains under-utilised. It is this library that requires to assess its importance in terms of its services to the community it is supposed to serve. This paper therefore confines its scope to the community services of the rural public libraries with special reference to the Telugu Vignana Samachara Kendras opened at Mandal headquarters in our state.

## CHILDREN'S LIBRARY SERVICES

Instead of waiting until children grow up as adults, our policy should be to catch them young. People who cultivate the habit of library going in their childhood do not give up reading for the rest of their life. It is observed that inspite of the efforts of the educationists to enrol children of 5-11 years of age, the drop-out rate being high actually defeat their plans. The enforcement of Compulsory Education Act could not bring even one fourth of this age group to the class room. Those who are enrolled do not continue. What bothers the educationists more is not the low enrolment but the high dropout rate. How do they check it ? Incentives are being offered one after the other first the mid-day meal, then the school uniform and then free text books. Still, the students continue to drop out. It shows

that a great majority of children lack interest in education. How do we create interest for reading among children ? is a million doller question. Educationists have considered all other means. Yet, the role of public libraries in continuing-education has not been recognised. Library authorities have also missed the point that primary school children make their potential readers. Classes conducted in the public library during leisure hours will bring children in close contact with the library of the village. Children's literature (like illustrated story books, magazines, comics, audios, videos, etc.) will surely attract them to public library. Enrolment drive on the part of librarian will make them habitual library goers. Library goers cannot be the school dropouts. The public library will be doing a great service to the community in this respect.

## SERVICES TO ADULTS

The failure in the implementation of compulsory Education Act and the consequent high dropout rate, particularly at the primary school level, has necessitated adult education programmes to continue permanently.

The literacy rate has, no doubt, increased. But the number of illiterates is also growing, Census figures show that the illiterates are multiplying. The World Bank estimates indicate that the illiterate adults in India may outnumber the entire population of the U.S.A. by the end of the present century. This is, inspite of the enormous amount of money invested on formal education as well as on adult

education. The Human Resources Development Minister, Mr. P.V. Narsimha Rao, recently announced earmarking of Rs. 550 crores to the National Literacy Mission which is launched to gradually eradicate illiteracy. The programme includes various projects. But public libraries are missing, as usual, from this scheme. The educationists are lamenting over the dropout rate at the primary school level. But this situation is not peculiar to primary schools alone. The problem is more acute with the adult learners. Adult neo-literates are prone to lapsing into illiteracy if care is not taken to provide follow-up, i.e., continuing education facilities. It is here the public libraries come into picture. They are the institutions of continuing education. Introduction of the adult neo-literates to the library world will open new vistas of education for them. Adult education efforts not supplemented by pulic library services are sure to fall. Public libraries prevent adult neo-literates from lapsing into illiteracy. They can help neo-literates, both the young and the old, by providing large print books, books on basic education and books on functional literacy.

## SERVICES TO THE HANDICAPPED

Care of the handicapped is a collective responsibility of the community. Public libraries are havens for the physically handicapped. Reading provides them pastime. Braille books help the blind. Home bound services can be arranged for the handicapped. The sick, the infirm and the old can also avail library services.

## EMPLOYMENT INFORMATION

Long queues at employment agencies indicate that Indian community is in the grip of unemployment. Educational institutions are adding to this problem by turning over more graduates every year. Delinking of degrees from job is under consideration of the Government. But Public Service Commissions and other employers have virtually ignored the university degrees. They have their own ways of evaluation through competetive examinations. Our schools and colleges have no placement centres. They provide no career guidance. Text book-knowledge hardly helps the students find jobs. Employers demand right persons for the right job. Here again the public library comes to their rescue. Reading rooms in urban public libraries are thronged by jobseekers who scan newspaper advertisements. Question papers of tests conducted by Public Service Commissions collected and served in public libraries help candidates prepare for the tests. Books and periodicals carrying question banks help them write these examinations. Books on career guidance provide means for finding jobs matching their qualifications and their interests. Public libraries can also be identified as proper agencies to provide employment news and guidance.

## COOPERATION WITH COMMUNITY AGENCIES

The Public Library is part of the community. It cannot remain isolated. It has the capacity to become the hub of the community-activities in concert with other social agencies. Brochures of social service

centres, village industries centres, Voluntary agencies like Lions Clubs, Rotary Clubs, Women Welfare Centres, information on agricultural markets, time tables of R. T. C. buses and railways and telephone directories, etc., kept in the library, will turn libraries into virtual information centres. Compilation of directories of health care centres, veterinary hospitals, residential schools, harijan hostels, backward class hostels in the Mandal area will provide a mine of information to the people. The information department should take the lead for compiling the directory of M.L.As., M.Ps., Z.P.P. chairmen and members, Mandal presidents, doctors, lawers, etc., in the district and keep a copy in each Mandal library. The contribution of the information department is now limited to keeping a few charts in certain Telugu Samachara Kendras giving statistics of the Mandal. Incidentally, public libraries find no place in these charts. The statistics department headed by the chief planning officer in the district publishes district plans. A copy of this plan kept in each branch library at the Mandal headquarters will be a source of information to the people.

## AUDIO VISUAL AIDS

A public library cannot be recognised as a community centre unless it reaches out the illiterates and the unlettered. Mandals, as a matter of fact, are not viable units for public libraries in terms of literate population. The Andhra Pradesh Public Libraries Rules, 1961 provide for opening of a branch library of the Zilla Grandhalaya Samstha at a place

where the population is 5,000 and above. Most of the Mandals in Telangana area do not satisfy this requirement. The State Government has of course taken a bold step in spreading library movement by sanctioning a branch library at each Mandal headquarters. Moreover when Mandal is the unit for every other department, the Department of Public Libraries cannot be given a different treatment.

The problem of low rate of reading and use has to be tackled. The library should employ audio-visual aids to attract the non-users as well as the unlettered. Radio programmes properly notified will be certainly attended by large groups of audience. Similarly television programmes monitored well also will attract men and women. Video programmes (showing educational and informative films) will likewise, prove effective among people.

## IMPACT OF THE MODERN TECHNOLOGY

Unlike western countries where there is little difference between rural and urban areas, so far as availability of basic amenities is concerned, the Indian villages and cities differ widely in this respect. Communication facilities can bridge this gap. Extension of T.V. to remote rural areas has helped news reach faster. Doordarshan now keeps the illiterate population also informed of the world events. India has made remarkable progress in the field of electronics. Government of India has been generous in extending T.V. to rural areas in the first phase itself. Let computerisation also reach rural areas. The Department of Informatics has already launched the

programme of establishing computer centres at the district headquarters. Soon this facility is bound to reach rural areas. Let libraries be covered by computerisation simultaneously. Computerisation will immensely improve community services of public libraries.

Lastly, public libraries are potential service centres for the people. There is need to recognise public library development as part of the community development programmes of the Union and the State Governments. The list of library services to the community is long. Library service to the prisons, the hospitals, the schools, the tribals, the minorities, etc., are some of the services the public library can render. But all these services depend on the availability of adequate funds and employment of competent staff. This is possible only when they are covered by both the Central and the State Government schemes.

V. Viswamohan

## 4.7 COMMUNITY SERVICES AND THE TELUGU UNIVERSITY LIBRARY

The word community is a relative term. The dictionary meaning of community is "a social group whose members live in a specific locality, share government, and have a common heritage". Irrespective of the factors such as living in a specific locality, etc., social groups are divided on the basis of other characteristics also such as caste, creed, race, profession, etc. Libraries are social institutions which serve the society in general and specific communities of the society in particular. Thus, every library serves its own user community or the sections of the community.

### LIBRARY COMMUNITY SERVICES

Community services in libraries is a very broad concept. Surprisingly important reference tools, such as, the ALA Glossary, Harrod's Glossary and Encyclopedia of Library and Information Science have not made any mention of Library Community Services.

However, community services in Library could be taken for any services rendered by the library for the benefit of its community of users. Thus the library community services cover the whole gamut of services rendered by the libraries.

Ever since their inception libraries have been rendering a remarkable service by providing recorded

knowledge to those seeking knowledge besides conserving and preserving knowledge for posterity. These are the primary and conventional services rendered by libraries.

It was early as 1876, that the father of the American library reference process, Samuel Green, instituted the first formal reference service at the Worcester Public Liberary in Massachusetts emphasizing the importance of personal aid to people requesting information. In order to gain library support from the community and justify the expense of public finance on libraries, there is a necessity of rendering productive services to the community. Reference and information services are more personalized services.

The personal aid gave rise to rendering of personalised services in libraries to its user communities. So, the neo-conventional services ranged from instruction (al) (service) in the use of library catalogue, reference works etc., to indexing, abstracting, reprographic and inter-library loan etc., services.

In tune with the changing social and technological environment, the nature of library services and the concept of libraries are also changing. There is a lot of emphasis on information services rather than on conventional library services. As stated by Alvin Toffler, "Information plays a crucial role in the future society". The present society is called the "Information Society" and the age, the "information age". Information is recognized as one of

the economic products. Therefore, information service is the prime job of the modern libraries. With this backdrop it is clear that the totality of community services presently rendered in libraries are :

1. Provision of recorded knowledge for research, educational, recreational and other needs ;
2. Provision of general/specific or special information (i.e., reference/ready reference service);
3. Guidance services (in the use of library catalogue, reference material, bibliographies, etc.) ;
4. Reader advisory services (in selection of documents, etc.);
5. Compilation of bibliographies ;
6. Indexing and abstracting services ;
7. Inter-library loan services ;
8. Reprographic services ;
9. Current Awareness Services ;
10. Selective Dissemination of Information (SDI Service) ;
11. Translation Services ;
12. Extension services (such as, adult education, organising meetings, lectures, film shows, etc.) ;
13. Community Information Services, etc.

Out of the above mentioned services the nature and number of services rendered would differ from

library to library depending on type and objectives of the library.

In a modern university library almost all the above mentioned services are necessary to boost up its image and justify its existence. University library is a complex system. It has to support teaching and learning activity in the university, support research activity and provide information for self-reliance and self determination among the students in which tailor-made community information services may be very essential.

## TELUGU UNIVERSITY LIBRARY COMMUNITY SERVICES

University library user community constitutes primarily research scholars, students and teachers. These three groups of users need different types of Library services.

## SERVICES TO THE STUDENTS

In a majority of cases, students come from different social and economic backgrounds, not well acquainted with library use and services. For such students orientation in the use of library catalogue and other material is essential. This may be no exception also to the students of Telugu University. The library staff should extend their help in the selection of the materials by the students.

The library has no doubt built up a comprehensive collection to meet the needs of its users. Still

there is no gain saying that it may frequently find it difficult to answer the requests of its clientele. No collection, however big, can be adequate and self sufficient.

Inter-library lending and borrowing along can offset these short comings. This presupposes the creation of bibliographic tools of co-operation such as union catalogues and also necessary plans for the purpose inplemented, among similar libraries with useful Telugu collections.

The favoured language of the library is obviously Telugu. However, this does not mean that the library's major collection consists of books in Telugu only. There will certainly be books in English as well as other Indian and foreign languages. Not only books and periodicals but other forms also need to be acquired in many languages as far as they relate to the acquisition policy. To overcome the language barrier the library needs to plan translation services also as part of its overall programme.

## SERVICES TO TEACHERS AND RESEARCHERS

Much is talked about indexing and abstracting services these days. Current Awareness and SDI Services, etc., in the university libraries exist for name sake and do not cater even to the basic reference needs. Telugu University Library, therefore, may set a trend in rendering indexing and abstracting services, CAS & SDI services to the research scholars and teachers.

Indexing and abstracting services presently available may not be wholly suitable to its needs in

terms of coverage, periodicity, etc. For instance, the indexing service of ICSSR (Southern Regional Centre) "Samaja Vignyana Pradhana Vyasa Soochi", is a half yearly service and is not helpful in communicating information on time. This needs to be supplemented to cover non-Telugu literature as well. The library, therefore, has to introduce these services to provide timely information and also wider coverage. The periodicity may be monthly if not less than this because the output of literature in Telugu is not very high. In addition, the library may render inter library loan service, reprographic services, compilation of subject bibliographies, etc., useful for researchers and teachers.

## GENERAL SERVICES

The library has to play a dominant role in the promotion of the educational as well as cultural activities in the University contributing to the development of personality of the individual. It may therefore, have to organise a variety of programmes such as, debates, essay and elecution competitions, group discussions, scholarly meetings, lectures, film shows, book exhibitions, etc.

## COMMUNITY INFORMATION SERVICES

According to the British Library Association, community information services are "Services which assist individuals and groups with daily problems solving and with participation in the democratic process". The same is stated in simple words by

Elaine Kempson as "information for Self-reliance and Self-determination.

As a matter of fact community information is rather a begey lately added to the profession. It urges the librarian to become involved in the social problems of the society particularly unemployment. Thus community information includes information about employment, health and hygiene, education, Government developmental programmes and facilities extended to the citizens, civic rights and duties etc. Though it is felt more appropriate to the public library, it can also be planned in a limited way in university libraries by collecting basic information material on these aspects and establishing links with public libraries.

There is indeed no limitation or restriction if any library wants to plan and introduce new services. Greater the variety and larger the number of services brighter is the image of library. The volume and variety of services that a library renders depends not merely on the collection alone. Imagination and dedication are also necessary.

N. Laxman Rao

## 4.8 TELUGU UNIVERSITY LIBRARY : AN OVER VIEW

The need for the establishment of a Telugu University was felt as early as in 1913. The need, abviously, had a relation to the demand for the establishment of a separate state covering Telugu speaking people. The pioneering effort was a meeting of the people from different parts of the country converging at Bapatla to start a movement for the purpose. This subsequently resulted in the formation of "Andhra Viswa Kala Parishat" in 1926. The demand for a separate state was partially conceded in 1953 by forming an 'Andhra State' and completely later in 1956, when Andhra Pradesh was fully carved out.

After the formation of the larger state of Andhra Pradesh the linguistic and cultural aspirations of the people began shaping themselves. A number of Academies and Institutions were established. Lack of co-ordination and concerted action among these institutions, despite sufficient resources, naturally impeded progress and development. The Government after carefully examining the lacuna in the functioning of these bodies merged them together and established the "TELUGU VIGNANA PITHAM" (Seat of Telugu knowledge). Subsequently, the TELUGU UNIVERSITY was founded through an Act of the state. The objective

is to further the cause of Telugu Language and culture through the establishment ofcentres of study and research of excellence.

This University is second of its kind in the country, Tamil University being the first. The aim is to institute such courses of studies and research to rediscover the past glory of the Telugus and plan the present as well as the future pursuits which will collectively add to the cultural wealth of the state.

The objectives are—

1. To work as a centre of higher learning and research in Telugu language, literature and culture.
2. To provide instruction in the above areas to those who are desirous of studying, whether they are within the country or outside the country.
3. To provide facilities for study and research in the fields of arts, culture, music, drama, painting, sculpture, vastu (archaeology), language, literature, grammar, linguistics, history, religion, vedanta, medicine, engineering, handicrafts, etc , as they relate to the land and the people.
4. To translate books from and into Telugu in tune with the objectives and needs of the university.
5. To explore and collect inscriptions and other historical records and publish them.
6. To undertake research and develop vocabularies (borrowed as well as lent) as they relate to various activities of life.

7. To develop Telugu language as a suitable language for science and scientific communication.

8. To provide facilities and design methods for research and development in Telugu language to cover all the contemporary fields of knowledge.

In addition to the above objectives, the profile published by the university also mentioned that the Telugu University is primarily intended for research, training and publication.

To accomplish these tasks the University requires to mobilise :

1. Human resources
2. Financial resources
3. Bibliographic resources
4. Support from the Government.

Library resources are most important in an academic institution. This is particularly so for Telugu University which is in the initial stages of growth and development.

## TELUGU UNIVERSITY LIBRARY

The Library in this University has certainly a great role to play which when compared with any other university library is indeed very difficult also.

Collection development is the key factor. The collection not only needs to register a rapid progress but should also cover the areas of the activities of

the university. Most of the activities identify themselves with highly specialised fields. A minimum collection is the first target. But selection and acquisition can not be easily carried out for the obvious reason that selection tools like catalogues and bibliographies have not come into existence yet. None the less, the library has many onerous duties. (1) It a has to create user-awareness of documents and literature. (2) It has to strive to acquire material useful and relevant to the needs of the users.

These two aspects must necessarily consider both the retrospective and the current literature. It is necessary that the library besides the normal acquisition programme engages itself in a study and survey to obtain necessary data as to —

1. What are the documents relevant to the needs in print ?

2. What titles have since gone out of print ?

3. What is the extent unpublished literature ?

4. What are the other useful collections that can be depended upon ?

Documents can be in any language and in any form and may be available in any part of the World. Efforts will have to be naturally made to garner such information and if possible procurement of copies must also be tried.

The success of any library ultimately depends on its collection and services. Collection building and

provision of services are not an easy task. It is possible that the faculties may grow and the users also may increase in number. Thus, the demands on the library will soon multiply. It has to be therefore prepared to meet these challenges. The collection should improve both qualitatively and quantitatively. The greatest challenge will perhaps be the retrospective collection development. But it has many constraints. This difficulty can be surmounted partly by obtaining facsimilies, micrographic for some of the important items which have gone out of print. For the rest, the obvious means is some kind of functional relationships with large collections in the country and outside. Further resource sharing will be another answer. Telugu University library may perhaps initiate this process and establish a network and develop collective mobilization of resources and creation of necessary data bases.

All these suggest that the library should have a well planned programme of action and is organised on modern lines. In fact unlike in other Universities, the Telugu University Library must necessarily have separate departments or units for bringing out a series of secondary sources of information ranging from catalogues to bibliographies, indexes, abstracts etc. Likewise, it must also maintain microfilming and reprographic units of its own so that important retrospective literature can be copied and stored.

These and many other tasks detailed in this paper have financial, staff, space and other implications. In the first instance, the library must be

assured of greater finances. As per the recommendations of the Raj Committee and AIU Policy document 25% of the University budget needs to be allocated to the library. Considering the unique reponsibility of the library in this university even this amount may be inadequate. Then comes the problem of staffing. In view of the variety of services to be organised by the library, staff requirements in a phased programme needs to be examined and implemented. The staff standards for university libraries are, unfortunately, not satisfactory. In deciding the staff requirements the collection si ze, the volume of acquisition, the variety and volume of services, the finances, the units, the present and future plans will have to be considered.

Relatively an infant library, it is advisable that the library plans automation, Computerization is necessary not merely to carry out the daily chores of transaction and business but also to organise such major operations as acquisition, serial control, classification and cataloguing, circulation and bibliographical services.

As an integral part of the larger system, the development of the library is both supplementary and complementary. As such without the administrative support it can not grow fast.

వి.వి.వి. సత్యనారాయణ

# 5.1 గ్రంథాలయాల్లో గణకయంత్ర అనువర్తనలు

గ్రంథాలయాలు విజ్ఞాన నిక్షేపాలు. సేవాసంస్థలు. విజ్ఞాన సముపార్జనకు, సాంస్కృతిక, సామాజిక అవగాహనకు ఎంతో తోడ్పడతాయి. అభివృద్ధిచెందిన దేశాల్లో గ్రంథాలయాలు సామాజకంగా కీలక పాత్రను వహిస్తున్నాయి. అందుచేత ఆ దేశాల్లో గ్రంథాలయాలకు అధిక ప్రాముఖ్యం ఏర్పడింది. విజ్ఞాన-సాంకేతిక సమాచారాలకు మౌలిక సాధనాలుగా ఎదిగాయి. ప్రపంచం నలుమూలల్లో సాగే అభివృద్ధి కార్యక్రమాలు, పారిశ్రామిక, వైజ్ఞానిక, సాంకేతిక పరమైన అభివద్ధిని తెలుసుకోవాలంటే, పత్రికలు, పుస్తకాలు. ప్రామాణికాలు, నివేదికలు, ఉద్గ్రంథాలు మొదలైనవి అవసరం. ఈ అవసరాన్ని గ్రంథాలయాలు మాత్రమే తీర్చగలవు. విశేషగ్రంథాలయాలు సాంకేతిక, వైజ్ఞానిక గ్రంథాలకు నిలయాలు. వైజ్ఞానిక, సాంకేతిక పరిశోధకులు నిరంతరం నూతన విషయాలను తెలుసుకొనే ప్రయత్నాలు చేస్తున్నారు. వీరికి విశేషగ్రంథాలయాలు ఎంతో తోడ్పడతాయి. ఈ గ్రంథాలయాలు విశిష్ట మైనవి. ఇవి సాంకేతిక, వైజ్ఞానిక సమాచారాలు, వాటి అభివృద్ధి కార్యక్రమాలను చదువరులకు త్వరితంగా అందజేసే పద్ధతులను అనువర్తిస్తాయి.

సాంకేతిక, వైజ్ఞానికరంగాల్లో అపారమైన కృషి జరిగే ప్రస్తుత కాలంలో గ్రంథాలయాల పాత్ర కీలకమైంది. పెద్ద దేశాలు సాంకేతికం

గాను, వైజ్ఞానికంగాను అభివృద్ధి సాధించటానికి పోటీపడుతున్నాయి. ఈ పోటీని తట్టుకోవాలంటే అవి పరస్పరం తమ అభివృద్ధి కార్యకలాపాలను తెలుసుకొంటుండాలి. సాంకేతిక, వైజ్ఞానికరంగాల్లోనే కాకుండా సామాజికం, సాహిత్యం, భాష, వృత్తి తదితర రంగాల్లో కూడ గ్రంథాలయాల ప్రాముఖ్యం ఎంతైనా ఉంది. అభివృద్ధిచెందే దేశాల్లోకూడా ఈ వివిధ గ్రంథాలయాలకు వాటి సేవావసరాలకు క్రమక్రమంగా గుర్తింపు రావటం గ్రహించదగ్గ విషయం. ప్రభుత్వాలు కూడా ఈ విషయమై శ్రద్ధ చూపిస్తున్నాయి.

నేటి విజ్ఞాన ప్రపంచం అనంతం. ప్రచురణలు కోకొల్లలు. నిరవధికంగా వెలువడుతున్న ఈ ప్రచురణలను, ఈ విధంగా వృద్ధిచెందే పరిజ్ఞానం యావత్తును ఉపయోక్తల అందుబాటుకు తీసుకురావటానికి ఎన్నో విధాల విషయ సంసర్గ సాధనాలు, కార్యవిధానాలు రూపుదిద్దుకుంటున్నాయి. గ్రంథాలయ సేవలు, వాఙ్మయ సమాచార సంసర్గాలు, ఆయా దేశాలు సాధించిన ఆర్థిక – సామాజిక సాంకేతిక అభివృద్ధితో ముడిపడి ఉన్నాయని కూడా చెప్పవచ్చును. అభివృద్ధి చెందిన దేశాల్లో విప్లవాత్మకమైన మార్పులు రావటం, తత్ఫలితంగా గ్రంథాలయాల్లో కూడా ఊహించని విధంగా మార్పులు రావటం గమనించదగ్గ విషయం. ముఖ్యంగా—గణకయంత్ర అనువర్తనం గ్రంథాలయ రూపురేఖలను, సేవా విధానాలను పూర్తిగా మార్చివేసింది.

ఈ వ్యాసంలో గ్రంథాలయ సేవల్లో గణక యంత్ర అనువర్తనం ద్వారా ఏవిధమైన పరిణామాలను తీసుకొని రావచ్చునో వివరించటం జరిగింది. గుణకయంత్ర అనువర్తనంలో వర్గీకరణము, సూచీకరణము, అనుక్రమణీకరణము, సారాంశీకరణము తదితర వివిధ వాఙ్మయ ప్రక్రియలను నిర్వర్తించటమే గాక సమగ్ర వాఙ్మయ నియంత్రణతో

బాటు నిర్వహణా పరమైన దైనందిక కార్యకలాపాలను కూడా చురుకుగా, సులభంగా సాధించవచ్చును.

## గ్రంథాలయాలు - గణకయంత్రాలు

గ్రంథాలయాల్లో సామాన్యంగా నిర్వహించే విధులు సంకలనం, నిర్వహణం, పుస్తక సేవలు అని స్థూలంగా చెప్పవచ్చు. మరికొంత వివరంగా చెప్పాలంటే అవి :

1. పుస్తకాలు, మొదలైన పఠన సామగ్రి సేకరణ (Collection)
2. పత్రికలు మొదలైనవాటి సేకరణ-నియంత్రణ (Serials acquisition and control)
3. వర్గీకరణ, సూచీకరణ మొదలైన వాఙ్మయ నియంత్రణలు (Classification, Cataloguing etc., Bibliographic control)
4. పుస్తక చలామణి - నియంత్రణ (Circulation control)

ఈ వివిధ ప్రక్రియలను కాయకంగా నిర్వర్తించటం ఒక ఎత్తు. యంత్ర సహాయంతో సాధించటం మరోఎత్తు. యంత్ర అనువర్తనంలోవేగం, సమర్థతలు ఎక్కువ. గణనీయమైన ఫలితాలు పొందవచ్చును. గ్రంథాలయ విధానంలోను, సేవా పద్ధతుల్లోను కొత్త మార్పులను తీసుకురావచ్చు. చదువరుల దృక్పథంలో కూడా అభిలషణీయమైన మార్పులు, ఆదరణలు రాగలవు.

## గణక యంత్రం-భౌతిక వివరణ

గణక యంత్రంలో (1) దర్శన తెర లేదా దృశ్యప్రదర్శక విభాగం (Video Screen or visual Display Unit)(2) అక్షరాల

బల్ల (Letter Board) (3) అయస్కాంత చక్ర పరిచాలక విభాగం (Disk Drive Unit) (4) ముద్రణ విభాగం (Printer) అనేవి నాలుగు ముఖ్యాంగాలు. ఇవి వాటి పేర్లకు తగినట్లు విధులను నిర్వహిస్తాయి. గణక యంత్ర ఉపయోగంలో అయస్కాంత మాధ్యాల్లో వివిధ రకాల దత్తాంశాన్ని నమోదుచేసి నిల్వచేయవచ్చును. వీటిని ఎంత కాలమైనా పదిలంగా భద్రపరచి నిల్వచేయవచ్చును. అవసరమైతే ఒకసారి నమోదు చేసిన దత్తాంశాన్ని చెరిపి నూతన విషయాన్ని కూడా పొందుపర్చవచ్చును. అయితే, ఇది యంత్ర సహాయం వల్లనే సాధ్యం.

గణకయంత్ర అనువర్తనం ఒక నిర్దిష్ట విధానంలోనే జరపాలి. ఇది కొన్నిదశల వారీగా సాగించాలి. వివిధ దశల్లో పూర్తయ్యే సాంతం ప్రక్రియను ఆంగ్లంలో "Programming" అంటారు. అంటే ఇది నిర్దిష్ట విధానం. క్రమపద్ధతి. ఇది యంత్రం కాబట్టి దీనికి స్వయంగా ఆలోచించే శక్తిలేదు. అందుచేత మానవ బుద్ధి కుశలత ఆధారంగానే ఇది పనిచేస్తుంది. మనం గణక యంత్రంతో సాధించవలసిన కార్యాన్ని (సమస్యను) ముందుగా విశ్లేషించి దశలవారీగా కార్యక్రమాన్ని నిర్ణయించి సంకేత పూర్వకమైన ఆదేశాలుగా రూపొందించాలి. దీనికి "Programming" అని పేరు. దీనికి వివిధ రకాల పరిభాషలున్నాయి. ఉదా॥ (1) BASIC (2) FORTRAN (3) D base II మొదలైనవి. ఈ పరిభాషలు వివిధ రకాల ఫలితాలను పొందటానికి ఉపయోగిస్తాయి గ్రంథాలయాల్లో BASIC, D base II, III మొదలైనవి ఉపయోగంలో ఉన్నాయి. ఈ పరిభాషల్లో కార్యవిధానాన్ని ఆదేశ రూపాల్లో రాయటం తెలిసి ఉండాలి.

ఈ క్రింది పంక్తుల్లో గణకయంత్ర అనువర్తనం ద్వారా సాధ్యమయ్యే ముఖ్య కార్యక్రమాలను వివరించటమైంది.

## పుస్తక సేకరణ

గ్రంథాలయాల్లో పుస్తక సేకరణ ప్రక్రియ చాలా ముఖ్యమైనది. ఈ పుస్తక సేకరణలో కార్య విధానం ఈ కింది విధంగా వివరించ వచ్చును.

1. పుస్తక సరఫరా ఆదేశం
2. అందుకోసం పుస్తకాల జాబితా తయారీ
3. సరఫరాకాని పుస్తకాలకు జ్ఞప్తి వినతులు పంపటం
4. కొనుగోలు వ్యయాన్ని అదుపు చేయటం
5. వివిధ శాఖలకు సంబంధించిన వ్యయ పట్టికలను నిర్వహించటం ప్రత్యగ్రీకరించటం.
6 విక్రేతల జాబితాలు, వారికి అందజేసిన ఆదేశ జారీలు సరఫరాలు మొదలైన గణాంక వివరాల తయారీ.
7. సంకలన సాంవత్సరిక, గణకాంశ వివరాలు
8. సరఫరా అయిన పుస్తకాల స్వీకరణ, ఉపయోక్తలకు తద్విషయమైన ప్రకటన
9. కాలబద్ధమైన పుస్తక ప్రవేశ జాబితాలు తయారీ.

పై వివరించిన కార్యవిధులన్ని పుస్తక సేకరణలో అంతర్భాగాలు. సాంప్రదాయ పద్ధతిలో కాయకంగా ఈ పనులను నిర్వర్తించటంలో పునశ్చరణలు, ఆ విధంగా కాలం, శ్రమ, వస్తుసామగ్రి తదితరాల అధిక వ్యయం ఏర్పడటం సహజం. గణకయంత్ర అనువర్తనంలో ఈ పునశ్చరణను మాపటమేగాక వివిధ రకాల ఫైళ్ళను సమాహార పద్ధతిలో సాధించటం వీలవుతుంది. కార్యసాధన కూడా అభిలషనీయమైన విధంలో ఉంటుంది. పని కూడా చురుకుగా సాగుతుంది. ఒక ప్రధాన కార్య సంబంధమైన పద్ధతిని ముందుగా నిర్ణయించి అవసరమైన మౌలిక

పంజికను (Primary Record) రూపొందించి, దాని ఆధారంగా అవసరమైనన్ని ఉప పంజికలను చేకూర్చుకోవచ్చు. తగిన విధంలో గణకయంత్ర ఆదేశాలను ఏర్పరచటంవల్ల ఇది సులభసాధ్యమవుతుంది. క్షణంలో మనకవసరమైన సమాచారం మనముందుకు వస్తుంది. వాఙ్మయ వివరణ తదితర అంశాల్లో అవసరమయ్యే ప్రమాణాలను కూడా ఏ మాత్రం కష్టం లేకుండా సాధించవచ్చు.

## పత్రికల సేకరణ - నియంత్రణ

పత్రికలు నిర్ణీత కాలంలో ప్రచురితమవుతాయి. అంటే, ప్రతి వారానికి, పక్షానికి, మాసానికి, ద్వైమాసానికి, ఇంకా ఇతర కాలావధుల్లో స్థిరంగా వెలువడుతాయి. నూతన విషయాలు పత్రికలవల్లనే ముందుగా సంసర్గం చేయటం జరుగుతుంది. అందుచేత పత్రికల అవసరాలు కూడా ప్రముఖ స్థానాన్ని వహిస్తాయి. పత్రికా సేకరణకూడా ఈ కారణంగా ప్రధానాంశం. వీటికి ముందుగా ధరలను తెలుసుకొని వ్యయాలను నిర్ణయించి కొన్ని సందర్భాల్లో విక్రేతలకు, మరికొన్ని సందర్భాల్లో ప్రచురణ సంస్థలకు ఆదేశాలు జారీచేయాల్సి ఉంటుంది. సామాన్యంగా గ్రంథాలయాల్లో పత్రికా చందాలు కొన్ని వందలకు మించి ఉండటం మనకు విదితమే. చందాలు చెల్లించగానే పని పూర్తికాదు. పత్రికా సంచికలు వేరు వేరు కాలావధుల్లో గ్రంథాలయాలకు బట్వాడా అవుతాయి. కొన్ని సంచికలు తపాలా బట్వాడాలో తప్పిపోవటం, అందకపోవటం జరుగుతుంది. క్రమంగా వచ్చే వాటిని నమోదు చేసుకోవటం, రానివాటికి జ్ఞప్తి వినతులు పంపటం, వ్యయ పద్ధతులను నిర్వహించటం మొదలైన పునశ్చరణలు ఎక్కువ ప్రమాణంలో కార్యవర్తిడులను కలిగిస్తాయి.

పుస్తక సమీకరణలోవలె పత్రికా సంగ్రహణంలో కూడా గణక యంత్రాన్ని ఉపయోగించవచ్చును. ముందుగా ప్రతి సంవత్సరం చందాలు చెల్లించవలసిన పత్రికల జాబితాను తయారుచేయాలి. ఈ

జాబితాలో పత్రిక పేరు, ప్రచురణాది వివరాలు, ఖరీదు, విక్రేతల చిరునామాలు, పత్రికలు అందే సంభావ్య తాకీఖులు మొదలైన వివరాలను కూడా పొందుపరచాలి. తగిన ఆదేశాలనివ్వటంవల్ల గణకయంత్రం తనంతట తానే విక్రేతలవారిగా పత్రికా జాబితాలను తయారుచేసి ఉత్తర్వులు జారీచేయటం జరుగుతుంది. ఈ తరువాత కావించవలసిన వెనుచర్యలకు కూడా గణయంత్ర సహాయంతోటే నిర్వహించవచ్చును. ఆయా నిర్ణీత కాలాల్లో అందని సంచికలకు జ్ఞప్తి వినతులు పంపించటం వచ్చినవాటిని నమోదు చేయటం మొదలైన పనులను కూడా యధాక్రమంగా నిర్వహించవచ్చును. ఈ విధంగా శ్రమను తగ్గించుకోవటమే గాక, కార్యవిధిలో కాలయాపనం తదితర లోటుపాట్లను సరిదిద్దవచ్చును.

## వాఙ్మయ నియంత్రణ - సూచీకరణ

ఆదేశాలమేరకు అందిన పుస్తకాలకు ప్రవేశపట్టికలో నమోదులు కావించాలి. ఈ నమోదులో పుస్తకం పూర్తి వివరాలు ఇవ్వబడతాయి. దీనిని సరాసరి గణకయంత్రంలోనే ప్రవేశపెట్టడం జరుగుతుంది. ఈ కార్యాన్ని పుస్తకాలు అందినవెంటనే ఏరోజుకారోజు చేయవచ్చును. లేదా వారానికి ఒకసారి చేయవచ్చును. ఈ విధంగా ఎప్పటికప్పుడు గణకయంత్రంలో ప్రవేశపెట్టే వివరాల ఆధారంగా వాఙ్మయ పరికరాలను అవసరమైన విధంలో తయారు చేసుకొనవచ్చును. అంతేకాకుండా గణకయంత్రాన్ని పరామర్శించి మన కవసరమైన పుస్తకాలు ఏమున్నాయో తెలుసుకోవచ్చును. ఒకసారి ప్రవేశపెట్టిన వాఙ్మయ దత్తాంశం మనకు కావలసినన్ని వివరాలు అందించటంలో తోడ్పడుతుంది. యంత్రసూచీ వల్ల కార్డు సూచీని రద్దుచేసుకోవచ్చు. కార్డు సూచీకయ్యే స్థలాన్ని ఆదా చేయవచ్చు. యాజమాన్యానికి, ఉపయోక్తలకు అవసరమయ్యే వివిధ విషయాలకు అనువైన జాబితాలను ఎంతో వేగంగా, శ్రమలేకుండా తయారుచేయవచ్చును.

## పుస్తకచలామణి - కార్యనిర్వహణ

పుస్తకాలను చదువరుల అందుబాటుకు తీసుకురావటం ప్రతి గ్రంథాలయంలో ప్రథమ కర్తవ్యం. ఇది పుస్తక సేవారూపంలో అరువు

ఇవ్వటం, వాపసు తీసుకోవటంగా చెప్పవచ్చును. ఈ కార్యక్రమాన్ని కూడా గణకయంత్రం ద్వారా నిర్వహించవచ్చును. దీనికికూడా ఇంతకు ముందు వివరించిన విధంగా గణక యంత్రంలో నిక్షిప్తం చేసిన వాఙ్మయ వివరణ నమోదే ముఖ్యాధారం. గ్రంథాలయ సభ్యుల వివరాన్ని వారికి అర్హమైన పుస్తక సంఖ్యలు మొదలైన వివరాలను గణక యంత్రంలో జతపరచటం వల్ల అరువిచ్చిన పుస్తకాలకు సరియైన రికార్డులను ఏర్పాటు చేయవచ్చును. అందుచేత నిర్ణయించిన సంఖ్యకంటె ఎక్కువ పుస్తకాలను అరువివ్వటం వీలుపడదు. గణకయంత్రం తనంతట తనే అటువంటి అరువులను నిరాకరిస్తుంది. అరువుతీసుకున్న వారు వాటిని తిరిగి ఎప్పుడివ్వాలి, ఇచ్చారాలేదా, ఏ పుస్తకం ఎవరిదగ్గర ఉంది మొదలైన విషయాలను కూడా సునాయాసంగా తెలుసుకోవటం వల్ల పుస్తక చలామణి కార్యాన్ని సునాయాసంగా నిర్వహించవచ్చును. వెను చర్యలకు కూడా యథాక్రమంలో ఆస్కారమేర్పడుతుంది.

ఈ అన్ని కార్యాల్లోను సేవా విషయమైన అన్ని రకాల గణాంకాలను కావలసినప్పుడు సిద్ధపర్చవచ్చును.

## తుదిపలుకులు

గ్రంథాలయాల్లో సులభసాధ్యంకాని పనులు క్రమేపీ ఎక్కువ కావటం వల్ల గణక యంత్రాల అవసరం నేడు ఎంతైనా ఉంది. ఎంతో శ్రమతోకూడిన కార్యం శ్రమలేకుండా తక్కువ వ్యవధిలో సాధ్యం. గ్రంథాలయ పరియావరణ, సిబ్బంది దృక్పథాలు, సేవా విధాలు అన్నీ కొత్త పుంతను తొక్క గలవు. గణక యంత్రాలు కూడా తక్కువ ధరకే లభ్యమవటం చేత వాటి అనువర్తనకు పెద్దగా వ్యయం ఉండదు. గ్రంథాలయ సిబ్బంది కాలం పొదుపు అవుతుంది. ఈ కాలాన్ని పుస్తక సంకలనాన్ని అభివృద్ధి చేయడానికి, తదితర సేవలందించటానికి వినియోగించవచ్చును.

—(o)—

యం. కనకాచారి

# 5.2 గ్రంథాలయాలు - యాంత్రీకరణ ఆవశ్యకత

గ్రంథాలు పవిత్రమైనవి. గ్రంథాలు లేకుంటే జీవితం పూజ్యం. జాతి మనుగడకు పుస్తకాలు అత్యావసరం "పుస్తకాలు మన చెంతన ఉంటే ఏలోపం ఉండదని" రస్కిన్, టాల్‌స్టాయ్, మహాత్మాగాంధీ, రాధా కృష్ణన్ మొదలైన మహానుభావులు పదేపదే భాషించారు.

ముల్కరాజ్ ఆనంద్ ఒకచోట "మానవ మేధస్సునుండి బహిర్గతమైన భావ పరంపరకు చక్కని ప్రాతినిధ్యం వహించి మానవ జాతిలో వచ్చిన పరివర్తనను ప్రతిబింబించి, సంస్కృతిని సంపుటీకరిస్తూ, ఆత్మోన్నత్యాన్ని ఆత్మానందాన్ని కల్పిస్తూ, ఆలోచనాశక్తినీ, వివేచనా శక్తినీ విచక్షణాజ్ఞానాన్ని పెంపొందిస్తూ, శాంతి సౌభాగ్యాలను ప్రసాదించే ప్రధాన సాధనాలు ఈ పుస్తకాలు" అని అన్నారు.

ఆధునిక తెలుగు కవి కాళోజీ గారు చెప్పినట్లు "అక్షరరూపం దాల్చిన ఒక్కసిరా చుక్క లక్ష మెదళ్ళను కదలిస్తుంది".

అలాంటి సిరా చుక్కలెన్నో! అక్షరాలెన్నో ఎన్ని లక్షల మెదళ్ళను కదలిస్తుందో! ఆలోచిస్తే ఊహకందని విషయం.

హిమవత్పర్వత శిఖరంలాంటి అత్యున్నత ప్రయోజనమున్నట్టి ఈ గ్రంథాలను కేవలం ఒక భవనంలో సేకరించి పెట్టడం గ్రంథాలయమని అనిపించుకోలేదు. అట్టి గ్రంథాలు జాతి, మత, కుల, వర్గ, వర్ణ

విచక్షణా రహితంగా విశ్వజనీన ప్రయోజనార్థమై ఉపయోగపడితీరాలి. గ్రంథాలయాలు (గ్రంథమందిరాలు, విజ్ఞానకేంద్రాలు) ప్రపంచ మానవాళికి నాటి నుండి నేటివరకు చేసిన, చేస్తున్న, చేయనున్న మహోపకారాన్ని ఇప్పటికి మరువలేము. మరువకూడదు.

అయితే తిరుపతి వేంకటకవులు చెప్పినట్లు దేశ, కాల, ప్రభుత్వాలను బట్టి గ్రంథాలయ ప్రయోజనాల్లోకూడా మార్పులు రావటం సహజం. అందులో భాగంగానే ప్రతిదేశం అభివృద్ధి చెందాలని తహతహ చెందడం సహజమైన విషయం. సాంఘికంగా, ఆర్థికంగా, పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలంటే దానికనువయ్యే సాధనా సామగ్రిని ఏర్పరచుకోవాలి. అందుకు పరిశోధన మరియు అభివృద్ధి సంస్థలు ఏర్పడాలి. ఆ సంస్థలలోని సామాజిక, సాంకేతిక శాస్త్రజ్ఞులకు, ఆర్థిక పారిశ్రామిక వేత్తలకు, గణాంకాధికారులకు ఇతరులకు కావలసిన సమాచారాన్ని శోధించి, సేకరించి, భద్రంగా నిల్వచేసి సరియైన రూపంలో సరియైన పద్ధతిలో, సరియైన సమయంలో అందజేసేవి గ్రంథాలయాలు/సమాచార కేంద్రాలు/ప్రలేఖన సంస్థలు. ఇపుడు గ్రంథాలయాల ప్రాముఖ్యం ఏమిటో తెలిసింది. అయితే సమాచారాన్ని శోధించడం, సేకరించడం అనేవి ఎంతో ఆలోచనతో, శ్రమతో, సమయంతో కూడిన ప్రక్రియ. ఎందుకంటే రోజురోజుకు విజ్ఞానం అనంతవేగంతో అనేక రూపాల్లో అంతు లేకుండా పెరిగి పేరుకుపోతుంది.

అనంతశాస్త్రం బహువేది తవ్యం
స్వల్పశ్చకాలో బహు వశ్చ విఘ్నాః (ఉత్తర గీత 3)

శాస్త్రాలు అనంతం. కాలం తక్కువ. విఘ్నాలు ఎక్కువ. మరి ఆనాటినుండి కూడా విజ్ఞానం నిరవధికంగా పెరుగుతూనే వస్తూంది. ఈ పెరుగుదల 20 వ శతాబ్దంలో ఊహించని విధంగా పరిణమించింది.

ఇటీవల జరిపిన సర్వే ప్రకారం ప్రతి సంవత్సరం సుమారు ఐదారు మిలియన్ల పుస్తకాలు, ఒక మిలియను పత్రికలు ప్రచురించబడుతున్నాయి.

జాన్ నెస్‌బెట్ 'మెగా ట్రెండ్' అనే పుస్తకంలో "సాంకేతిక విజ్ఞానశాస్త్ర సమాచారం ప్రతి సంవత్సరానికి 13 శాతం పెరుగుతుంది" అన్నారు. అంటే ప్రతి 5.5 సంవత్సరాలకొకసారి రెట్టింపు అవుతుందన్న మాట. అందుకే ఈ యుగాన్ని "సమాచార యుగమని" పేర్కొం టున్నారు. ఈ విధంగా వెల్లువికే సమాచారంలో ఏ కొంచెమైనా కొందరికి అవసరమై ఉంటుంది. ఫలానా సమాచారం ఫలానావారికి ఇంతే కావాలి అని నిర్దిష్టంగా చెప్పలేము. కనుక సాధ్యమైనంతవరకు అందరిని సంతృప్తిపరచేలాగా సమాచారాన్ని పెద్ద మొత్తంలో సేకరించడం గ్రంథాలయాల బాధ్యత.

"హంసో యథాక్షీర మివాంబు మిశ్రమ్" (ఉత్తరగీత 3)

హంస నీటిని విడిచి పాలను త్రాగినట్లు—లభ్యమయ్యే సమాచార సంపదనుండి కావలసినంత మాత్రమే కోరటం, ఉపయోగించటం జరుగు తుంది. అయితే మనం సేకరించే పరిజ్ఞానంలో ఉపయోగపడని సాహిత్యం కూడా ఎంతో కొంత ఉండవచ్చును. బహుప్రయోజనం దృష్ట్యా అది స్వల్పలోపమనే చెప్పాలి.

కాళిదాసు కుమారసంభవ సంస్కృత మహాకావ్యంలో

అనన్తరత్న ప్రభవస్య యస్య
హిమంనసౌభాగ్య నిలోపి జాతమ్
ఏకో హి దోషో గుణసన్ని పాతే
నిమజ్జతీనోః కిరణేష్వివాఙ్కః.

హిమవత్పర్వతం అపార సంపద గలది. రత్నాలకు, మణులకు, ఓషధులకు నిలయమైంది. అయితే అదంతా మంచుతోనిండి ఉందిగదా. అంతమాత్రాన అది పెద్దలోటుకాదు. అలాగే చంద్రుడు మనకు చల్లని కాంతిని అందిస్తాడు. అందరిని ఆనందపరుస్తాడు. అయితే చంద్రునిలో కనిపించే మచ్చ దాని గొప్పదనాన్ని కించపరచదు.

ఈ విధంగా అతివేగంగా అనుహ్యంగా పుంజుకొస్తున్న సమాచారాన్ని అందరికీ అందుబాటులో ఉంచడమనేది చాలా క్లిష్టతరమైనపని. ఆ పని వేగంగా స్వల్పవ్యవధిలో జరిగి తీరాలి. ఏమాత్రం జాప్యం జరిగినా ఫలితం శూన్యం. ఈ లక్ష్యాన్ని కేవలం మానవశక్తి ఆధారంగా సాధించగలగటం కొంత దుర్లభమేనని చెప్పవచ్చును. గణకయంత్రాలు (Computers) ఇందుకు దోహదం చేయగలవు—అవి ప్రాణంలేని మనుషులు. మనము చెప్పింది వింటాయి. చెప్పినట్లు చేస్తాయి జ్ఞాపకం ఉంచుకుంటాయి. అనుకున్నప్పుడు కావలసిన సమాచారాన్ని అందజేస్తాయి. కాని వాటికి మనం ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని వాటి భాషలో అందించాల్సి ఉంటుంది. అదొక్కటే మనం చేయవల్సిన పని. శిక్షణపొందిన వ్యక్తులు మాత్రమే ఈ పని చేయగల్గుతారు. అదేగాకుండా యంత్రస్థాపన వ్యయంతో కూడినపని. మొదట్లో ఎంతో వ్యయం అనిపించినా మనం ఆశించిన సత్ఫలితాలు త్వరలోనే పొందగల్గుతాము

గ్రంథాలయాల్లో యాంత్రీకరణ లేదా స్వయం చాలకత్వం (Automation) వల్ల కలిగే లాభమేమిటో చూద్దాం.

1. మొట్టమొదట చెప్పుకోదగిన దేమిటంటే గ్రంథాలయంలో ప్రతిసారి పదేపదే చేసే పునశ్చరణ కార్యాలను స్వల్పవ్యవధిలో, సునాయాసంగా నిర్వహించవచ్చును. ఉదాహరణకు—పుస్తకాల పేర్లు, రచయితలపేర్లు, ప్రచురణాలయం, ప్రచురణ స్థలం, ప్రచురణసంవత్సరం,

సంపాదకీయం, కూర్పులు మొదలైనవి ఎన్నోసార్లు రాయాల్సి లేదా టైపు చేయాల్సివస్తుంది. ఇంతేగాకుండా పుస్తక సేకరణ విభాగంలో, ప్రవేశపట్టికలో, సూచీకరణలో, సొరుగుపట్టి తయారీలో, క్రొత్తచేరికల పట్టిలో, పుస్తక చలామణి కార్యంలో పైన చెప్పిన పుస్తక (వాఙ్మయ) వివరాలు రాయటం తప్పనిసరి. వాటినన్నింటిని ఒకసారి యంత్ర కేంద్ర మెమోరీలో గనుక క్రమబద్ధంగా నిల్వచేస్తే ఏ సమయంలోనైనా, ఎన్ని సార్లైనా, ఏ విభాగానికైనా సులభంగా వాడుకోవచ్చును.

2. యంత్రాలు అతివేగంగా పనిచేస్తాయి. కనుక ఆచార్య రంగనాథన్‌గారు చెప్పిన పంచసూత్రాల్లో నాల్గవ సూత్రం "పాఠకుని సమయం ఆదాచేయండి" అనేది నూటికినూరుపాళ్ళు అమలు జరుగుతుంది. తద్వారా గ్రంథాలయ సిబ్బంది సమయం కూడా ఆదా అవుతుంది. అందుచేత సిబ్బంది వేరే సేవలను అందించటానికి వీలౌతుంది.

3. స్వయం చాలకత్వంవల్ల అధిక సేవలను, పాఠకులకు అందించ గల్గుతాము. పనిలో నైపుణ్యత కూడా పెంపొందుతుంది.

4. అవసరమైన సమాచారాన్ని, స్వల్పవ్యవధిలో, అనుకున్న తీరులో, పాఠకులకు శ్రమలేకుండా అందిస్తున్నాం కనుక పాఠకులను పూర్తిగా సంతృప్తి పర్చవచ్చును. అదే గ్రంథాలయం ప్రధాన ఆశయం.

5. ఒకే రకమైన పద్దులు, వివరాలు అనేక సందర్భాల్లో, మాధ్యాల్లో తరచూ తయారు చేయవలసిరావటంలో దోషాలు దొర్లే అవకాశం ఉంది. యంత్ర అనువర్తనలో సామాన్యంగా తప్పులురావు.

6. మనం ఏనాటినుండో చెప్తూ వస్తూన్న విశ్వజనీన వాఙ్మయ నియంత్రణ (Universal Bibliographical control) అనేది కేవలం యంత్రీకరణ వలన మాత్రమే సాధ్యపడుతుందని చెప్పక తప్పదు.

7. అంతర్జాతీయ సమాచార విధానం (Global Information System) లక్ష్యాలు అవలీలగా సాధించవచ్చును.

8. అన్నిటికంటె ముఖ్యమైన లాభమేమిటంటే యంత్రీకరణ ద్వారా గ్రంథాలయాలు, సమాచార కేంద్రాల మధ్య పరస్పర అనుసంధానం సాధ్యం. తద్వారా సమష్టిగా వనరుల వినిమయానికి దోహదం ఏర్పడుతుంది.

9. వివిధ విషయాంశాలపైన వాఙ్మయ సూచీలను, అనుక్రమణికలను సులభంగా తయారుచేసుకోవచ్చును. తద్వారా వాఙ్మయ నియంత్రణను సాధించవచ్చును.

గ్రంథాలయ నిర్వహణలో, అంటే గ్రంథాలయ గణాంక దత్తాంశం, సంవత్సరాంత నివేదికలు, ఆయవ్యయ అంచనాల తయారీకి, అలాగే ఇతర దైనందిక కార్యకలాపాలకు కూడ యంత్రాలు ఎంతగానో ఉపయోగపడతాయి.

అన్నింటికంటే ముఖ్యంగా ఈ సదస్సుకు ప్రధానాంశమైన "గ్రంథాలయ వనరులు-సమష్టి సమీకరణ" అనే లక్ష్యం నూటికి నూర్ళుపాళ్ళు సాధ్యమవుతుంది. మనం ఏనాటినుంచో కలలు కంటున్న 'వనరుల సమీకరణ' ధ్యేయం కలగానే మిగిలింది. ఆశించినంతమేరకు అమలు జరుగలేదు. ఇది సంపూర్ణంగా అమలు జరగాలంటే మారుమూల ప్రాంతాల్లో ఉన్న గ్రంథాలయాలను కూడ కలిపి నెట్‌వర్కులు ఏర్పడాలి. నెట్‌వర్కులు ఏర్పాటు కావటానికి కంప్యూటర్ అనువర్తనలు తప్పనిసరి.

గ్రంథాలయాల ఆవశ్యకతను గుర్తించి మనదేశ 7వ పంచవర్ష ప్రణాళికలో ఈ కింది సిఫారసు చేయడమైంది.

For a small library with less than 10,000 books, 100 periodicals and 100 users, a mini-Computer with a mass storage of 20 MB, a line printer, a floppy drive and 2-3 interactive terminals or an intelligent terminal to a nearby mainframe system at a cost of about Rs. 6-00 lakhs are recommended. By the end of Seventh plan, about 20 percent of an estimated 1,200 small libraries would have to Computerise their operations and Services. For a medium size library, with a range between 10,000 to 40,000 Volumes, 250 Journals, and 250 readers, a Mini - Computer of 4 MB, mass storage, a medium speed line printer, one tape drive and about 5-10 terminals at a cost of Rs. 10-12.00 lakhs per system are recommended. About 30 percent of an estimated 600 medium size libraries can be expected to introduce computers. For a large library with a collection over 40,000 volumes, more than 250 current receipt of journals as well as 250 users, a medium computer with 100 MB mass storage, medium speed line printer, 2 tape drives, a floppy disc and about 20 interactive terminals at a cost of Rs. 25 lakhs per system is foreseen. In this proposal, in addition to hardware, development of software packages and training of manpower have been stressed. After developing computer capability, the proposal envisages linking small libraries to medium libraries and medium libraries to large libraries in order to form a library network. This library network can be linked to other national and international data and infor- mation networks.

The Working Group's proposal may, however, require recasting in the light of present abundant availability of microprocessor systems. The order of investment may also get reduced. Yet another point to take note of here is about the INDONET of Computer Maintenance Co-oporation ond NICNET of the National Informatics centre, which are data communication networks and to which our Library networks could also be linked. For example, national databases such as Union Catalogue, Indian National Bibliography and Indian Science Abstracts could be mounted on INDONET and NICNET for purpose of online access to users scattered all over the country.

—(o)—

కె. రమణయ్య

# 5.3 విశ్వవిద్యాలయ గ్రంథాలయాల్లో యాంత్రీకరణ మరియు సిబ్బంది శిక్షణ

అవధులు లేకుండా పెరిగే నేటి పరిజ్ఞానాన్ని సేకరించటం, వ్యవస్థీకరించటం, సంసర్గీకరించటం గ్రంథాలయాలకు సమస్యగా పరిణమించింది. ఎదిగే పరిజ్ఞానానికి సమంగా పాఠకుల సంఖ్య పెరగటం, వారి విషయావసరాలు విస్తరించటం ఈ పరిస్థితిని మరింతగా క్లిష్టతరం చేస్తున్నాయి. యాంత్రీకరణమే సరియైన పరిష్కార మార్గంగా కనిపిస్తుంది. యాంత్రీకరణవల్ల సమాచారాన్ని త్వరితంగా సేకరించడం, విశ్వసనీయంగాను, ఖచ్చితంగాను పాఠకులకు అందించటం సాధ్యమవుతుంది. అంటే కంప్యూటర్లు తప్ప వేరే మార్గాంతరంలేదు. గ్రంథాలయాల్లో కంప్యూటర్లు పెట్టినంత మాత్రాన సరిపోదు. సుశిక్షితులైన సిబ్బంది కూడా అవసరం. సుశిక్షితులు కావటానికి కంప్యూటర్ కోర్సును ఎం. ఎల్. ఐ. ఎస్. సి. స్థాయిలో ప్రవేశపెట్టడం జరగాలి. ఇంతేకాక దీర్ఘకాలిక, ప్రత్యేక శిక్షణల ఏర్పాట్లు కూడా ఉండాలి. ఉద్యోగంలో ఉన్న అభ్యర్థులకు UGC, ILA, IASLIC వంటి సంస్థలు శిక్షణ కార్యక్రమాలను నిర్వహించవలసి ఉంటుంది.

## యాంత్రీకరణ ఆవశ్యకత

ఈనాడు యాంత్రీకరణ ప్రవేశించని రంగంలేదు. కేవలం పారిశ్రామిక రంగంలోనే కాకుండా వర్తక వాణిజ్యాల్లోనూ, విద్య, వైద్య రంగాల్లోనూ, రవాణా రంగంలోను, దాదాపుగా అన్ని అభివృద్ధి

రంగాల్లోను ఏదో ఒక మేరకు యంత్రాల వాడకం ఏర్పడింది. మరొక రకంగా చెప్పాలంటే ఆధునిక జీవనంలో యంత్రాల వినియోగస్థాయే అభివృద్ధి స్థాయిని నిర్ధారిస్తుంది. ఇది అతిశయోక్తి కాదు. ఈ విధమైన యాంత్రీకరణకు గ్రంథాలయం మినహాయింపు కాదు. గ్రంథాలయ రంగం ఇతర రంగాల్లో వచ్చిన పరిణామాలకు అతీతంగా ఉండజాలదు. యాంత్రీకరణ గ్రంథాలయాల్లో కూడా పెద్ద ఎత్తున ప్రవేశిస్తున్న సూచనలు అప్పుడే కనిపిస్తున్నాయి.

యాంత్రీకరణ పాశ్చాత్య ప్రపంచంలో చాలా కాలంగా ఉన్నా, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఇటీవలి కాలంలోనే ప్రవేశించటం జరిగింది. మానవుడు రాతియుగం, లోహయుగం, ప్లాస్టిక్ యుగం దాటి కంప్యూటర్ యుగంలో అడుగుపెట్టాడు. ఈనాడు శాస్త్ర, సాంకేతికరంగాల్లో వచ్చిన అభివృద్ధి ప్రయోజనాలను పూర్తిగా పొందాలంటే కంప్యూటర్లు తప్ప వేరే మార్గంలేదు. ఇందువల్లనే మన ప్రధాని ఒక సందర్భంలో "మనం పారిశ్రామిక విప్లవాన్ని అందుకోలేకపోయినప్పటికి కంప్యూటర్ల విప్లవాన్ని అందుకోకుంటే మనకు భవిష్యత్తులేదు" అని అన్నారు.

వివిధ అభివృద్ధి రంగాల్లో సామర్థ్యాన్ని పెంపొందించటం ఈనాడు భారతదేశంలో ఎంతో అవసరం. ఇందుకు గాను విద్య, వైజ్ఞానిక రంగాల్లో ప్రభుత్వ విధానంలో భాగంగా కంప్యూటర్లను ప్రవేశ పెట్టటానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. ఉన్నత విద్యారంగానికి సంబంధించినంత వరకు మనదేశంలో ప్రస్తుతం ఉన్న దాదాపు 150 విశ్వవిద్యాలయాల్లో 94 అభ్యర్థనలను స్వీకరించి 76 విశ్వవిద్యాలయాలకు కంప్యూటర్ల కొనుగోలుకు గాను విశ్వవిద్యాలయాల నిధుల సంఘం నిధుల్ని మంజూరు చేయటం జరిగింది. కేవలం ఉన్నత విద్యా రంగం లోనే కాకుండా పాఠశాల స్థాయి విద్యలో కూడా కంప్యూటర్ల అవసరం

గుర్తించటం జరిగింది. పాఠశాలల్లో ఆధునికమైన దృశ్య శ్రవణ పద్ధతులు ప్రవేశ పెట్టడం జరిగింది.

గ్రంథాలయం విశ్వవిద్యాలయ వ్యవస్థకు గుండెవంటిది. మానవ శరీరంలో గుండె ఏవిధంగా వివిధ శరీర భాగాలకు రక్తప్రసారం చేస్తుందో అదేవిధంగా విశ్వవిద్యాలయంలోని విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, పరిశోధకులకు విజ్ఞానమనే జీవరక్తం అందించేది గ్రంథాలయం. ఒక విశ్వవిద్యాలయం ప్రతిభ చాలవరకు దాని గ్రంథాలయం మీదే ఆధారపడి ఉంటుంది.

ఈనాడు ప్రజల్లో అక్షరాస్యత పెరగడంవల్లను, పఠనాశక్తి పెరగడంవల్లను, బోధన, పఠన, పరిశోధన తదితర అవసరాలకు గ్రంథాలయ ఉపయోగం బాగా పెరుగుతున్నది. పూర్వం పాఠకుల అవసరాలు చాల పరిమితంగా ఉండేవి. కాని నేడు వారి అవసరాలు అపరిమితం. కేవలం తీరిక వేళల్లో ఉబుసుపోకకు పుస్తకాలు చదపడం కాకుండ పాలనావసరాలకు, పరిశోధనావసరాలకు, బోధనావసరాలకు, ఎన్నో విషయ సమాచార అవసరాలకు గ్రంథాలయాలను ఆశ్రయించటం జరుగుతున్నది.

పరిశోధనా రంగంలో ఇటీవల వచ్చిన అంతర్విషయక (Inter-disciplinary), బహువిషయక (Multi-disciplinary) ఉపగమనాలు, ధోరణులు గ్రంథాలయ సేవారూపాలకు క్లిష్టతను చేకూరుస్తున్నాయి.

అంతేకాకుండా ఈనాడు గ్రంథాలయాలకు వస్తున్న పఠనా సామగ్రి (పుస్తకాలు, రాత ప్రతులు, పత్రికలు, నివేదికలు, దృశ్యశ్రవణ సాధనాలు, మాగ్నెటిక్ టేపులు మొదలైనవి) వివిధ మాధ్యాల్లో, రూపాల్లో ఉంటున్నాయి.

ఇందువల్ల గ్రంథాలయాల విధుల్లోను, పనితీరులోనూ, గ్రంథాలయోద్యోగుల పాత్రలోను ఎన్నో మార్పులు వచ్చాయి. గ్రంథాలయ భావనలోనే మార్పు వచ్చి అవి సమాచార కేంద్రాలుగా వ్యవహరించబడుతున్నాయి. పర్యవసానం, గ్రంథపాలకులు పూర్వం వలె కాక సమాచార శాస్త్రజ్ఞులుగా వ్యవహరించబడుతున్నారు. కేవలం పుస్తకాలను అందించడమే కాకుండా వివిధ రూపాల్లో ఉన్న సమాచారాన్ని నిర్వహించే కార్యకర్తగా లైబ్రేరియన్ పాత్ర మార్పుతెచ్చుకున్నది. ఈ పరిస్థితుల్లో గ్రంథాలయాల్లో కంప్యూటర్ల వినియోగం అత్యావశ్యకత పొందుతున్నది.

## కంప్యూటర్ల వాడకంలో ముఖ్యాంశాలు

కంప్యూటర్లు ఎంతో ప్రయోజనకరమైనప్పటికి వాటిని ఏక బిగిని గ్రంథాలయాల్లో వాడటం అనేది అసాధ్యం, అవాంఛనీయం. వీటిని ప్రవేశపెట్టేముందు ఖర్చును, అగ్రప్రాధాన్యతలను గుర్తించటం, హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్‌లను ఎన్నుకోవడం వంటి అంశాలను పరిగణించాల్సి ఉంటుంది. వీటన్నిటిని మించి సిబ్బంది శిక్షణకు కూడా ఎంతో ప్రాముఖ్యం ఇవ్వాల్సి ఉంటుంది.

## ప్రాధాన్యతలు

వనరుల పరిమితం దృష్ట్యా కంప్యూటర్ల వినియోగం గ్రంథాలయంలో ఏయే విభాగాల్లో ప్రయోజనకరంగా ఉంటుందో ఆలోచించి, ప్రాధాన్యతలను నిర్ధారించుకోవాలి. ఈనాడున్న పరిస్థితుల్లో కంప్యూటర్లను ముఖ్యంగా విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు సంబంధించినంత వరకు ఈ క్రింది విభాగాల్లో ప్రవేశపెట్టటం సముచితంగా ఉంటుంది. పుస్తక చలామణి-నియంత్రణ, పత్రికల నియంత్రణ, పుస్తకసేకరణ, సూచీకరణ, సమాచార పునస్సాధన (Information Retrieval)

కార్యక్రమాలకు కంప్యూటర్లను అనుసరించవచ్చు. అయితే గ్రంథాలయాల గత అనుభవాన్ని, ప్రస్తుత అవసరాల్ని, భావి అభివృద్ధిని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ఈ విధంగా చేసినప్పుడు మాత్రమే కంప్యూటర్ల గురించి ఒక నిర్దిష్ట కార్యక్రమం రూపొందించ వీలుంటుంది.

## హార్డ్ వేర్

నేడు మార్కెట్లో వివిధ సైజుల్లో అనేక విధులను నిర్వహించ గలిగిన కంప్యూటర్లు లభిస్తున్నాయి. వీటిలో మినీ-కంప్యూటర్లు, మైక్రో-కంప్యూటర్లు, వర్డ్‌ప్రాసెసర్లు అనే రకాలున్నాయి. వీటిలో గ్రంథాలయా వసరాలను, ఆర్థిక స్తోమతను దృష్టిలో ఉంచుకొని అనువైన రకాన్ని ఎంచుకోవటం ముఖ్యం.

## సాఫ్ట్ వేర్

కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ అంటే సమాచార నిర్వహణ కార్యక్రమాలని అర్థం. ఈ కార్యక్రమంలో సమాచార వివరాలు, సమాచార సంగ్రహణం, సంగ్రహించిన సమాచారాన్ని వినిమయించడం ఉంటాయి. సమాచారం, కంప్యూటర్ ఆదేశాలూ రెండూ సంకేతరూపంలో (Coded Form) ఉంటాయి. సాఫ్ట్‌వేర్ ప్రోగ్రాములు రెండు రకాలు.

1. వ్యవస్థ తనంతట తాను తయారుచేసుకొన్న ప్రోగ్రాములు.

2. వ్యాపార సరళిలో ఇతర సంస్థల ద్వారా తయారు చేయబడే ప్రోగ్రాములు.

## సిబ్బంది శిక్షణ

కంప్యూటర్లు స్వయంచాలిత యంత్రాలైనప్పటికి వాటంతట అవి పనిచేయవు. వాటి నుండి పూర్తి ఫలితాన్ని పొందాలంటే సుశిక్షితులైన

సిబ్బంది కావాలి. హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్ లాగ సిబ్బంది మార్కెట్లో దొరికే సరుకుకాదు. సిబ్బందిని ఒక నిర్దిష్టమైన శిక్షణా కార్యక్రమంద్వారా రూపు దిద్దుకోవాల్సిన అవసరం ఉంది. కంప్యూటర్ల నిర్వహణలో శిక్షణా కార్యక్రమాలు కొంతమేరకు ILA /IASLIC వంటి వృత్తి సంఘాలు చేపడుతున్నాయి. అయితే ఈ సంఘాలిచ్చే శిక్షణ చాలా పరిమితమైంది. వీటి శిక్షణా కార్యక్రమాలు స్వల్పకాలికాలు కావటంచేత కావలసినంత నైపుణ్యం సిబ్బందికి సమకూరడంలేదు. ఇందుకుగాను కంప్యూటర్లు కొనే ముందే తత్సంబంధమైన గ్రంథాలయ నిర్వాహకులు సిబ్బందికి ఒక దీర్ఘ కాలిక ప్రాతిపదికపై శిక్షణ కల్పించాలి.

గ్రంథాలయ సిబ్బందికి కంప్యూటర్ శిక్షణ రెండు ప్రత్యామ్నాయ పద్ధతుల ద్వారా చేయవచ్చు.

1. ప్రస్తుతం ఉన్న సిబ్బందికి ప్రత్యేక శిక్షణ కల్పించడం.

2. రాబోయే సిబ్బందికి వారి విద్యా ప్రణాళికలోనే కంప్యూటర్ల శిక్షణను ఒక అంతర్భాగంగాచేసి సుశిక్షితులను చేయడం.

## ప్రస్తుత సిబ్బంది శిక్షణ

కంప్యూటర్ల రంగంలో శిక్షణ పొందడంలో ఉద్యోగులకు ఎన్నో సాధక బాధకాలున్నాయి. ఉద్యోగులకు కోర్సులో ప్రవేశం దొరకటం, అధికారుల అనుమతి లభించటం, సెలవు మంజూరు కావటం మొదలైన సమస్యలు ఉంటాయి. వీటన్నిటికన్నా ముఖ్యమైనది ఆర్థిక సమస్య. ఇన్ని సమస్యలు ఉండి ఉద్యోగి శిక్షణ పొందాలంటే చాల కష్టమైన పని.

పై సమస్యలను పరిష్కరించడానికిగాను విశ్వవిద్యాలయ విరాళాల సంఘం వంటి సంస్థలు చొరవ తీసుకోవాల్సిన అవసరం ఉంది. UGC గ్రంథాలయాల ఆధునికీకరణకు ఒక బృహత్ కార్యక్రమాన్ని రూపొం

పించాలి. ఇందులో భాగంగా అధ్యాపక సిబ్బందికి ఉన్నటువంటి Faculty Improvement Programme (FIP) వలెనే లైబ్రేరియన్లకు గ్రంథాలయ అభివృద్ధి కార్యక్రమం (Library Improvement Programme) (LIP) వంటి సదుపాయం కలుగజేయాలి. ఇందుకుగాను దేశంలో ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర, మధ్య ప్రాంతాలకు ఒక్కొక్కటి చొప్పున అయిదు ప్రాంతీయ కంప్యూటర్ శిక్షణా కేంద్రాలను స్థాపించాలి. ఈ కేంద్రాల నిర్వహణకుగాను సరిపోయే నిధులు కేటాయించడంతో పాటు వాటికి కావలసిన హార్డ్ వేర్ను, నిపుణులైన సిబ్బందిని కల్పించాలి. ప్రతి ప్రాంతీయ శిక్షణా కేంద్రంలో కనీసం 30 మంది అభ్యర్థులకు శిక్షణావకాశం ఉండాలి. అభ్యర్థులను ప్రతి విశ్వ విద్యాలయం నుండి ఒక్కొక్కరు చొప్పున తీసుకోవడం జరగాలి. ఈ విధంగా చేయడం వల్ల సంవత్సరానికి ప్రతి విశ్వవిద్యాలయంలో కనీసం ఒక్కరైనా కంప్యూటర్ శిక్షణ పొందిన ఉద్యోగి ఉంటాడు. ఈ రీతిగా 150 విశ్వవిద్యాలయాల్లో 150 మంది సుశిక్షితులైన కార్య నిర్వాహకులు రావడానికి అవకాశం ఉంది. క్రమేపీ అన్ని విశ్వవిద్యాలయాల్లో సుశి క్షితులైన సిబ్బంది ఉండేవీలుంటుంది.

ఈ ప్రాంతీయ శిక్షణా కేంద్రాలు దీర్ఘకాలిక శిక్షణా కార్య క్రమాలతో పాటు కంప్యూటర్ రంగంలో వస్తున్న నూతన మార్పులను సిబ్బందికి అందించడానికి స్వల్పకాలిక పునశ్చరణ తరగతులు నిర్వ హించవచ్చును.

UGCవారు లైబ్రరీ సిబ్బంది ఉద్యోగాభివృద్ధికి గాను ఈ సంవ త్సరం ప్రకటించిన ఒక రిపోర్టులో సమాచార సాంకేతిక శాస్త్రంలో ఒక సంవత్సరం శిక్షణ అర్హతగా పేర్కొన్న దృష్ట్యా UGC మీదే ఈ శిక్షణా వసతులు కల్పించవలసిన నైతిక బాధ్యత ఉన్నది.

## భావి సిబ్బందికి శిక్షణ

ప్రస్తుతం ఎం.ఎల్.ఐ.ఎస్.సి. స్థాయి పాఠ్యప్రణాళికలో కంప్యూటర్ కోర్సుకు సంబంధించినంతవరకు ఏకరూపత లేదు. కొన్ని విశ్వవిద్యాలయాల్లో దీనికి గాను ఒక పూర్తి పేపరు కేటాయించగా, మరి కొన్నింటిలో కేవలం పేపరులో ఒక భాగంగా మాత్రమే ఉన్నది. ఇంకొన్నింటిలో కంప్యూటర్లకు సంబంధించిన పాఠ్యాంశాలు అసలే లేవు. కంప్యూటరు కోర్సు పాఠ్యప్రణాళికల్లో ఉన్న చోట్ల కూడా సిద్ధాంత (Theory) విషయాలకే ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతున్నది. కాని వాటిని వినియోగించడానికి ఆచరణ పూర్వకమైన శిక్షణ పూర్తిగా నిర్లక్ష్యం చేయబడుతున్నది. అందుకొరకు కంప్యూటర్ బోధనా కార్యక్రమాల్లో సిద్ధాంతం (Theory)తో పాటు అభ్యాసానికి కూడా సరియైన ప్రాధాన్యత ఉండాలి.

ఇక్కడ ఇంకొక సమస్య కూడా ఉంది. ప్రతి విశ్వవిద్యాలయంలో ఎం.ఎల్.ఐ.ఎస్.సి. కోర్సులో అభ్యర్థులను తయారుచేయడానికి సుశిక్షితులైన ఉపాధ్యాయులు కావాలి కాని సరియైన కంప్యూటర్ పరిజ్ఞానం ఉన్న అధ్యాపకులకొరత ఉంది. ఈ కొరతను తీర్చడానికి బోధనా సిబ్బందికి కూడా పైన పేర్కొన్న ప్రాంతీయ శిక్షణా కేంద్రాల్లో శిక్షణ ఇవ్వవలసి ఉంటుంది.

## ముగింపు

ఈ రీతిగా గ్రంథాలయ సమాచార విజ్ఞాన శాస్త్రంలో కంప్యూటరు శిక్షణ పొందిన అభ్యర్థులు భవిష్యత్తులో సమగ్రమైన కంప్యూటర్ విజ్ఞానంతో ఉద్యోగాలకు వస్తారు. ఇదివరకే ఉద్యోగంలో ఉన్నవారికి కంప్యూటర్ శిక్షణ ఇవ్వడంలో ఉన్న ఉద్యోగులందరు పరిపూర్ణ విజ్ఞానంతో కార్యక్రమాలను నిర్వహిస్తారు. ఈ రీతిగా కాలక్రమేణా ఏ

లైబ్రరీలో కూడా కంప్యూటర్ల విజ్ఞానంలో శిక్షిత సిబ్బంది కొరత ఉండదు.

హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్ శిక్షిత సిబ్బందిని సమకూర్చుకున్న తర్వాత యాంత్రీకరణకు ప్రతి విశ్వవిద్యాలయం సర్వసన్నాహంతో ఉంటుంది. గ్రంథాలయ యాంత్రీకరణ చేసిన వెంటనే ప్రతి విశ్వవిద్యాలయం పెరుగుతున్న అవసరాలను, అధునిక సమస్యలను ఎదుర్కోవడానికి సిద్ధమై ఉంటుంది.

## సలహాలు

1. దేశంలో UGC అయిదు ప్రాంతీయ శిక్షణా కేంద్రాలను నెల కొల్పాలి.
2. ఎం.ఎల్.ఐ.ఎస్.సి. కోర్సులో కంప్యూటర్ శాస్త్రాన్ని పాఠ్య ప్రణాళికలో విధిగా పొందుపర్చాలి.
3. ప్రస్తుతం ఉద్యోగంలో ఉన్న లైబ్రేరియన్లకు FIP లాగా LIP ప్రవేశపెట్టడానికి ILA/IASLIC వంటి వృత్తి సంఘాలు చొరవ తీసుకొని ఒత్తిడి తీసుకురావాలి.
4. గ్రంథాలయ ఉద్యోగులకు స్వల్పవ్యవధి పునశ్చరణ తరగతులు తరచుగా నిర్వహించే కార్యక్రమాన్ని యు.జి.సి. చేపట్టాలి.
5. ప్రతి విశ్వవిద్యాలయం లైబ్రరీ సిబ్బందిని, లైబ్రరీ సేవల్ని ఆధునీకరించటానికి స్వల్ప, దీర్ఘకాలిక శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయాలి.

—)o(—

P. Viasaamurthy

## 5.4 HARDWARE, SOFTWARE, AND MANPOWER PROBLEMS

These days computers have increasingly come to be used in every walk of life and the library therefore is no exception. In India, right now, there are about 100 libraries using computers and many will soon follow the suit. Let us now look into the three aspects of Library Automation : hardware, software and manpower problems, one after the other.

### HARDWARE

Computer architecture has undergone a sea change in the past four decades. The size of the computer has come down. The prices too have come down greatly. The power and versatility of equipments have also increased. The conventional catagorising of computers as main frame, mini computer and micro computer is vanishing fast. Microcomputers are becoming more and more powerful and effective with enlarged core memories, storage copacities, increased speed of operation, increased ease of operation (user friendliness), and so on. A microcomputer with a typical configuration like VDU, Printer, 64K Core memory, 2DSDD Floppy Drives one 20 MB Winchester, three years ago cost about Rs. 2 lakhs. But now in Dec. 87 it costs just about Rs. 50,000 only. A year ago a computer

with 64K core memory was considered "comfortable". Even in India 640K in IBM PC/XT has become common place these days. A 10 Mb Winchester Disc was considered a luxury a year ago. But now one can have a PC with a printer for a small price of Rs. 30,000/-. It is not unlikely that it will be priced and purchased just like VCRs and other home products in the near future.

## CD ROM

The recent introduction of CD-ROM (Compact Disc Read Only Memory) holds much promise to librarians. This is a 12 inch optical Disc capable of holding about 600 MB, of data To understand how much is 600MB one can imagine what it would be to collect word by word everything that is there in 30 months of the newspaper, 'Times of India'. This whole lot can be put in one CD ROM. The data held in CD-ROM can not, of course, be edited or modified so easily. However, in the case of library application, most of the data used in information retrieval activity being archival in nature, it warrants no much change or modification to be made on past data. As such CD-ROMs appear ideal for library applications.

At last year's prices (1986 Sept.) the cost of a CD ROM offering 660 MB storage space is the same as that of one 20MB Winchester (dollar 1000/-). However, these are yet to be made freely available in India. We can perhaps prepare ourselves. The future is not very far.

## COMPAQ PORTABLE

Let us take another example : Compaq has come out with a portable PC "Compaq 386 portable". This is a true 32 bit machine It has a speed of 20 MHZ (25% faster than other PC ATs). It has a core memory of 1MB optionally increased to 10 MB. It has a built-in 100 MB fixed disc drive ; Hayes 1200 baud or 2400 baud modem ; one 5-1/4 inch 1.2 Floppy drive and a 40 MB tape back up as optional. All these in a portable model !

Thanks to the whole hearted encouragement and enthusiasm of the Government, the computer industry in India is fast growing. The following table shows how computers have been rapidly increasing in our country.

TABLE 1

| Year | No. of manufacturers | Value of Production (in crores) Rs | Computers Produced | Total No. of Computers (cumulative) |
|---|---|---|---|---|
| 1980-81 | 9 | 24 90 | — | 500 |
| 1981-82 | 18 | 30 00 | — | 1,000 |
| 1982-83 | 20 | 45 00 | — | 4,800 |
| 1983-84 | 50 | 103.10 | — | 6,500 |
| 1984-85 | 100 | 138.00 | 4,800 | 11,300 |
| 1985-86 | 120 | 234 00 | 14,800 | 26,100 |
| 1986-87 | — | — | 30,000* | 56,000* |

(*approximate)

It is obvious that there is no dearth of computing power or computer hardware in India. Cheap, sophisticated, useful small systems are available in

good number. However, there could be compatibility problems or problems in expanding the computer configuration at a later date, if only the user is not careful enough in the beginning. For instance, transferability of data from one system to another is limited or restricted on account of many factors such as the operating system, disk size density, formatting characterisation cycle clock time etc. But these are not insurmountable. One has to choose in the initial stage most standard equipment say True IBM compatible computers.

## SOFTWARE

Let us now consider software. Software can be devided into 3 categories (A) Operating Systems, Language Compilers or Interpreters. (B) General purpose software Packages for Word Processing, DBMS, Spread sheets etc. (C) Specific Application Packages.

## OPERATING SYSTEMS

Operating systems are programs that come as part and parcel of the original computer equipment Without an operating system no Computer can work Some well known operating systems are CP/M, CP/M86, MP/M, MSDOS, PCDOS, UNIX etc. These are developed by computer software companies for manufacturers. Machines with same operating systems are compatible. That is why most people go in for IBM PC 'compatibles' as all of them work on the same operating system-MSDOS Until a few years ago CP/M was more popular in India as

elsewhere. But now MSDOS seams to be a better choice for many.

As already mentioned, if we have different computers using different operating systems, compatibility problems could arise due to non-portability of data.

## COMPILERS AND INTERPRETERS

In order to make the computer do what we want, one has to write 'programs'. Programs are written using languages like Basic, Fortran, Cobol, Pascal, C, etc. To help us in this task, we have compilers or Interpreters for all these languages we wish to use. If we wish to write programs in Basic we should have Basic Interpreter or Basic Compiler. Compiler/Interpreters are also programs in themselves. They are written in 'lower' level languages like Assembly Language (which are more difficult to use by common people).

## GENERAL PURPOSE SOFTWARE

There are several General Purpose Software packages available for use on microcomputer. Wordstar is a standard word processing package. One can create documents such as letters, memoranda, articles etc., using Wordstar. Making changes or alteration and preparing many "drafts" are possible. It increases the typists' productivity. Similarly dBASE II (dBASE III or D BASE III plus etc.), Foxbase, Knowledgeman, Rbase, etc., are some popular DBMS packages. They help us keep data in well structured files and prepare reports out of them.

They are sophisticated programming languages as well. We can easily develop programs for printing out catalog cards, list of additions, book acquisitions, etc. In this sense the end-user is least dependent on the programmer. They are versatile and easy to learn. Just about a week's training is all that is needed to get started.

Visicalc, Supercalc, Lotus 1-2-3 are all spread sheet packages. They help in maintaining budgets, inventories and carry out various business tasks. These are also easy to use and learn. They help in the generation of business graphs, charts, tables, etc., easily.

## SPECIAL PURPOSE APPLICATION PACKAGES

The third group of software is the one specific for library needs. In a library one may wish to computerise any of the following functions :

1. Book acquisitions
2. Circulation of books
3. Serials/Periodicals control
4. List of additions
5. Publishing abstracting bullettin
6. Current Awareness bulletin
7. SDI
8. Information Retrieval

The list is not exhaustive. In order to computerise any of the above tasks, one should have a set

of progiams for each specific task. We may acquire Softwate Packages which cater to all the needs of a standard library. That is, one program package will do all the tasks. Such packages are called 'Integrated Packages'. We may also get special programs for the function which we wish to automate, say, a book acquisition package.

## FREE FOR ALL

Software discussion over, let us now look into other problems. As far as the first two categories are concerned (Operating Systems, Compilers, General Purpose Software), we in India are in a peculiar situation. The Indian buyer is being offered almost all such software free of charge along with the machine. "Come with your own Floppies and copy what ever you need" is generally heard from computer suppliers. Such software obtained is free for the asking but not without asking for problems.

## PROBLEMS OF PIRATED SOFTWARE

There are illegal, pirated versions of the original software. As such most vendors do not come to your rescue when you meet the bugs ! Original Software Manuals are not supplied. Some standard simple elementary 'third-party' text books are offered, in the place of manuals. Some vendors offer pirated versions (xerox copies) of entire original manuals which are illegible, and missing in vital copyright information or they don't tell you the version to which they belong ! Sometimes incomplete sets are

offered, pages missing or wrongly bound and so on. It is my impression that many vendors are not very knowledgeable about the differences between various versions (developments) of the several pieces of software they allow you to copy. They are offered "as is how is condition" with the task and risk of putting them to use on yourself !

## LIBRARY PACKAGES

Coming to Library oriented Application packages, we can either buy them from abroad or develop them locally within our organisations. Local development using resources within the organisation or employing external consultancy firms is a matter of choice and need.

## GOVERNMENT'S EFFORTS

It is wortwhile noting here that DSIR through its NISSAT program is offering package like CDS/ISIS (Minimicro version) and SUPERDOC. These are available free of charge to institutions like government laboratories, universities etc. They also offer suitable short term training programs, region wise. CDS/ISIS is an excellent integrated database development package. It is a retrieval software. But it is not very easy to learn and put to use for the fresher especially if one has to get full benefits of intricate aspects of CDS/ISIS.

## LOCAL SUPPLIERS

Given below are some Indian organisations involved in Software developments for library use :

1. Computer Technological Institute, Madras CLMS (Computerised Library Management System) Intergrated Package, (Hindu, 21-10-87. p. 30).
2. Hinditron Equipments Mfg. Co P. Ltd., Madras (Manufacturers of SN-PC XT/AT offer Library and Inf Retrieval Software)
3. Radig Cybernetics, Hyderabad have developed SDI System using d BASEII.
4. Frontier Technologies P. Ltd., Secunderabad : Intergrated Library Software Developers
5. Ultra Business Systems Pvt. Ltd , Bangalore : Library Catalog System.
6. Software Consulants, Annanagar, Madras : Interactive Bibliographic Retrieval Saftware.
7. Uptron India Ltd., New Delhi (Computer Manufacturers) offer SALIM (Software for Automation of Library Information Management) Integrated Package, Rs. 15,000/- (Requires their own special hardware).

When buying software packages, one has to look into price, portability, ease of use, maintenance costs, user friendliness, suitability according to local practices, etc.

## MANPOWER PROBLEM

Let us now turn our attention to the manpower problem. It is a myth as well as a paradox to say that computers render people jobless. This is not true. Introduction of computers in many fields only

increases job opportunities. According to one survey made by Indian Institute of Management, Ahmadabad, India needs 8200 Information Analysts, one lakh System Analysts/Programmers, about 5 lakh Data Entry Operators and 9000 teachers in this field in the next 5 years ! (ref Hindu 29-8-86. Harnessing Computers for development) Assuming that the plans to increase employment potentials will likely be very successful the development of manpower (trained and experienced personnel) however will definitely confront us. This is particularly so for the library. There are indeed not many available with enough of experience to handle the problems of Library automation. Training facilities need to be introduced and augmented. First teachers have to be trained. The problem can be tackled by several steps :

1. Changing the curricula of existing B. Lib. Sc. and M. Lib. Sc. courses to include the use of computers in library as a vital topic.
2. Providing hands on experience and short term courses for inservice people.
3. Changing, if possible, the attitudes of senior library administrators and help them fight "computer phobia".
4. Sharing experiences and software through local clubs, study forums and the like.
5. Encouraging institutions big and small, to buy cheap microcomputers to gain first hand experience.

———

## అనుబంధం – 1

# తీర్మానాలు

1. గ్రంథాలయాల నిర్వహణకు ప్రస్తుతం ప్రభుత్వం కేటాయిస్తున్న వార్షిక బడ్జెట్ విద్యా బడ్జెట్‌తో పోల్చి చూసినప్పుడు బహు స్వల్పంగా ఉన్నందున, గ్రంథాలయాల అభివృద్ధికి హెచ్చు నిధులు కేటాయించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించడమైనది. ఈ కేటాయింపు విద్యాశాఖ బడ్జెట్‌లో పౌర గ్రంథాలయాలకు కనీసం 10 శాతం, విశ్వ విద్యాలయాల బడ్జెట్‌లో గ్రంథాలయాలకు 15 శాతం ఉండాలని కోరడమైనది.

2. గ్రంథాలయ వ్యవస్థలో అనేక పరిపాలనా సమస్యల పరిష్కరణకు, గ్రంథాలయ సేవాభివృద్ధికి గోపాలరావు ఎక్బోటే కమిటీ చేసిన సిఫారసులను పరిశీలించి పౌర గ్రంథాలయ శాసనాన్ని సవరించటానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సత్వరం పూనుకోవాలని ఈ సదస్సు విజ్ఞప్తి.

3. ప్రైవేటు గ్రంథాలయాలకు తగు తోడ్పాటును, ప్రోత్సాహాన్ని కలిగించటానికి వావిలాల కమిటీ సిఫారసులను సమగ్రంగా పరిశీలన జరిపి ఉత్తర్వులనిప్పించాలని విజ్ఞప్తిచేస్తూ తీర్మానించడమైనది.

4. ఉత్తమ రాత ప్రతుల కాపీలను సమకాలీన రాత ప్రతులతో సహా సేకరించి, పరిశోధకుల ఉపయోగం కోసం కనీసం జిల్లా కేంద్ర గ్రంథాలయాల్లో భద్రపరచే చర్యలు చేపట్టాలని కోరడమైనది.

5. పుస్తక ప్రచురణలు నానాటికి పెరిగిపోతున్నవి. విపణికి వస్తున్న పుస్తకాల గురించిన వివరాలు తెలియటం లేదు. రచయితలు, ప్రచురణ కర్తలు కూడా తమ తమ పుస్తకాలను డెలివరి ఆఫ్ బుక్స్ ఆక్ట్ ప్రకారం రిజిస్ట్రార్ ఆఫ్ బుక్స్‌కు పంపనందున ప్రచురణల విషయం తెలుసుకోవటం సాధ్యంకావటంలేదు. ఇందువలన పుస్తకాల జాబితాలు కూడా సమగ్రంగా ఉండటంలేదు. కనుక డెలివరీ ఆఫ్ బుక్స్ ఏక్ట్ ప్రకారం అచ్చొత్తిస్తున్న అన్ని పుస్తకాలు రిజిస్ట్రార్ ఆఫ్ బుక్స్‌కు విధిగా పంపటానికి ప్రభుత్వం గట్టి చర్యలు చేపట్టవలసిన ఆవశ్యకత కలదని ఈ సదస్సు వక్కాణిస్తున్నది.

6. తెలుగు సాహిత్యంలో రచయితలచే స్వంతంగా ప్రచురితమయ్యే ఉత్తమ గ్రంథాలను నిర్ణీత సంఖ్యలో ప్రభుత్వంవారు కొనుగోలు చేసి ప్రోత్సహించాలని, ఉత్తమ రచనల నిర్ణయబాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయంచే నియమించబడే కమిటీకి అప్పగించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించడమైనది.

7. గ్రంథాలయ వనరుల సమష్టి సమీకరణలో సహకారావశ్యకత, ప్రాముఖ్యత ప్రస్తుత పరిస్థితుల్లో ఎంతైనా ఉన్నది. పరిమిత ఆర్థికవనరుల దృష్ట్యా మనదేశంలో సమష్టివనరుల సమీకరణ మరింత అవసరం. ఈ సహకార సమష్టి వనరుల సమీకరణను వివిధ గ్రంథాలయాల మధ్య చేపట్టవలసిన ఆవశ్యకతను గుర్తించడమైనది. దీనిని అమలు పరచటానికి ఆయా రకాల గ్రంథాలయాలు లేదా పౌరగ్రంథాలయాలు, విద్యావిషయక గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలమధ్య అమలు పరచటం సులభసాధ్యం. అదియేగాక భవిష్యత్తులో వివిధ గ్రంథాలయాల మధ్యకూడా వనరుల సమీకరణలో సహకారాన్ని పెంపొందించుకొనవచ్చును.

ఈ సమష్టి సహకారాన్ని అమలుపరచటానికి అంతర్గ్రంథాలయ అరువునియమావళిని రూపొందించి అమలు పరచటం ముఖ్యం. ఇది వరకే రూపొందించబడిన ఈ నియమావళికి పరిస్థితుల మార్పు దృష్ట్యా అవసరమైన సవరణలనుచేసి అమలుపరచే ఆవశ్యకతను ఈ సదస్సు గుర్తించినది.

సహకారం అమలు చేయటానికి అవసరమైన వాఙ్మయ పరికరాలను చేకూర్చుకోవడంలో సంబధిత అధికారుల సహకారంకూడ ఉండాలని ఈ సదస్సు ఏకగ్రీవంగా ఆమోదించినది.

8. అంతర్జాతీయ పరిణామాలు, పరిస్థితుల దృష్ట్యా మనదేశంలో వాఙ్మయ నియంత్రణకు (బిబ్లియోగ్రాఫికల్ కంట్రోల్) తగిన సత్తువ చేకూర్చేనిమిత్తం, అలాగే జాతీయ వాఙ్మయ నియంత్రణ కార్యక్రమాన్ని అంతర్జాతీయ వాఙ్మయ నియంత్రణకు అనుసంధానం చేసే విధంగా కూడ అవసరమైన వ్యవస్థీకరణ కార్యకలాపాలు, తద్విషయమైన ప్రణాళికలు పునస్సమాలోచనం గావించబడాలి. జాతీయ స్థాయిలో వివిధ భాషా వర్గాలకు సరిపోయే విధంగా ముఖ్యంగా తెలుగువాఙ్మయ నియంత్రణకు వీలుగా, వర్గీకరణ పథకం, సూచీకల్పం, విషయ శీర్షిక జాబితాలు, వ్యక్తినామాలు, తదితర భాషాపర సమస్యలు మొదలైన విషయ పరిశోధనలు, వాటితోపాటుగణక యంత్ర అనువర్తనాన్ని అత్యవసర ప్రాతిపదికపైన చేపట్టవలసి ఉన్నది.

ఇందునిమిత్తం ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయశాఖ, తెలుగు విశ్వవిద్యాలయం, సంయుక్తంగా ఒక నిపుణుల సంఘాన్ని నియమించి డ్యూయీ దశాంశ వర్గీకరణ పథకం, ఎ. ఎ. సి. ఆర్. కల్పం 2 ను, వాటితో ద్విబిందు వర్గీకరణ పథకం, విషయ శీర్షిక జాబితా, వ్యక్తినామ

సంబధమైన నమోదు అధికార పట్టిక తదితర వాఙ్మయ ప్రక్రియా సాధనాలను రూపొందించే బాధ్యతలను ఆ నిర్ణయ కమిటీకి అప్పగించాలి.

9. గ్రామీణ జనాభాలో అత్యధికులు నిరక్షరాస్యులే కనుక గ్రామీణ స్థాయిలో, మండల స్థాయిలో గల గ్రంథాలయాల్లో పుస్తకాలు, పత్రికలతోపాటు విస్తరణ కార్యక్రమాలు అంటే సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలు, నిర్వహించటానికి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ తగిన ఏర్పాట్లు చేయాలని కోరుతూ ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

10. జిల్లా కేంద్ర గ్రంథాలయాల్లో, ప్రభుత్వ గ్రంథాలయాలు, విశ్వవిద్యాలయ తదితర విద్యాలయ గ్రంథాలయాల్లో విధిగా సాంస్కృతిక విభాగం ఏర్పాటుచేసి అందుకు ప్రథమ శ్రేణి గ్రంథాలయాధికారి స్థాయిలో ఒక సుశిక్షితుని నియమించి మాసవారిగా సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలు తప్పనిసరిగా నిర్వహించేందుకు వీలుగా గ్రంథాలయ బడ్జెట్‌లో ఒక శాతం కేటాయించునట్లు పౌర గ్రంథాలయశాఖ, ప్రభుత్వం ఆయా గ్రంథాలయాల పాలకవర్గాలు ఉత్తర్వులొసంగాలని కోరుతూ తీర్మానించడమైనది.

11. గ్రంథాలయాలు జాతీయదేవాలయాలు, ప్రజా విశ్వవిద్యాలయాలు గనుక అన్ని వర్గాలకు వీలుగా అందుకు తగిన సాహిత్యం (పుస్తకాలు, పత్రికలు)తో పాటు టెలివిజన్, రేడియో, ప్రొజెక్టర్, మైకు, టేప్‌రికార్డరు, ఫోటోస్టాట్, ఇత్యాది ఆధునిక యంత్రపరికరాలు, దృశ్య శ్రవణసామగ్రిని ఏర్పాటు చెయ్యాలనీ, వీటిని జిల్లా కేంద్ర గ్రంథాలయాల్లో తక్షణమే ఏర్పాటుచేసి మిగతా గ్రంథాలయాల్లో క్రమంగా

ఏర్పాటుచేయటానికి పౌరగ్రంథాలయ శాఖ, ప్రభుత్వం తక్షణం చర్య తీసుకోవాలని కోరుతూ తీర్మానించడమైనది.

12. గణకయంత్రాలపై సిబ్బందికి శిక్షణ ఇవ్వడానికై శిక్షణా శిబిరాలను మనదేశంలో కనీసం ఐదు ప్రాంతాలలోనైనా స్థాపించి పని చేస్తున్న సిబ్బందికి పూర్తి శిక్షణ ఇవ్వాలని తీర్మానించడమైనది.

13. రాబోయే సిబ్బందికి అనుకూలంగా నడుపుతున్న గ్రంథాలయ శిక్షణ కోర్సులలో గణక యంత్రాలను గురించి పాఠ్యాంశాలను ఆచరణయోగ్యంగా ఉంచాలని తీర్మానించడమైనది.

14. శిక్షణ ఇవ్వటంలో ప్రస్తుతం ఉపాధ్యాయులకు అమలులో ఉన్న ఎఫ్.ఐ.పి. వలె ఎల్.ఐ.పి. వసతిని గ్రంథాలయ సిబ్బందికి కల్పించాలని విశ్వవిద్యాలయ విరాళాల సంఘాన్ని కోరాలని తీర్మానించడమైనది.

15. విజ్ఞానం పెరుగుతున్న దృష్ట్యా గణకయంత్రాలు చౌకగా లభ్యమవుతున్న దృష్ట్యా అధిక సేవలను అతి స్వల్పవ్యవధిలో అమిత సామర్థ్యముతో ఖచ్చితంగా సరియైన పద్ధతిలో అందించటానికి గ్రంథాలయ యంత్రీకరణకు గ్రంథాలయాధికారులు, యాజమాన్యాలు తోడ్పడాలని తీర్మానించడమైనది.

16. తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం తమ ఇతర విధులతో పాటు అపూర్వ గ్రంథ సేకరణ, అముద్రిత గ్రంథాల ప్రతుల సేకరణ, వాటి ముద్రణకు సహాయం మొదలైన కార్యకలాపాలను తెలుగుభాష, సాహిత్యం, సంస్కృతి, అభివృద్ధి చెందే విధంగా కార్యకలాపాలను చేపట్టితే పైవిషయాల్లో ఆసక్తిగలవారందరికీ ఎంతో ఉపయోగకరంగా ఉంటుందని ఈ సదస్సు అభిప్రాయం.

17. డిశంబరు 13-15 తేదీలలో తెలుగువిశ్వవిద్యాలయం ఏర్పాటు చేసిన "గ్రంథాలయ వనరులు-సమష్టి సమీకరణ" సదస్సులో చదువ బడిన ప్రసంగవ్యాసాలను, దానితోపాటు ఇంకను రావలసిన వ్యాసాలను కూడ ముద్రించి వీలైనంత త్వరగా సదస్సులో పాల్గొనిన వారందరికి పంపటానికి తెలుగు విశ్వవిద్యాలయ కులపతిగారిని అభ్యర్థించడమైనది.

18. ఈ సదస్సును అత్యంత నైపుణ్యంగా నిర్వహించి ఆంధ్ర దేశంలోని వివిధ గ్రంథాలయాధికారులను, గ్రంథాలయ కార్యకర్తలను ఆహ్వానించి అత్యంత ప్రయోజనకరంగా రూపొందించి జయప్రదం చేసి నందులకు విశ్వవిద్యాలయ కులపతులవారిని, కులసచివులవారిని, గ్రంథా లయాధికారిని, వారి సిబ్బందిని సదస్సు ఏకగ్రీవంగా అభినందిస్తూ తీర్మానించడమైనది.

—(o)—

## అనుబంధం - 2

# సదస్సులో పాల్గొన్న వారి జాబితా

అశోక్ బాబు, బి
సమాచార, సాంకేతికాధికారి
డి. ఆర్. డి.యల్
కాంచన్ బాగ్.
హైదరాబాదు.

గిరిధరరావు, ఆర్.
గెజిటెడ్ గ్రంథపాలకుడు
రాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయం
తిరుపతి

అహ్మద్, ఇక్బాల్ ముజాఫర్
సహాయ సంచాలకులు
రాష్ట్ర పౌర గ్రంథాలయ శాఖ
హైదరాబాదు

చంద్రశేఖరరావు, వి
అసిస్టెంట్ ప్రొఫెసర్
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక
విశ్వవిద్యాలయం
సోమాజిగూడ, హైదరాబాదు

ఆగంరెడ్డి, ఎస్
సహాయగ్రంథాలయాధికారి
జె ఎన్.టి.యు.
కుకట్ పల్లి, హైదరాబాదు

చంద్రశేఖరరావు, వి
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
మచిలీపట్టణం

కృష్ణవిఠల్, కె.వి.
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
విజయనగరం

చెంమల్కర్, వి.డి.
గ్రంథాలయాధికారి
విద్యాకళాశాల, ఉస్మానియా
విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 7

జగ్గారావు, ఎన్.వి.
సహాయ గ్రంథాలయాధికారి
ఎ.ఎస్.ఆర్.సి.
ఉస్మానియా క్యాంపస్
హైదరాబాదు - 7

జనార్ధన్ రెడ్డి
గ్రంథపాలకుడు అండ్ కార్యదర్శి
నగర కేంద్ర గ్రంథాలయం
అశోక్ నగర్, హైదరాబాదు-20

పాండురంగం, జె.
గ్రంథపాలకులు అండ్ కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
నిజామాబాదు

పాండురంగారెడ్డి, ఎస్.
కార్యదర్శి, జిల్లా గ్రంథాలయ
సంస్థ
వికారాబాదు, రంగారెడ్డి జిల్లా

మల్లికార్జునరావు, కె
కార్యదర్శి, జిల్లా గ్రంథాలయ
సంస్థ
విశాఖపట్టణం

మురహరిరావు, కె
కార్యదర్శి,
అకాడమీ ఆఫ్ "రూరల్
డెవలప్‌మెంట్ అండ్ రిసెర్చ్
హైదరాబాదు

రంగాచార్యులు, వి
కార్యదర్శి, జిల్లా గ్రంథాలయ సంస్థ
నల్లగొండ

రంగారెడ్డి, కె.వి.
గ్రంథాలయాధికారి
ఇంజనీరింగ్ కళాశాల,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు-7

రమణయ్య, టి.వి
గ్రంథపాలకుడు
ప్రాంతీయ గ్రంథాలయం
విశాఖపట్టణం.

రవీంద్రాచారి, ఎ
లెక్చరర్
గ్రంథాలయ సమాచారశాస్త్రం
పి.జి. కాలేజ్ ఆఫ్ సోషల్‌వర్క్
హైదరాబాదు

రాజేంద్రప్రసాద్, ఎస్
ఒంగోలు

రామచంద్రారెడ్డి, సి
గ్రంథాలయాధికారి
సెంటర్ ఫర్ జియోఫిజిక్స్
ఉస్మానియా క్యాంపస్
హైదరాబాదు - 7

రామారావు, కె
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
మెదక్

లక్ష్మీకాంతరావు, బి
గ్రంథపాలకులు అండ్ కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ, ఖమ్మం

వెంకటరామయ్య, వి
ఇన్‌చార్జ్ కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
వరంగల్

వెంకట్రామరెడ్డి, బి
సంయుక్త కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ
సంఘం
గుత్తి, అనంతపురం జిల్లా

వెంకటేశ్వర్లు, బి
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
కర్నూలు

వేదామృతం, జి.వి.
గ్రంథపాలకులు
రాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయం
గుంటూరు

శ్రీనివాసరెడ్డి, వి
గ్రంథాలయసహాయకుడు
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్

శ్రీరామమూర్తి, కె
సహాయసంచాలకులు
ఆంధ్రప్రదేశ్ పౌర
గ్రంథాలయాల శాఖ
హైదరాబాదు.

శ్రీహరిరావు, కె
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
గుంటూరు

సుబ్బారావు, బి.వి.
గ్రంథపాలకులు
రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం
అఫ్జల్ గంజ్
హైదరాబాదు

సీతారామయ్య, కె
ప్రభుత్వ సంచార గ్రంథాలయం
ఏలూరు
పశ్చిమగోదావరి జిల్లా

హనుమంతరెడ్డి, బి
కార్యదర్శి
జిల్లా గ్రంథాలయ సంస్థ
మహబూబ్‌నగర్

సుజాత, జి
సహాయగ్రంథాలయాధికారి
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక
విశ్వవిద్యాలయం
సోమాజిగూడ, హైదరాబాదు

హరికృష్ణారెడ్డి, ఎస్.
ప్రచురణాధికారి
జాతీయ మానసిక
వికలాంగుల సంస్థ
సికింద్రాబాదు

—(౦)—

# అనుక్రమణిక

సంకలనం

లింగాల పాండురంగయ్య, బిక్కి రామభీమప్ప

—: o :—

